# మా ప్రచురణలు









వెల రూ. 16/- వెల రూ. 20/- వెల రూ. 17/- వెల రూ. 40/-










వెల రూ. 25/- వెల రూ. 20/- వెల రూ. 25/- వెల రూ. 40/-









వెల రూ. 100/- వెల రూ. 30/- వెల రూ. 30/- వెల రూ. 40/-










వెల రూ. 10/- వెల రూ. 10/- వెల రూ. 5/-






**AL-FAROOQ PUBLICATIONS**
20/373, Mastan vali Street, KADAPA-516 001.
Ph : 08562 - 245161, 9885409930, 9440708070
e-mail : alfarooqpublications@gmail.com
website: www.kadapaciws.org




సయ్యద్ నశీర్ అహమ్మద్

# కువైట్ కబుర్లు





అల్ ఫారూఖ్ పబ్లికేషన్స్, కడప

# ‘కువైట్’ కబుర్లు

## సయ్యద్ నశీర్ అహమ్మద్




**అల్ ఫారూఖ్ పబ్లికేషన్స్**

**20 / 373, మస్తాన్ వలీ స్ట్రీట్**

**కడప–516 001.**



‘కువైట్’ కబుర్లు

My Visit to Kuwait

సయ్యద్ నశీర్ అహమ్మద్

**Syed Naseer Ahamed**



ముద్రణ : 2015

ముఖపత్రాలంకరణ : **నలబోతు జయరాజు, వినుకొండ**

ముద్రణ : **అల్ బసీర్ గ్రాఫిక్స్, హైదరాబాద్, 9441055065**

**ప్రకాశకులు:**

**అల్ ఫారూఖ్ పబ్లికేషన్స్**

22/373, మస్తాన్ వలి స్ట్రీట్

**కడప – 516 001.**

వైయస్సార్ జిల్లా, ఆంధ్రప్రదేశ్ ఇండియా

దూరవాణి : **0862-245161, 9885409930, 9440708070**

ciwskadapa@gmail.com, alfarooqpublications@gmail.com

**మూల్యం : రూ.40-00**

# ప్రకాశకుల మాట

అరబ్బు ద్వీపాలలో ఒక్క కువైట్ ఎటువంటి దేశమంటే అక్కడ పేరుకు మాత్రమే కుటుంబ పాలన ఉంది. కువైట్‌లో నివాసం వుంటున్న ఇతర దేశాల వారికి మతపరంగా, సామాజికపరంగా, ఆర్థికపరంగా అన్ని విధాలా స్వేచ్ఛ ఉంది. స్థానికుల కంటే కూడా ఇతర దేశస్తులు ఇక్కడ పెద్ద సంఖ్యలో వున్నారు. 1950కు ముందు నుంచే భారతీయులు కువైట్‌లో వుంటున్నారు. ప్రస్తుతం సుమారుగా ఏడున్నర లక్షల మంది భారతీయులు కువైట్‌లో నివాసముంటున్నారు. వారిలో 2 లక్షల మంది ఆంధ్రప్రదేశ్‌వాసులు ఉండగా, అందులోనూ లక్షమంది కడప జిల్లా వారవటం విశేషం.

కువైట్ ఒక చిన్న సుందరమైన దేశం. ఈ దేశవాసులు విశాల హృదయులు, పరమత సహనశీలురు. ప్రాంతం, వర్ణం, వంశం, మతం ప్రాతిపదికపై అక్కడ ఎవరి పట్లా వివక్ష చూపబడదు. అన్ని దేశాల వారికి, అన్ని మతాల వారికి అక్కడ నివాసముండి అభివృద్ధి చేసుకునే అవకాశాలు ఉన్నాయి.

కడప ఇస్లామిక్ వెల్ఫేర్ సొసైటీ 1984లో కువైట్‌లో స్థాపించబడింది. కనుక 2015 సంవత్సరంలో 66వ భారత గణతంత్ర దినోత్సవంతోపాటు కడప సొసైటీ 30 వసంతాల వేడుకలు కూడా జరుపుకుంది. ఈ సందర్భంగా ముఖ్య అతిథిగా ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ చీఫ్ విప్ మేడా మల్లికార్జున్ రెడ్డి (ఎం.ఎల్.ఏ. రాజంపేట్) గారిని, గౌరవ అతిథిగా ప్రముఖ చరిత్రకారులు సయ్యద్ నశీర్ అహమ్మద్ గారిని ఆహ్వానించటం జరిగింది.

కువైట్ ప్రయాణ సంగతులను సయ్యద్ నశీర్ అహమ్మద్ వ్రాసుకున్నారు. స్వదేశానికి వచ్చిన తరువాత ఆ విశేషాలను మరింత వివరంగా ఒక పుస్తకరూపంలోకి తీసుకొచ్చారు. ఆ పుస్తకాన్ని అల్ ఫారూఖ్ పబ్లికేషన్స్, కడప వారు “కువైట్ కబుర్లు” అన్న పేరుతో ప్రచురించటం జరుగుతోంది. దీని ద్వారా కువైట్ చరిత్ర, అక్కడి పరిస్థితులు అవగాహనలోకి వస్తాయని, మరోవైపు కడప ఇస్లామిక్ వెల్ఫేర్ సొసైటీ చరిత్ర గురించి సంస్థతో సంబంధమున్న శ్రేయోభిలాషుల గురించి సంస్థ ఆశయాలు, పని తీరు గురించి కూడా పరిచయం ఏర్పడుతుందని భావించాం. పాఠకులు మా ఈ కృషిని ఆమోదిస్తారని ఆశిస్తున్నాం.

**– షేఖ్ ఇస్‌హాఖ్ అలీ**

డైరెక్టర్, అల్‌ఫారూఖ్ పబ్లికేషన్స్

# మా మాట

- ప్రచురణకర్తలు



# ధన్యవాదాలు

**నా** 'కువైట్ సందర్శన' 28-01-2015 ఉదయం నుండి 05-02-2015 రాత్రి వరకు, పూర్తిగా తొమ్మిది రోజులపాటు సాగింది. ఈ సందర్భంగా నా సందర్శన అనుభవాలు 'కువైట్ కబుర్లు' గా రాయాల్సిందిగా సూచిస్తూ 'కడప ఇస్లామిక్ వెల్ఫేర్ సోసైటీ' వ్యవస్థాపక అధ్యక్షులు శ్రీ షేక్ ఇస్హాఖ్ అలీ ఆరంభం నుండి ఉత్సాహపరుస్తూ వచ్చారు. మేమిరువురం ఈ తొమ్మిది రోజులు కలసిమెలసి ఒకే చోట ఉంటున్నందున, ప్రతిరోజు కార్యక్రమాలు ముగించుకుని రాత్రికి మా బసకు చేరుకొగానే, ఆ రోజు నాటి కార్యక్రమాలు, వాటి విశేషాలను రాసి పెట్టమంటూ, ఆయా విషయాలను ప్రతిరోజు రాత్రిపూట శ్రీ ఇస్హాఖ్ అలీ గుర్తు చేస్తూ రావడం వలన తొమ్మిది రోజుల వివరాలను అటు ఇటుగా నమోదు చేసిపెట్టాను.

ఆ సమాచారం అధారంగా, నాకు గుర్తు ఉన్నంత వరకు 'కువైట్ కబుర్లు' రూపు దిద్దుకుంది. నా సందర్శనకు సంబంధించిన విషయాలకు సరదాగా వెల్లడిస్తూ కొంత 'కువైట్' చరిత్ర మరికొంత 'సొసైటీ' చరిత్రను ఈ పుస్తకంలో జతపర్చాను. ఈ పుస్తకాన్ని పూర్తి స్థాయిలో రూపొందించాక ముసాయిదా ప్రతిని కడపలోని శ్రీ షేక్ ఇస్హాఖ్ అలీ, 'సోసైటీ నేతలు' లకు అంతర్జాలం ద్వారా అందించాను. ఈ ముసాయిదా ప్రతిని మిత్రులు క్షుణ్ణంగా పరిశీలించి చేర్పులు-మార్పులు సూచించారు. ఆ సూచనల మేరకు పలు మార్పులు చేర్పులతో తయారయిన మలి ప్రతిని మిత్రుల మరోమారు పరిశీలించాక 'కువైట్ కబుర్లు' ప్రచురణకు అందజేశాను.

ఈ 'కువైట్ కబుర్లు' రూపకల్పనకు అవసరమైన సమాచారం ముఖ్యంగా ఫోటోలు అందించడంలో సహకరించిన కువైట్‌లోని 'సోసైటీ' ప్రధాన బాధ్యులు శ్రీ షేక్ న్యామతుల్లా, శ్రీ మహమ్మద్ హనీఫ్, శ్రీ పఠాన్ షౌకత్ అలీ ఖాన్, కువైట్ 'సోసైటీ' యువత శ్రీ షేక్ నిజాముద్దీన్, శ్రీ యస్ అజీజ్ ఖాద్రి, శ్రీ షేక్ యజ్దాని, శ్రీ షేక్ ఇంతియాజ్, 'నెలవంక' మాసపత్రిక సంపాదకులు మౌలానా శ్రీ సయ్యద్ అబ్దుల్ సలాం ఉమ్రి, శ్రీ యండి. అహమ్మద్ (నెల్లూరు), శ్రీ సయ్యద్ అల్లాహ్ బక్ష్ (కువైట్)లకు నా మప్పిదాలు. ఈ గ్రంథానికి కవర్ డిజైన్ చేసిన మిత్రులు శ్రీ నలబోతు జయరాజు (దీప్తి గ్రాఫిక్స్, వినుకొండ), అందంగా ముద్రించి ఇచ్చిన అల్ బసీర్ గ్రాఫిక్స్, హైదరాబాద్ వారికి, ఈ ప్రచురణకు సంసిద్ధత తెలుపుతూ ప్రోత్సహించిన 'కడప ఇస్లామిక్ వెల్ఫేర్ సొసైటీ' నాయకులకు, ప్రచురించిన 'అల్ ఫారూఖ్ పబ్లికేషన్స్' సంస్థకు నా హృదయపూర్వక ధన్యవాదాలు. ◆

**- సయ్యద్ నశీర్ అహమ్మద్.**



# 'కువైట్' కబుర్లు

**కు**వైట్ పర్యటన గురించి రాస్తే బాగుంటుందని కువైట్‌లో ఉండగానే విదేశంలోని స్వదేశీ మిత్రులు కోరడం, స్వదేశానికి వచ్చాక మిత్రులు, సన్నిహితులు కోరుతూ రావడంతో 'కువైట్ కబుర్లు' రాయాలకున్నాను. ఆ తరువాత 'కువైట్ కబుర్లు' ఎక్కడ నుండి ఆరంభించాలన్న ఆలోచనలో పడ్డాను. కువైట్ సందర్శనావకాశం నాకు 2015లో లభించినా కువైట్‌లోని తెలుగు పాఠకులకు నా వ్యాసాలు, ఆ తరువాత నా గ్రంథాలు పరిచయం కావడం మాత్రం పదిహేనేండ్ల క్రితం ఆరంభమైంది.

ఆ కారణంగా 2015 జనవరి 28 ఉదయం నుండి ఫిబ్రవరి 05 రాత్రి వరకు సాగిన నా 'కువైట్ సందర్శన'ను 'కువైట్ కబుర్లు'గా నా పర్యటన వివరాల వరకు మాత్రమే నమోదు చేయడం కంటే ఈ సందర్శన నేపథ్యాన్ని, ఈ నేపథ్యంలోని వ్యవస్థల, వ్యక్తుల, పత్రికల, తెలుగు పాఠకుల, తెలుగు ప్రజల పాత్రను కూడా రంగం మీదకు తీసుకవస్తే బాగుంటుందన్పించింది. ఈ ఆలోచన మిత్రులకు కూడా నచ్చింది. అలనాటి జ్ఞాపకాలను గుర్తుకు తెచ్చుకోవడం ఆరంభించి, ఆ జ్ఞాపకాల దొంతరల నుండి రాబట్టిన సమాచారాన్ని మీ ముందుంచుతున్నా.





గత పదిహేనేళ్ళుగా నాకు పరిచయం ఉన్న నా నెల్లూరు మిత్రులు, 'కువైట్ అహమ్మద్' గా పిలువబడే శ్రీ యం.డి అహమ్మద్ 'కడప ఇస్లామిక్ వెల్ఫేర్ సొసైటీ', ఆ సొసైటీ వ్యవస్థాపక అధ్యక్షులు శ్రీ షేక్ ఇస్హాఖ్ అలీ గురించి నాకు పదే పదే చెబుతూ వచ్చారు. నా కడప జిల్లా పర్యటనలలో 'సొసైటీ' కార్యాలయాన్ని సందర్శించమని, శ్రీ షేక్ ఇస్హాఖ్ అలీని కలసి మాట్లాడమన్నారు. కడపకు చెందిన పాత్రికేయ మిత్రులు షేక్ మస్తాన్ వలీ, ఆవాజ్ జిల్లా నాయకులు శ్రీ యండి. మగ్బూల్‌ల ఆహ్వానం, ఇతర మిత్రుల పిలుపు మేరకు కడప జిల్లాలో జరిగిన వివిధ సభలు, సమావేశాల్లో పాల్గొనేందుకు నేను పలుమార్లు కడపకు వెళ్ళినప్పటికి 'కడప ఇస్లామిక్ వెల్ఫేర్ సొసైటీ' కార్యాలయాన్ని చాలా కాలం వరకు సందర్శించ లేదు. ఈ క్రమం దశాబ్దం కాలంగా సాగుతూ వచ్చింది.

1998 నుండి 'భారత స్వాతంత్ర్యోద్యంలో ముస్లింల పాత్ర' గురించి రాయడం ఆరంభించక ముందు నుండి 'తెలుగు ఇస్లామిక్ పబ్లికేషన్స్, హైదరాబాద్' ఆధ్వర్యంలో వెలువడుతున్న 'గీటురాయి' వారపత్రికతో నాకు ప్రత్యక్ష పరిచయం ఉంది. ఆ పత్రికలో వివిధ అంశాల మీద సంపాదకులు శ్రీ ఎస్.ఎమ్. మలిక్, శ్రీ అబ్దుల్ వాహెద్‌ల ప్రోత్సాహంతో వ్యాసాలు రాశాను. ఆ విధంగా ఏర్పడిన పరిచయాలలో ఒకనాడు నెల్లూరు మిత్రులు శ్రీ అహమ్మద్ నన్ను 'తెలుగు ఇస్లామిక్ పబ్లికేషన్స్, సంచాలకులు శ్రీ అబ్బాదుల్లా వద్దకు తీసుకెళ్ళి పరిచయంగావించారు. ఆ పరిచయం 'గీటురాయి' పత్రిక తోపాటుగా 'తెలుగు ఇస్లామిక్ పబ్లికేషన్స్', ఆ తరువాత 'జమాఅతె ఇస్లామీ హింద్' ఆంధ్రప్రదేశ్–ఒరిస్సా శాఖ అధ్యక్షులు శ్రీ అబ్దుల్ బాసిత్ అన్వర్‌తో పరిచయం కలిగించింది.

ఈ పరిచయాల మూలంగా 1995 నుండి 'గీటురాయి' పత్రికకు వ్యాసాలు రాయడం ఆరంభించిన నేను 2005 వరకు ఏ నెల కూడా క్రమం తప్పకుండా వివిధాంశాల మీద పలు వ్యాసాలు అందించాను. ఆ క్రమంలో 2000లో నేను ప్రచురించిన 'భారత స్వాతంత్ర్యోద్యమం : ముస్లిం మహిళలు' గ్రంథాన్ని విజయవాడలో చూసిన శ్రీ బాసిత్ నా ప్రచురణలను ప్రోత్సహిస్తామన్నారు. ఆ వాగ్దానానికి అనుగుణంగా శ్రీ అబ్బాదుల్లా కార్యరూపమిచ్చి, నా రచనల పునర్ముద్రణకు చేయూతనిచ్చారు. శ్రీ అబ్బాదుల్లా క్రియాశీలక ప్రోత్సాహంతో 'గీటురాయి'లో నా గ్రంథాలు ఒక్కొక్కటిగా ధారావాహికంగా ప్రచురితం అయ్యాయి. ఈ విధంగా 'భారత స్వాతంత్ర్యోద్యంలో ముస్లింల పాత్ర'కు సంబంధించిన సమాచారాన్ని మోసుకొస్తున్న 'గీటురాయి' దశాబ్దాల క్రితం నుండి రాష్ట్రం మాత్రమే కాకుండా మన దేశం సరిహద్దులు దాటి విదేశాలకు వెళ్ళడం ఆరంభమైనందున నేనందిస్తున్న సమాచారం కూడా విదేశాలకు చేరసాగింది.

## కువైట్ తెలుగు పాఠకులకు నా పరిచయం

ఈ సంచయం వలన 'సొసైటీ' సభ్యులు, ఇతరుల ప్రయత్నాల ఫలితంగా 'గీటురాయి' క్రమం తప్పకుండా 'కువైట్' చేరుతూ రావడంతో నేను రాస్తున్న 'భారత స్వాతంత్ర్యోద్యమంలో ముస్లింల పాత్ర' కువైట్‌లోని తెలుగు పాఠకులకు పరిచయం కాసాగింది. ఆ తరువాత శ్రీ అబ్బాదుల్లా ప్రోత్సాహం ఫలితంగా నా ఏడు గ్రంథాలను 'తెలుగు ఇస్లామిక్ పబ్లికేషన్స్ ట్రస్ట్' పునర్ముద్రించింది. నా '1857 ః ముస్లింలు' గ్రంథాన్ని మాత్రం స్వయంగా 'ట్రస్ట్' ప్రచురించింది. ఈ పబ్లికేషన్స్ ద్వారా, ఇతర మిత్రుల ద్వారా నా గ్రంథాలు విదేశాలలో ప్రధానంగా గల్ఫ్ దేశాలలో ఉన్న తెలుగు పాఠక మిత్రులకు క్రమం తప్పక అందుతూ వచ్చాయి. ఆ కారణంగా 'భారత స్వాతంత్ర్యోద్యమంలో ముస్లింల పాత్ర'ను వివరిస్తూ గ్రంథాలు రచించి, ప్రచురిస్తున్న నేను రచయితగా, ప్రచురణకర్తగా, వ్యాసకర్తగా గల్ఫ్ దేశాలలో ఉన్న తెలుగు పాఠకులతోపాటుగా ప్రత్యేకంగా కువైట్‌లోని పాఠక మిత్రులకు సన్నిహితం కాసాగాను.

నా పట్ల, నా వ్యాసాలు, నా గ్రంథాల పట్ల ప్రత్యేక శ్రద్ధను చూపుతున్న శ్రీ యం.డి. ఆహమ్మద్ కూడా నేను ప్రచురిస్తున్న గ్రంథాలను ఎప్పటికప్పుడు తన మిత్రుల ద్వారా, 'సోసైటీ' సోదరుల ద్వారా ఇటు 'సోసైటీ' బాధ్యులకు, అటు కువైట్‌లోని తన మిత్రులకు అందజేయడం ఒక నిరంతర ప్రక్రియగా సాగించారు. 1998లో నా తొలి గ్రంథం 'భారత స్వాతంత్ర్యోద్యమం ః ముస్లిం మహిళలు' వెలువడినప్పటి నుండి వరుసగా వచ్చిన నా ఇతర గ్రంథాలు ప్రచురితం కావడమే ఆలశ్యం వాటిని కువైట్‌లో తెలుగు పాఠక మిత్రులకు అందజేయడం ఒక బాధ్యతగా నిర్వహిస్తూ, కువైట్ తెలుగు పాఠక మిత్రులకు నా గ్రంథాల ద్వారా నన్ను కూడా మరింత సన్నిహితం చేయసాగారు.

ఈ క్రమంలో తాజాగా '1757 నుండి 1947 వరకు బ్రిటిష్ వలస పాలకులకు వ్యతిరేకంగా సాగిన పోరాటాలలో పాల్గొన్న భారత ఉపఖండంలోని 155 మంది ముస్లిం యోధుల చిత్రపటాలు, సంక్షిప్త వివరాలు' పొందుపరుస్తూ ఆంగ్లం-తెలుగు భాషల్లో నేను ప్రచురించిన ఆల్బమ్ 'చరితార్థులు' 2014లో వెలువడగానే యధాప్రకారం దానిని కూడా కువైట్ చేర్చడానికి శ్రీ యం.డి ఆహమ్మద్ ప్రయత్నాలు ఆరంభించారు.

ఈ ప్రయత్నాలు ఇలా సాగుతుండగా కువైట్‌లోని 'ఇస్లామిక్ ప్రెజన్‌టేషన్ కమిటీ'ఆధ్వర్యంలో మౌలానా సయ్యద్ అబ్దుల్ సలాం ఉమ్రి సంపాదకత్వంలో వెలువడు తున్న 'నెలవంక' తెలుగు మాసపత్రిక నా రచనల గురించి పరిచయ వ్యాసాలను ప్రచురించ





సాగింది. ఆ క్రమంలో ఆగస్టు 2012 నాటి 'నెలవంక'లో త్వరలో వెలువడనున్న 'చరితార్థులు' ఆల్బమ్ ముఖచిత్రాన్ని ప్రచురిస్తూ వివరాలను సంక్షిప్తంగా వెలువరించింది. ఆ తరువాత కూడా నా గ్రంథాలలోని పలు అంశాలను స్వీకరించి, తమ పత్రికల్లో మౌలానా అబ్దుల్ సలాం ఉమ్రి ప్రచురిస్తూ వచ్చారు. 'చరితార్థులు' ఆల్బమ్ లోని కొన్ని విషయాలను ప్రచురించి 'ఆల్బమ్'కు మంచి ప్రాచుర్యం కల్పించారు.

## కువైట్ చేరిన 'చరితార్థులు'

ఆగస్టు 12, 2014న ఆగస్టు 12న నాకు ఫోన్‌చేసి 'చరితార్థులు' గ్రంథాన్ని కువైట్ నుండి కడపకు వచ్చియున్న తన మిత్రుడు శ్రీ సి.ముస్తఫా రెడ్డి గారి కోసం 'కడప ఇస్లామిక్ వెల్ఫేర్ సొసైటీ' చిరునామాతో 'చరితార్దులు' ప్రతిని పంపమని కోరారు. ఆయన మాట మీద ఆల్బమ్‌ను ఆగస్టు 13న కడపకు కొరియర్ చేశాను. అది ఆగస్టు 16న 'సొసైటీ' కార్యాలయంలోని బాధ్యులకు చేరి అటునుండి శ్రీ ముస్తఫా రెడ్డికి అందింది. ఈ లోగా కడప చేరుకున్న శ్రీ అహమ్మద్ ఆల్బమ్ విశిష్టతను కడప మిత్రులకు తెలుపుతూ శ్రీ ముస్తఫా రెడ్డిచే ఆగస్టు 16 రాత్రి నాతో మాట్లాడించారు. నాతో సాగిన సంభాషణ పట్ల ఎంతో ఆసక్తి చూపిన శ్రీ ముస్తఫా 'చరితార్దులు' ఆల్బమ్‌ను పరిశీలించి, దానిని తనతోపాటుగా కువైట్‌కు తప్పకుండా తీసుక వెళ్ళి కువైట్‌లోని 'కడప ఇస్లామిక్ వెల్ఫేర్ సొసైటీ' సభ్యులకు, ఇతర మిత్రులకు పరిచయం చేయగలనని వాగ్దానం చేశారు. ఆ వాగ్దానం ప్రకారంగా 'చరితార్దులు' 2014 ఆగస్టు మాసంలో కువైట్ చేరుకుంది. అది అటునుండి కువైట్ లోని 'సొసైటీ' నాయకుల దృష్టిలో పడింది.

2014 ఆగస్టు చివరికల్లా కువైట్ చేరుకున్న ఆల్బమ్‌ను చూసిన మౌలానా సయ్యద్ అబ్దుల్ సలాం అంతర్జాలం ద్వారా ఆగస్టు 30న నాతో చాటింగ్ చేశారు. ఆ సందర్భంగా నా రచనలు, నా కృషి గురించి ప్రస్తావిస్తూ మీకు 'దగ్గర్లో ఓ మంచి వార్త తెలియజేస్తాను' అన్నారు. నా గ్రంథాల గురించి కువైట్ మిత్రులు వెల్లడిస్తున్న సానుకూల అభిప్రాయాలను నాకు తెలుపుతూ వచ్చిన శ్రీ సలాం 'మంచి వార్త తెలుపుతాను' అనడంతో, నా రచనల పట్ల శ్రద్ధ చూపుతున్న కువైట్ సోదరుల నుండి నా ప్రచురణ వ్యవస్థకు ఏదైనా సహకారం తప్పక లభించగలదన్న ఆశాభావం నాలో కలిగింది.

ఆ తరువాత తన సంపాదకత్వంలోని 'నెలవంక' మాసపత్రిక ద్వారా 'చరితార్దులు' ఆల్బమ్‌ను కువైట్ పాఠకులకు పరిచయం చేయగలనన్నారు. ఆ మాట ప్రకారంగా కువైట్‌లోని 'కడప ఇస్లామిక్ వెల్ఫేర్ సొసైటీ' సంచాలకులు శ్రీ ముహమ్మద్

హనీఫ్ నా గురించి, నా గ్రంథాల గురించి వాటి అవసరం వివరిస్తూ ప్రధానంగా 'చరితార్థులు' ఆల్బమ్ విశిష్టతను పేర్కొంటూ రాసిన సమాచారయుక్తమైన వ్యాసాన్ని 2014 అక్టోబర్–డిసెంబర్ నాటి 'నెలవంక' సంచికలో ప్రచురించారు.

## అనూహ్య ఆహ్వానం

ఈ నేపథ్యం ఇలా ఉండగా 2014 నవంబరు 10న నాకు విదేశీ ఫోన్ కాల్ వచ్చింది. అది కువైట్ నుండి. 'కడప ఇస్లామిక్ వెల్ఫేర్ సొసైటీ' కువైట్ సంచాలకులు శ్రీ మహమ్మద్ హనీఫ్ నాతో మాట్లాడారు. నాలోని ఆశాభావానికి ఆలంబనగా 'కువైట్‌లో 2015 జనవరి 26న మా 'కడప ఇస్లామిక్ వెల్ఫేర్ సొసైటీ' నిర్వహిస్తున్న '66వ భారత గణతంత్ర దినోత్సవం' సంబరాలలో పాల్గొనేందుకు మిమ్మల్ని ఆహ్వానిస్తున్నాం' అని శ్రీ మహమ్మద్ హనీఫ్ మౌఖిక ఆహ్వానం అందించారు.

ఆ ఆహ్వానం నాకాశ్చర్యం కలిగించింది. ఆ ఆశ్చర్యం నుండి తేరుకుని, నాకు పాస్‌పోర్టు లేదన్న విషయం తెలిపాను. 'మీకు పాస్‌పోర్టు లేకపోవడం ఏమిటండీ?' అని నవ్వుతూ వెంటనే పాస్‌పోర్టుకు దరఖాస్తు చేయమన్నారు. ఆ రోజు రాత్రి కడపలోని 'కడప ఇస్లామిక్ వెల్ఫేర్ సొసైటీ' అధ్యక్షులు షేక్ ఇస్హాఖ్ అలీ నాకు ఫోన్ చేశారు. కువైట్ కార్యక్రమానికి నన్ను ఆహ్వానిస్తూ పాస్‌పోర్టు త్వరితగతిన జారీ అవుతున్నాయన్న విషయాన్ని ఎరుక పర్చుతూ, తక్షణమే దరఖాస్తు చేయమన్నారు.

ఈ విషయం నెల్లూరు మిత్రులు శ్రీ యం.డి అహమ్మద్‌కు తెలిపాను. 'నా చిరకాల వాంఛ నేరవేరుతున్నందుకు సంతోషంగా ఉంది...మీరు తక్షణమే పాస్‌పోర్టుకు దరఖాస్తు చేయండి...కువైట్ వెళ్ళిరండి...కువైట్‌లో మూడు దశాబ్దాల క్రితం 'కడప ఇస్లామిక్ వెల్ఫేర్ సొసైటీ' ఏర్పాటులో నేనూ భాగస్వామిని...ఆ మిత్రులంతా నాకు తెలుసు...మీరు తప్పక కువైట్ వెళ్ళాలి' అంటూ గుక్కతిప్పుకోని మాటల ప్రవాహంతో హడాహుడి చేశారు.

## సందిగ్ధతతో సతమతం

ఒక పక్కన పాస్‌పోర్టు కోసం ప్రయత్నం చేస్తూ కూడా, అపరిచితుల నుండి అందిన ఆహ్వానం మేరకు, కువైట్ వెళ్ళడమా? మానడమా? అను అంశం మీద మదిలో సంద్గిదత ఏర్పడింది. మనస్సులో తర్జనభర్జన ఆరంభమైంది. నేను కువైట్ వెళ్ళడం వల్ల ప్రయోజనం ఏంటన్న ప్రశ్న పలుమార్లు నా మస్తిష్కంలో సుడులు తిరగ సాగింది. కువైట్ సోదరుల ఆహ్వానాన్ని మన్నించడమా? మానడమా? తేల్చుకోలేని పరిస్థితులలో





ఉండి పోయాను. చివరకు 'నా కువైట్ పర్యటనకు మిత్రులు భరించే ఖర్చును మన ఆల్బమ్‌ను ఉర్దూ, హిందీ లేక ఉర్దూ–ఆంగ్ల భాషలో ప్రచురిస్తే బాగుంటున్న' నా అభిప్రాయాన్ని నవంబరు 20న శ్రీ సయ్యద్ అబ్దుల్ సలాంకు తెలిపాను. 'మీరు కువైట్ రావడం వల్ల మేలు జరుగుతుంది' అంటూ తప్పకుండా 'సొసైటీ' సోదరుల ఆహ్వానాన్ని గౌరవించి కువైట్ రావాల్సిందిగా సలహా ఇచ్చారు.

ఈ లోగా, ప్రముఖ స్వాతంత్ర్యసమరయోధులు మౌలానా అబుల్ కలాం ఆజాద్ జన్మదినోత్సవం పురస్కరించుకుని 2014 నవంబరు 11న కడప జిల్లా సుందుపల్లి మండలం మడితాడు గ్రామంలో జరగనున్న 'జాతీయ విద్యా దినోత్సవం'లో ముఖ్య అతిధిగా పాల్గొనమంటూ జమాఅతె–ఉల్–ఉలేమా–ఏ–హింద్ (రాయచోటి) నాయకులు శ్రీ అజ్మతుల్లా, శ్రీ హబీబుర్రెహమాన్‌లు నన్ను రాయచోటికి ఆహ్వానించారు.

ఈ కార్యక్రమానికి హజరయ్యేందుకు నేను కడప వస్తున్నట్టుగా 'సొసైటీ' పెద్దలు శ్రీ షేక్ ఇస్హాక్ అలీకి తెలిపాను. ఆయన ఎంతో సంతోషిస్తూ కడపకు వస్తే తమ 'సొసైటీ' కార్యాలయం, 'జామియతుస్ సాలిహత్ లిల్‌బనత్' (Jamiathus Salihat Lilbanat) మదరసా తప్పకుండా సందర్శించమని ఆహ్వానించారు. నా రాకను పురస్కరించుకుని కడపలోని 'జామియతుస్ సాలిహత్ లిల్‌బనత్' మదరసాలో గాని లేదా కడప 'సొసైటీ' కార్యాలయంలో గాని 'చరితార్థులు' ఆల్బమ్ పరిచయ కార్యక్రమం ఏర్పాటు చేయమని కడప మిత్రులు షేక్ మస్తాన్ వలీ చేసిన సూచనను షేక్ ఇస్హాక్ అలీ అంగీకరించారు. శ్రీ ఇస్హాఖ్ నాకు ఫోన్ చేసి కడపకు వచ్చేప్పుడు 'చరితార్థులు' ఆల్బమ్ కాపీలను తీసుకరమ్మన్నారు.

## షేక్ ఇస్హాఖ్ అలీతో ప్రత్యక్ష పరిచయం

ఈ మేరకు 2014 నవంబరు 11 ఉదయం నేను కడప చేరుకున్నా. కడప బస్టాండ్‌లో బస్సు దిగేసరికి 'కడప ఇస్లామిక్ వెల్ఫేర్ సొసైటీ' వ్యవస్థాపక అధ్యక్షులు, శ్రీ షేక్ ఇస్హాఖ్ అలీ ఆత్మీయంగా స్వాగతం పలికారు. శ్రీ షేక్ ఇస్హాఖ్ అలీని మొదటిసారిగా చూడటం జరిగింది. ఆయన 'ఆజానుబాహుడు...వయస్సు తక్కువే....కానీ భారీకాయం... చూడగానే ఆకట్టుకునే ఆహార్యం...పెద్ద మనస్సు గల మంచి మనిషి' అంటూ మిత్రులు శ్రీ అహ్మద్ పదే పదే శ్రీ ఇస్హాఖ్ గురించి చేస్తూ వచ్చిన వర్ణనకు సరిగ్గా సరిపోయినట్టుగా ఆయన దర్శనమిచ్చారు, వ్యవహరించారు. ఆయనలోని కలగోపుతనాన్ని ఆ కొద్దిపాటి సమయంలోనే గ్రహించాను. నా వెంట తెచ్చిన 'చరితార్థులు' ఆల్బమ్ కాపీలు శ్రీ అలీ,



ది.12.11.2014న కడపలో 'కడప ఇస్లామిక్ వెల్ఫేర్ సొసైటీ ఆధ్వర్యంలో జరిగిన 'చరితార్థులు' ఆల్బమ్ పరిచయ సభాకార్యక్రమం

ఆయన వెంట వచ్చిన సహచరులకు అప్పగించి మిత్రులు మస్తాన్ వలితో కలసి నేను బయలుదేరాను. నేను ఎప్పుడు కడప వచ్చినా నాకు బస ఏర్పాటు చేస్తూ ఆత్మీయ ఆతిథ్యాన్ని అందిస్తున్న సోదరులు, 'కె.యస్.యం హిందీ భవన్' వ్యవస్థాపకులు శ్రీ కె.యస్.పర్వతుల్లా గృహానికి వెళ్ళి, స్నానపానాదులు ముగించి అటు నుండి రాయచోటికి వెళ్ళాం. రాయచోటి సమీపంలో ఉన్న మడితాడు గ్రామంలో జరిగిన 'జాతీయ విద్యా దినోత్సవం'లో పాల్గొని తిరిగి సాయంత్రం ఆరు గంటలకు కడప చేరుకున్నాం.

కడప ఆర్టీసి బస్టాండ్ నుండి నేరుగా 'జామియతుస్సాలిహత్ లిల్‌బనత్' మదరసా చేరుకున్నాం. 'చరితార్థులు' ఆల్బమ్ పరిచయం కార్యక్రమంలో నాతోపాటుగా యోగి వేమన విశ్వవిద్యాలయం ఆచార్యులు జి. సాంబశివారెడ్డి, డాక్టర్ రఘు యాదవ, ప్రముఖ కవి, రచయిత, ఆంధ్రప్రదేశ్ శాసన మండలి సభ్యులు శ్రీ సత్యాగ్ని హుస్సేన్, కడప జిల్లా 'ఆవాజ్' అధ్యక్షులు శ్రీ మస్తాన్ వలీలను ఆహ్వానించారు. ఈ సందర్భంగా 'సొసైటీ' భాధ్యులు డాక్టర్ ముఖ్తార్ అహ్మద్, అందరికి 'బాబూభాయ్'గా పరిచయస్తులు, బహుభాషల్లో అనర్గళంగా ప్రసంగించగల దిట్ట శ్రీ సయ్యద్ అహ్మద్ బాషా 'చరితార్థులు' ఆల్బమ్ పరిచయ కార్యక్రమంలో పాల్గొన్నారు. ఈ సందర్భంగా శ్రీ షేక్ ఇస్హాఖ్ అలీ మాట్లాడుతూ కువైట్ సోదరుల ఆహ్వానం మేరకు తప్పకుండా కువైట్ రావాలని, 'సొసైటీ' అన్ని ఏర్పాట్లు చేస్తుందన్నారు.

కడప ప్రయాణం తరువాత కువైట్ వెళ్ళినా వెళ్ళకపోయినా 'పాస్‌పోర్టు' అధికారిక గుర్తింపు కార్డుగా ఉంటుందన్న భావనతో పాస్‌పోర్టు కోసం దరఖాస్తు చేశాను. ఆ





దరఖాస్తు మీద డిసెంబరు 17 విజయవాడ పాస్‌పోర్టు కార్యాలయానికి రమ్మని పిలుపు అందింది. ఆ రోజున తగిన పత్రాలు సమర్పించాక డిసెంబరు 21న పోలీసు విచారణ జరిగింది. ఆ తరువాత నేను ఉత్తరాంధ్ర పర్యటనలో ఉండగా పాస్‌పోర్టు 26 డిసెంబర్, 2014 తేదిన జారీ అయ్యింది. అదికాస్తా పోస్టులో నా చేతికి అందింది. అటు తరువాత వీసా తదితర పత్రాల కోసం పాస్‌పోర్టు ఇతర పత్రాల నకళ్ళను 2014 డిసెంబర్ 31న కువైట్ 'సొసైటీ' నేతలకు మెయిల్ చేశాను.

## 'కడప ఇస్లామిక్ వెల్ఫేర్ సొసైటీ' సందర్శన

దక్షిణ భారత కమ్యూనిస్టు ఉద్యమ నిర్మాత దాదా అమీర్ హైదర్ ఖాన్ సంస్మరణ సభను పురస్కరించుకుని కడపలో 2014 డిసెంబర్ 26న నాటి బహిరంగ సభలో ప్రసంగించేందుకు రమ్మంటూ మిత్రులు శ్రీ షేక్ మస్తాన్ వలీ ఆహ్వానం మేరకు డిసెంబర్ 26న కడపకు వచ్చాను. ఈ సందర్భంగా 'సొసైటీ' బాధ్యులు శ్రీ సయ్యద్ అహమ్మద్ బాషాను 'సొసైటీ' కార్యాలయంలో కలుసుకున్నాను. 'కడప ఇస్లామిక్ వెల్ఫేర్ సొసైటీ' కార్యాలయాన్ని నేను సందర్శించడంతో మా నెల్లూరు మిత్రులు శ్రీ అహమ్మద్ చిరకాల వాంఛ నెరవేరినట్టయ్యింది.

ఈ సందర్భంగా 'సొసైటీ' నాయకులు శ్రీ సయ్యద్ అహమ్మద్ బాషా 2015 జనవరి 27న కడపకు రావాలని నన్ను ఆహ్వానించారు. 'అరవై ఆరవ భారత గణ తంత్ర దినోత్సవం' సందర్భంగా 'కడప ఇస్లామిక్ వెల్ఫేర్ సొసైటీ' స్థానిక 'నేక్ నామ్ ఖాన్ కళాక్షేత్రం' లో ఏర్పాటు చేస్తున్న బహిరంగ సభలో పాల్గొనాలని ఆయన నన్ను కోరారు. ఈ సభలో 'చరితార్థులు' ఆల్బమ్ కూడా ఆవిష్కరణ జరుగుతుందని, ఆ కార్యక్రమానికి హజరై ఆ రాత్రికి రాత్రి కువైట్ ప్రయాణానికి గాను నేను చెన్నైయ్ అంతర్జాతీయ విమానాశ్రయం వెళ్ళాల్సి వస్తుందని తెలిపారు. నా కువైట్ ప్రయాణానికి తగిన ఏర్పాట్లు కూడా తాము చేస్తామని, నన్ను నిశ్చింతగా ఉండమన్నారు.

## అప్పటికి వీడని సందిగ్ధత

అయినప్పటికి నా కువైట్ ప్రయాణ సందిగ్ధత నన్ను వీడలేదు. వెళ్ళడమా? మానడమా? ఏమాత్రం తేల్చుకోలేకున్నా. ఈ ప్రయాణం వలన నాకు వ్యక్తిగతంగా లాభదాయకం కాగలదు గానీ...నా ప్రచురణ వ్యవస్థకు ఏమాత్రం ఉపకరించదన్న భావన నన్ను ఏ నిర్ణయం తీసుకోకుండా అడ్డుకుంటుంది. ఈ విషయాన్ని ఎరుక పర్చుతూ, నా మరో ప్రతిపాదనను 'సొసైటీ' కువైట్ సంచాలకులు శ్రీ మహమ్మద్ హనీఫ్ ముందుంచుతూ

2015 జనవరి 12న అంతర్జాలం ద్వారా వర్తమానం పంపాను. 'నా ప్రయాణం వలన నాకు వ్యక్తిగతంగా ప్రయోజనం, ప్రచారం సమకూరుతుంది తప్ప సామాజిక-ఉమ్మడి ప్రయోజనాలు సిద్ధించవు కదా? అందువల్ల నా ప్రయాణానికి మీరు ఖర్చుచేయ సిద్ధపడిన మొత్తాన్ని నా గ్రంథాల ప్రచురణకు అందివ్వండి. మీ 'సొసైటీ' పేరుతో గ్రంథాన్ని ప్రచురించి రాష్ట్రంలోని ప్రముఖ గ్రంథాలయాలకు, వ్యక్తులకు మీ 'సొసైటీ' కానుకగా ఉచితంగా పంపుదాం...ఏమంటారు?' అన్నాను. నా ప్రతిపాదనను ఆయన చాలా సున్నితంగా త్రోసిపుచ్చుతూ, జనవరి 12, 2015న శ్రీ హనీఫ్ నాకు సమాధానమిస్తూ. 'its your simplicity and commitment to the just cause, you are prioritizing publication of books than your comming to Kuwait' అంటూ తప్పకుండా కువైట్ రావాల్సిందేనని నన్ను ఆత్మీయంగా ఆదేశించారు.

## కువైట్ వెళ్ళాలన్న నిర్ణయం

ఆ తరువాత ఇక కువైట్‌కు తప్పకుండా వెళ్ళాల్సిందేనని నిర్ణయించుకున్నాను. ఈ లోగా శ్రీ ఇస్హాఖ్ అలీతో నా సంభాషణలు సాగుతూ వచ్చాయి. కువైట్‌లో 'కడప ఇస్లామిక్ వెల్ఫేర్ సొసైటీ' ఏర్పడి మూడు దశాబ్దాలు పూర్తవుతున్న సందర్భంగా '66వ భారత గణతంత్ర దినోత్సవ' సంబరాలలో భాగంగా 'సోసైటీ' 30వ వార్షికోత్సవాన్ని కూడా ఘనంగా జరపాలన్న లక్ష్యంతో కువైట్ సోదరులు కంకణబద్ధులై ఉన్నారని ఆయన తెలిపారు. జమిలిగా ఈ కార్యక్రమాలు 2015 జనవరి 30న జరుగుతాయన్నారు. ఈ కార్యక్రమానికి బృహత్తర ఏర్పాట్లు జరుగుతున్నాయన్నారు. నాతోపాటుగా మరో ప్రముఖులు శ్రీ మేడా వెంకట మల్లికార్జున రెడ్డి (కడప జిల్లా రాజంపేట శాసనసభ్యులు, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం చీఫ్‌విప్) కువైట్ కార్యక్రమంలో పాల్గొంటారని తెలిపారు. ఈ కార్యక్రమాల ఏర్పాట్లల్లో భాగంగా 'సొసైటీ' స్థానికంగా ఆహ్వానపత్రం కూడా విడుదల చేసింది.

ఆ తరువాత ఒక రోజు శ్రీ ఇస్హాఖ్ అలీ నాకు ఫోన్ చేసి మాట్లాడుతూ 2015 జనవరి 30 నాటి కార్యక్రమం ఏర్పాట్లు, ఈ సందర్భంగా వెలువరించనున్న 'సోసైటీ' సావనీర్ ప్రచురణ తదితర కార్యక్రమాల పర్యవేక్షణ కొరకు తాను ముందుగా కువైట్ వెడుతున్నట్టు తెలిపారు. నా కువైట్ ప్రయాణం, వీసా పత్రాలు రప్పించడం తదితర ఏర్పాట్లు కడపలోని శ్రీ సయ్యద్ అహ్మద్ బాషా చూస్తారని ఆయన చెప్పారు.

ఈ నిర్ణయం తరువాత నా కువైట్ పర్యటన, అక్కడి కార్యక్రమాల గురించి మొదటిసారిగా తాడేపల్లి మండలం పాత్రికేయులకుద్వారా 2015, జనవరి 12న వెల్లడి





# చరిత్రకారుడు నశీర్ అహమ్మద్‌కు కువైట్ ఆహ్వానం



గుంటూరు జిల్లా,తాడేపల్లి మండలం ఉండవల్లి సెంటర్‌కు చెందిన చరిత్రకారుడు, బహుగ్రంథ రచయిత సయ్యద్ నశీర్ అహమ్మద్‌కు కువైట్ దేశంలోని ప్రవాస భారతీయులు కువైట్‌లో నిర్వహించే భారత రిపబ్లిక్ దినోత్సవ వేడుకలలో గౌరవ అతిథిగా పాల్గొనేందుకు ఆహ్వానం అందింది. ఈ కార్యక్రమం జనవరి 30వ తేదీన కువైట్‌లోని దస్మా ప్రాంతానికి చెందిన టీచర్స్ అసోసియేషన్ హాలులో జరుగుతుంది. ఆ సందర్భంగా 'భారత స్వాతంత్ర్యోద్యమంలో ముస్లింల పాత్ర' అంశం మీద నశీర్ ప్రధాన ప్రసంగం చేస్తారు. ఈ వేడుకల్లో ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ విప్, రాజంపేట శాసనసభ్యులు శ్రీ మేడా వెంకట మల్లికార్జున రెడ్డి ముఖ్య అతిథిగా పాల్గొంటున్నారు. భారత స్వాతంత్రోద్యమంలో ముస్లింల పాత్రను వివరిస్తూ 10 పరిశోధనాత్మక చరిత్రగ్రంథాలు రచించి ప్రచురించిన సయ్యద్ నశీర్ అహమ్మద్ గత పదిహేను సంవత్సరాల కృషి ఫలితంగా ఆంగ్లం-తెలుగు భాషల్లో రూపొందిన స్వాతంత్ర్య సమరయోధుల ఆల్బం 'చరితార్థులు'ను శ్రీ మల్లికార్జున రెడ్డి ఈ కార్యక్రమంలో ఆవిష్కరించారు. ఈ కార్యక్రమంలో కువైట్‌లోని 'కడప ఇస్లామిక్ వెల్ఫేర్ సోసైటీ' అధ్యక్షులు షేక్ ఇషాఖ్ అలీ తదితరులు పాల్గొంటారు.

Netinijam 22-01-2015 in its Sahithi Keratalu.

చేశాను. ఆ తరువాత 'ఫేస్‌బుక్' ద్వారా 'ముఖపుస్తకం' మిత్రులకు తెలిపాను. స్థానిక, రాష్ట్రస్థాయి తెలుగు దిన, పక్ష, మాస పత్రికలలో నా కువైట్ ఆహ్వానం గురించి వార్త ప్రచురితం అయ్యింది. తెలంగాణా రాష్ట్ర రాజధాని హైదరాబాద్ కేంద్రంగా నడుస్తున్న పలు ఉర్దూ దినపత్రికలు కూడా ఈ వార్తను విశేషంగా ప్రచురించాయి.

ఈ కువైట్ ప్రయాణ విషయం 'ఉర్దూ ఈటీవి'లో కూడా ప్రసారమయ్యింది. ఈ వార్తకు మంచి స్పందన వచ్చింది. ప్రధానంగా కువైట్‌లోని 'ముఖపుస్తకం' మిత్రులు అద్భుతంగా స్పందించారు. కువైట్‌లోని తెలుగు పాఠక మిత్రులు, నాకున్న ముఖపుస్తక మిత్రులు పలువురు నన్ను కాంటాక్ట్ చేసి, చాటింగ్ చేసి నన్ను అభినందిస్తూ, 2015 జనవరి 30 నాటి కార్యక్రమంలో పాల్గొంటున్న నా కోసం ఎదురు చూస్తున్నామంటూ చాలా ఆత్మీయంగా ఆహ్వానించసాగారు.

ఈ ప్రయాణం ద్వారా విదేశాల్లో ఉన్న మనవాళ్ళకు మన పూర్వీకుల త్యాగమయ చరిత్రను పత్యక్షంగా తెలిపే అవకాశం లభిస్తున్నందున తప్పకుండా కువైట్ వెళ్ళాల్సిందిగా నా భార్య షేక్ రమిజా బాను, కుమార్తె సయ్యద్ జాస్మిన్ అహమ్మద్, అల్లుడు డాక్టర్ యస్.యం తల్మీజుద్దీన్, మా మామయ్య, ఆజాద్ హౌస్ ఆఫ్ పబ్లికేషన్స్ ఛైర్మన్ హాజీ షేక్ పీర్ అహమ్మద్, నా చెల్లెలు సయ్యద్ నౌషాద్ బేగం, మా బావగారు షేక్ గఫూర్, నా బావమర్ది షేక్ జవహర్ లాల్, చెల్లెలు షేక్ ఇర్షాద్, నా ఆత్మీయ మిత్రుడు శివరాత్రి చంద్రమౌళి పలుమార్లు కోరసాగారు. చివరకు కువైట్ వెళ్ళడానికి పూర్తి స్థాయిలో నిర్ణయించుకుని శ్రీ హనీఫ్ సూచనల మేరకు ప్రయాణ ఏర్పాట్లు ఆరంభించాను.

## నా తొలి విదేశీ-విమాన ప్రయాణం ఏర్పాట్లు

నా తొలి విదేశీ ప్రయాణం ప్రత్యేక ఏర్పాట్ల గురించి అమెరికా సంయుక్త రాష్ట్రంలో ఉద్యోగం చేస్తున్న నా పెద్ద మేనల్లుడు షేక్ అన్సర్ బాషా, ఖతర్‌లో ఉద్యోగం చేస్తున్న నా చిన్న మేనల్లుడు షేక్ సూరజ్ బాషాల నుండి సూచనలు అందుతున్నాయి. 'భారత స్వాతంత్ర్యోద్యమంలో ముస్లింల పాత్ర'కు సంబంధించిన వివరాల కోసం నేను స్వయంగా దేశంలోని పలు ప్రాంతాలను పర్యటించినా నేను ఎన్నడూ విమానప్రయాణం చేయలేదు. ఆ కారణంగా విమానప్రయాణం ఏర్పాటు గురించి కూడా తెలుసుకోసాగాను.

నా కువైట్ ప్రయాణం నిర్ణయం కాక ముందు నుండి అంతర్జాలం ద్వారా నాతో సంప్రదిస్తున్న మిత్రులు 'లక్కీ అజీజ్', షేక్ నిజాం, షేక్ షౌకత్ అలీ ఖాన్, షేక్ అజీజ్ తదితరులతో చాటింగ్ చేస్తూ వచ్చాను. ఈ సోదరులంతా కువైట్ 'సోసైటీ' ప్రధాన బాధ్యులని ఆ తరువాత చాటింగ్ సమయంలో తెలిసింది. 'మీ రాక కోసం ఎదురు చూస్తున్నాం' అంటూ, స్థానికంగా నాకు చాలా మంది అభిమానులున్నారని, నా వ్యాసాలను, గ్రంథాలను స్థానిక తెలుగు పాఠకులకు చాలా మంది చదివి ఉన్నారని, 'ఫేస్‌బుక్' లోని నా పోస్టింగ్స్‌ను చాలా కాలం నుండి నన్ను అనుసరిస్తున్నట్టుగా మిత్రులు వెల్లడించారు. ఈ చాటింగ్ సంభాషణల వలన కువైట్ విదేశీ ప్రయాణం గురించి నాలో ఏర్పడిన సందిగ్ధత మాయమయ్యింది. నా కోసం కువైట్‌లో తెలుగు పాఠకులు, సన్నిహిత మిత్రులు, హితులు ఎంతగానో ఎదురు చూస్తున్నారన్న ఆత్మీయభావన నాలో బలపడసాగింది.

నా కువైట్ ప్రయాణం గురించి 'ముఖపుస్తకం' ద్వారా తెలుసుకున్న 'ముఖ పుస్తకం' మిత్రులు, తెలుగు పాఠకులు, నాతో నేరుగా సంప్రదిస్తున్న సోదరులు నా రాక కోసం కువైట్‌లో ఎదురు చూసున్నారన్న విషయం తెలుసుకున్నాక నా బాధ్యత మరింత పెరిగింది. నా ప్రసంగాలు వినడానికి చాలా ఉత్సుకతతో ఉన్నారని వారు నాతో సాగించిన 'చాటింగ్', నా పోస్టింగ్స్ చూసి వ్యక్తంచేసిన అభిప్రాయాలను బట్టి అవగంతం చేసుకున్నాక, నాలో కించిత్తు భయాందోళన కూడా పొటమరించింది.

ఈ భయాందోళనల నేపథ్యంలో కువైట్‌లోని నా కార్యక్రమాల షెడ్యూల్ తెలపాల్సిందిగా కువైట్‌లోని శ్రీ మహ్మద్ హనీఫ్, శ్రీ సయ్యద్ అబ్దుల్ సలాంలను తరుచుగా కోరసాగాను. నన్ను సుమారుగా పదిరోజులు కువైట్‌లో ఉండమంటున్నారు కనుక ఏ ఏ అంశాల మీద నేను ఎక్కడెక్కడ ప్రసంగించాలి, ఏ ఏ సభలు, సమావేశాల్లో పాల్గొనాలో స్పష్టంగా తెలుపమంటూ పదే పదే కోరసాగాను.





నా ఆందోళన గమనించిన శ్రీ మహ్మద్ హనీఫ్ తాత్కాలికంగా ఒక షెడ్యూల్ తయారు చేసి పంపుతూ దానిలో జనవరి 30నాటి ప్రధాన కార్యక్రమం గురించి వివరాలు మాత్రమే వెల్లడించారు. ఆ తరువాత మిగతా కార్యక్రమాలు తెలుపుతామన్నారు. ఆయన పంపిన షెడ్యూలు ప్రకారంగా నేను వెల్లడించాల్సిన విషయాలకు సంబంధించి తగిన సామగ్రి తయారు చేసుకోసాగాను. నా ప్రధాన ప్రసంగం, ఆ తరువాత ఇతర ప్రసంగాలు 'భారత స్వాతంత్ర్యోద్యమంలో ముస్లింల పాత్ర' చుట్టూ తిరుగుతాయి కనుక ఆ మేరకు పరిమితమై చారిత్రకాంశాల నోట్సు రూపొందించుకుంటూ, ఈనాడు అటు దేశంలో ఇటు ఆంధ్రప్రదేశ్ – తెలంగాణా రాష్ట్రాలలో ముస్లింల స్థితిగతులు, చరిత్ర వక్రీకరణ జరిగిన–జరుగుతున్న తీరు తెన్నులు, ఆ 'నిశ్శబ్దకుట్ర'కు పాల్పడుతున్న వ్యక్తుల, వ్యవస్థల ఉద్దేశ్యాలు–లక్ష్యాలు తదితర ప్రధాన అంశాల మీద కూడా తగినంత చారిత్రక సమాచారాన్ని, సాక్ష్యాధారాలను, తగిన గణాంకాలను కూడా సమకూర్చుకుని విశ్లేషణాత్మక ఉపన్యాసాలకు సిద్ధం కాసాగాను.

## కువైట్ ప్రయాణం ఖరారు

జనవరి 28, 2015 న శ్రీ మహ్మద్ హనీఫ్ నాకు ఫోన్‌చేసి తెల్లవారు జామున చెన్నైయ్ అంతర్జాతీయ విమాశ్రయం నుండి కువైట్‌కు నేను బయలుదేరాల్సి ఉంటుందని, తిరిగి 2015 జనవరి 05న సాయంత్రం కువైట్ అంతర్జాతీయ విమాశ్రయం నుండి ఇండియాకు తిరుగు ప్రయాణం ఉంటుందని నాకు వివరించారు. ఒక వేళ అత్యవసరం అనుకున్న పక్షంలో మరో వారం రోజుల పాటు కువైట్‌లో ఉండాల్సి వస్తుందన్నారు. అందువలన పర్యటన కొన్ని రోజులపాటు పొడిగించడానికి అవరసమగు తగిన ఏర్పాట్లు చేసుకుని రమ్మన్నారు. విదేశీ ప్రయాణానికి అవసరమగు వీసా, విమానం టిక్కెట్టు వివరాలను త్వరలో పంపగలమని చెప్పారు. ఆ సమయంలో కువైట్‌లో ఏర్పడగల వాతావరణం, అక్కడి భౌగోళిక పరిస్థితులు తదితర విశేషాలను కూడా చాలా క్షుణ్ణంగా తెలుపుతూ తగిన జాగ్రత్తలు శ్రీ మహ్మద్ హనీఫ్ సూచించారు.

ఆ తరువాత కొంత కాలానికి శ్రీ హనీఫ్ నాకు ఫోన్ చేసి తాను ఇండియా వచ్చియున్నట్టుగా తెలుపుతూ, మరో వారం రోజుల్లో తిరిగి కువైట్ వెళ్ళనున్నామన్నారు. నా కువైట్ ప్రయాణం, పర్యటనకు అన్ని ఏర్పాట్లు చేశామన్నారు. నా తోపాటుగా కడప జిల్లా రాజంపేట శాసనసభ్యులు, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ చీఫ్ విప్ శ్రీ మేడా వెంకట మల్లికార్జున రెడ్డి రాక కూడా ఖరారయ్యిందన్నారు. శ్రీ రెడ్డి 2015 జనవరి 30 ఉదయం

కువైట్ వస్తారని నేను మాత్రం జనవరి 28 ఉదయం కువైట్ చేరుకుంటానని తెలిపారు. ఆయన ప్రతిరోజు నాతో మాట్లాడుతూ వచ్చారు. కువైట్ కార్యాక్రమాలలో నా పాత్రకు సంబంధించిన వివరాలు అందిస్తూ, నా సందేహాలను తీర్చుతూ వచ్చారు. కువైట్ లోని తెలుగు పాఠకులు, నా సాహిత్యంతో పరిచయం ఉన్న వ్యక్తులు, 'సొసైటీ' చరిత్ర, అది నిర్వహిస్తున్న పలు కార్యక్రమాల గురించి వివరంగా తెలియబర్చారు.

## స్వదేశం నుండి విదేశానికి ప్రయాణం

చివరకు 2015 జనవరి 26న రాత్రి ఎనిమిది గంటలకు నా శ్రీమతి షేక్ రమిజా బాను నుండి వీడ్కోలు తీసుకుని, మా 'అప్సాఫుర్' నుండి 'కువైట్ ప్రయాణం' ఆరంభించాను. విజయవాడ మిత్రులు శ్రీ షేక్ షఫీ అహమ్మద్, శ్రీ యండి. ఫారూఖ్ షుబ్లీ, శ్రీ యండి. ఫిరోజ్ మా అప్సాఫుర్‌కు వచ్చి నన్ను. నా లగేజిని తమ కారులో విజయవాడ ఆర్టీసీబస్టాండ్ చేర్చారు. ఆరోజు రాత్రి 10.30 గంటలకు బస్సు బయలు దేరుతుండగా మరికొందరు విజయవాడ మిత్రులు శ్రీ షేక్ యాసిన్ బాబా, ఈటీవీ ఉర్దూ చానెల్ పాత్రికేయులు శ్రీ అలీముద్దీన్ తదితరులు వచ్చి నాకు వీడ్కోలు పలికారు.

కడప అటు నుండి కువైట్ ప్రయణానికి గాను విజయవాడ నుండి బయలు దేరిన నేను జనవరి 27 ఉదయం ఆరున్నరకల్లా కడప చేరుకున్నా. 'కడప ఇస్లామిక్ వెల్ఫేర్ సొసైటీ' మిత్రులు శ్రీ యూసుఫ్ బస్టాండ్‌కు వచ్చి నన్ను రిసీవ్ చేసుకున్నారు. ఆ తరువాత ఇరువురం కలసి 'కడప ఇస్లామిక్ వెల్ఫేర్ సొసైటీ' కార్యాలయం చేరుకున్నాం. సొసైటీ కార్యాలయంలో స్నానపానాదులు పూర్తి అయ్యాక మిత్రులు సయ్యద్ అహ్మద్ బాషాను కలుసుకున్నాను. ఆయన నా వీసా తదితర పత్రాలు, విమానప్రయాణం టిక్కెట్టు కాపీ తదితర పత్రాలను అందించారు. ఆ రోజు సాయంత్రం సభలో మాట్లాడాల్సిన అంశం పునశ్చరణ చేసుకుని కువైట్ ప్రయాణానికి పూర్తి స్థాయిలో సిద్ధమయ్యాను.

## కడప బహిరంగ సభ

జనవరి 27, 2015 స్థానిక 'నేక్ నామ్ ఖాన్ కళాక్షేత్రం'లో రాత్రి ఏడు గంటలకు ఆరంభమైన బహిరంగ సభలో పాల్గొన్నాను. 'కడప ఇస్లామిక్ వెల్ఫేర్ సొసైటీ' ఆధ్వర్యంలో జరిగిన 'అరవై ఆరవ భారత గణతంత్ర దినోత్సవ' సభకు కన్వీనర్‌గా శ్రీ సయ్యద్ అహమ్మద్ బాషా వ్యవహరించారు. 'కడప ఇస్లామిక్ వెల్ఫేర్ సొసైటీ' ఉపాధ్యక్షులు మౌలానా అక్బర్ అలీ రషాది తొలుత అతిధులకు స్వాగతం పలికారు. మౌలానా అబ్దుల్ జబ్బార్ ఖురాన్ పఠనంతో ఆరంభమైన సభకు ప్రముఖ కవి షేక్ హుస్సేన్ అధ్యక్షత








ది.27.01.2015న కడపలోని నేక్ నామ్ ఖాన్ కళాక్షేత్రంలో 'కడప ఇస్లామిక్ వెల్ఫేర్ సొసైటీ' ఆధ్వర్యంలో జరిగిన కార్యక్రమంలో ప్రసంగిస్తున్న సయ్యద్ నశీర్ అహమ్మద్

వహించారు. శ్రీ సయ్యద్ అహమ్మద్ బాషా 'చరితార్థులు' ఆల్బమ్ విశేషాలను సభికులకు పరిచయం చేశారు. ఈ సభలో కడప నగర మేయర్ శ్రీ కె. సురేష్ బాబు, శ్రీ మౌలానా అబ్దుల్ వదూద్ నద్వి, 'సొసైటీ' అధ్యక్షులు శ్రీ షేక్ మస్తాన్, యోగి వేమన విశ్వవిద్యాలయం చరిత్ర విభాగం ఆచార్యులు డాక్టర్ యస్. సాంబశివారెడ్డి, ధర్మబోధకులు శ్రీ పజులుర్రహ్మాన్ (హైదరాబాద్) తదితర ప్రముఖులు పాల్గొన్నారు. సభలో తొలుతగా నా ప్రసంగం సాగింది. నేను ప్రధానంగా 'మైసూరు పులి' గా ఖాతిగాంచిన టిపూ సుల్తాన్ గురించి మాట్లాడుతూ ఆయన మీద సాగుతున్న దుష్ప్రచారం-వాస్తవాలను వివరించాను.

నా చెన్నెయ్ ప్రయాణానికి సమయం దగ్గర పడుతుతున్నందున నిర్వాహకుల సూచన మేరకు నా ప్రసంగాన్ని కుదించి ముగించి 'సొసైటీ' కార్యాలయం చేరుకున్నాం. కడప నుండి నన్ను చెన్నయ్ చేర్చడానికి మిత్రులు శ్రీ షేక్ షబ్బీర్ పర్యవేక్షణలో నాకు ఎటువంటి అసౌకర్యం కలగకుండా అన్ని ప్రయాణ ఏర్పాట్లు జరిగాయి. మిత్రులు శ్రీ షేక్ మస్తాన్ వలి తదితరులు నా వెంట వచ్చి కార్‌స్టాండ్ వద్ద నాకు వీడ్కోలు పలికారు. మా వాహనం రాత్రి పది గంటల ప్రాంతంలో కడప నుండి చెన్నెయ్‌కు బయలుదేరింది.

## తొలి విమాన ప్రయాణం

మా వాహణం తమిళనాడు రాష్ట్రం రాజధాని చెన్నెయ్‌లోని అంతర్జాతీయ విమానాశ్రయానికి మూడున్నర ప్రాంతంలో చేరుకుంది. చెన్నయ్ విమానాశ్రయం వెళ్ళడం




నాకు మొదటిసారి. ఆ కారణంగా కడప నుండి కారులో నాతోపాటుగా విచ్చేసిన ఇరువురు యువకులతో స్నేహం చేశాను. ఆ యువకులు పలుమార్లు కువైట్‌కు వెళ్ళివచ్చిన వారని వారి మాటల్లో అర్థమయ్యింది. ఆ యవకులు నాతో మాట్లాడతూ 'సార్ ఈ వయస్సులో మీరు కువైట్ వస్తున్నారా? అంటూ ఆశ్చర్యం వ్యక్తంచేశారు. నేను ఎదో 'వర్క్ పర్మిట్' మీద కువైట్‌కు వస్తున్నట్టుగా యవకులు భావించినట్టుంది.

నేను ఎక్కవలసిన కువైట్ ఎయిర్‌లైన్స్ విమానం (కుయు 344) జనవరి 28, 2015 తెల్లవారు జామున 5 గంటల 35 నిమిషాలకు చెన్నెయ్ నుండి బయలుదేరుతుంది. కడప యువకుల సహకారంతో, ప్రతి విషయం, ప్రతి మార్గం గురించి చాలా స్పష్టంగా తెలుపబడి ఉన్న విమానాశ్రయంలోని 'సైన్‌బోర్డులు' మార్గం చూపుతుండగా నావద్ద నున్న ఇ-టికెట్టు ను కౌంటర్‌లో చూపి అసలు టికెట్టు తీసుకున్నా. అక్కడ చాలా పెద్ద క్యూ ఉంది. అంతా కువైట్ వెడుతున్నవారే. తిన్నగా ముందుకు సాగుతూ లగేజి కౌంటర్ వద్దకు చేరా. నా లగేజిని, నన్ను పరిశీలించి, పరిక్షించాక వాటిని కౌంటర్‌లోని సిబ్బంది స్వాధీనం చేసుకున్నారు. ఆ తరువాత 'ఇమిగ్రేషన్' కౌంటర్ వద్దకు చేరుకున్నా. అక్కడ నా పాస్‌పోర్టును పరిశీలించి, నా చేతి వేళ్ళ ముద్రలను తీసుకుని నన్ను లోపలికి అనుమతించారు. ఆ కౌంటరు నుండి నేరుగా విమానం (కుయు 344) లోనికి సొరంగంలా మార్గం కన్పించింది. అక్కడ విమానాశ్రయం సిబ్బంది చాలా వినయంగా ప్రయాణీకులకు దారి చూపుతూ, నాకు కేటాయించిన సీటును చూపించారు. నా చేతిలో బ్యాగ్‌ను ఎంతో మర్యాదతో సిబ్బంది తీసుకుని పైభాగంలోని డెస్క్‌లో సర్దిపెట్టారు.





నాకు విండో పక్కన సీటు దొరికింది. ఆ సీటులోంచి బయటకు చూస్తే విమానాశ్రయం పరిసరాలు చక్కగా కన్పిస్తున్నాయి. విమానం ప్రకటించిన సమయం కంటె కొంత ఆలస్యంగా చెన్నెయ్ విమానాశ్రం నుండి కువైట్‌కు గాల్లో ఎగిరింది. ఆ సమయంలో కొద్దిపాటి కుదుపులకు లోనైనట్టు అన్పించినా కొద్ది సేపటికి అంతా సర్దుకుంది. మాతృదేశం నుండి మిత్ర దేశానికి గాలిలో ఎగిరిపోతున్న ఆ సమయంలో విండో నుండి బయటకు చూశాను.

రాత్రి గడిచినా ఇంకా పూర్తిగా తెల్లవారలేదు. అ కారణంగా మద్రాసు మహా నగరం విద్యుత్ దీపాల కాంతిలో దేదీప్యమానంగా వెలిగిపోతూ కన్పించింది. విమానం మరింతగా గాలిలోకి ఎగిరి ముందుకు దూసుకపోతున్న కొద్ది నా దేశం మరింత సుందరంగా కన్పించసాగింది. అంత ఎత్తు నుండి మాతృభూమి భౌగోళిక స్వరూపం అందచందాలను మొదటిసారిగా ఆకాశం నుండి చూస్తున్న నాకు గతంలో అనుభవంలోకి రానటువంటి అనేక అద్భుత దృశ్యాలు కన్పించ సాగాయి. ఆ దృశ్యాలు చూస్తూ అనందించసాగాను. మరికొద్ది సేపటికల్లా భారత దేశం సరిహద్దులు దాటి అరేబియా సముద్రం మీదుగా సాగుతున్న 'కువైట్ ఎయిర్ లైన్స్' విమానం నుండి వరుసగా కన్పిస్తున్న పలు మనోహరమైన దృశ్యాలు ఎన్నో నా మనోఫలకం మీద ఆవిష్కరించ బడసాగాయి.

ఆ దృశ్యమాలికలను పట్టుకుని పదిలం చేయగల నా కెమెరా ఆ సమయంలో నావద్ద లేకపోడం నాకు బాధ కల్గించింది. నా వద్దనున్న సెల్‌కూడా ఆ వర్ణ చిత్రసమానంగా ఉన్న దృశ్యాలను చక్కగా తీయగల శక్తివంతమైనది కాకపోవడంతో మంచి అవకాశాన్ని పోగొట్టుకున్నాను. విమానం అలా...అలా గాలిలోకి బాగా పైకి వెళ్ళిపోయాక కనువిందు చేస్తున్న ఆ దృశ్యాలు క్రమంగా కనుమరుగయ్యాయి.

ఆ తరువాత నా సీటులో స్థిరపడ్డాను. మా ఇంట్లో నా వర్కింకింగ్ టేబుల్ ఎదుట కుర్చీలో నిమ్మళంగా కూర్చునట్టుగానే అన్పించింది తప్ప, గుర్తించదగ్గ ప్రత్యేకత ఏమీ నా అనుభవంలోకి రాలేదు. నా పక్క సీటులో ఎవ్వరూ రాలేదు. నా తిరుగు ప్రయాణంలో కూడా విమానంలోని నా పక్క సీటు ఖాళీగానే ఉంది.

## ప్రయాణికుల్లో అత్యధికులు తెలుగువాళ్ళే

నా పక్క వరుస సీట్లలో గ్రామీణ స్త్రీపురుషులు కన్పించారు. ఆంధ్రప్రదేశ్, తెలంగాణా ప్రాంతాల నుండి వీరంతా కువైట్‌కు వెడుతున్నట్టు వారి మాటలను బట్టి తెలిసింది. ఈ విమానంలో అత్యధికులు తెలంగాణా, ఆంధ్రప్రదేశ్‌కు వారు కాగా అతికొద్ది

మంది తమిళనాడుకు చెందినవారున్నారు. విమానంలో అంతా స్థితిమిత పడ్డాక కొంత సేపటికి 'వెజిటేరియన్-నాన్ వెజిటేరియన్' అని అడుగుతూ సిబ్బంది వచ్చింది. ప్రయాణీకులు కోరిన బ్రేక్‌ఫాస్ట్ అందించారు. నేను నాన్ వెజిటేరియన్ కోరుకున్నా. అల్పాహారం పూర్తి చేసిన అరగంట తరువాత విమానంలోని అన్ని లైట్స్ ఆఫ్ అయ్యాయి. ప్రయాణీకులంతా నిద్రకు ఉపక్రమించసాగారు. గత రెండు రోజుల నుండి ప్రయాణం బడలికతో ఉన్న నేను కూడా వెంటనే నిద్రలోకి జారుకున్నాను.

ఆలా రెండు మూడు గంటలు గడిచాయో లేదో మళ్ళీ అన్ని లైట్లు వెలిగాయి. నిద్ర మేల్కొని చూస్తాను కదా మా విమానం అరేబియా సముద్రాన్ని దాటి పర్షియన్ గల్ఫ్‌కు చేరుకుంది. పర్షియన్ గల్ఫ్‌కు అటుతీరంలో ఉన్న కువైట్ వైపుకు మా విమానం దూసుకుపోతుంది. విమాన సిబ్బంది 'టి-కాఫీ' సర్వ చేస్తున్నారు. నా విండో నుండి చూస్తును కదా...ఎంత అందంగా ఉందో పర్షియన్ గల్ఫ్. ఆ సముద్రం తీరంలో వెలసిన వివిధ పట్టణాలు నగరాలలోని ఆకాశాన్ని అంటుకోవాని తహతహలాడుతున్న ఎత్తైన భవనాలు వింత వింత విద్యుత్ దీపాల వెలుగులలో మనోహరంగా కన్పించసాగాయి. విమానం సముద్రం మీదుగా భూమి మీదకు దిగుతున్న కొద్ది పట్టణాలు, నగరాలు, సరిహద్దులు మరింత దగ్గరవుతూ చాలా స్పష్టంగా కన్పించసాగాయి.

నేను గతంలో ఎన్నడూ చూడని విధంగా కనువిందు చేస్తున్న ఈ సుందర దృశ్యాలన్నిటిని ఒడిసి పట్టుకుని, దాచి పెట్టి స్వదేశం వచ్చాక ఆ అందాలను నా ఆత్మీయ హృదయాలతో కలసి పంచుకోవాలన్పించింది. నా దగ్గర ఆ దృశ్యాలను బంధించడానికి అవసరమైన కెమెరా నావద్ద లేకుండాపోయింది. నా తెలియని తనం వలన, ఎల్లప్పుడు నా వెంట ఉంటూ, నా కార్యక్రమాల విశిష్టతను దృశ్యంగా రికార్డు చేస్తూ నా కెంతగానో ఉపయోగపడుతున్న నా కెమెరాను నా వద్దనే పెట్టుకోనందుకు చింతించాను.

మాకు ఇచ్చిన తేనీరు సేవనం ముగిసేలోపల కువైట్ చేరుకుంటున్నట్టుగా విమానచోదకుడు ప్రకటన చేశాడు. నా దేశం నుండి నన్ను కువైట్‌కు తీసుకొచ్చిన విమానం కువైట్ అంతర్జాతీయ విమానాశ్రం చేరుకుంది. ప్రయాణీకులంతా హడాహుడిగా గబగబ దిగసాగారు. నేను నింపాదిగా నా సీట్లో కూర్చొని ఉన్నా. ప్రయాణీకుల హడాహుడి కాసింత తగ్గాక నా బ్యాగ్‌ను తీసుకుని ముందుకు నడవసాగాను. విమానంలోని సహాయకులు సహకరిస్తుండగా తిన్నగా విమానం నుండి బయటపడ్డాను. కడప నుండి నాతోపాటుగా కువైట్ వచ్చిన యువకులు కన్పించారు. ఆ యువకుల సహకారంతో








విమానాశ్రయంలోని అన్ని ఫార్మలిటీస్ పూర్తి చేసుకుని, లగేజ్ తీసుకుని విమానాశ్రయం బయటకు వచ్చేసరికి 2015 జనవరి 28 తేది ఉదయం తొమ్మిది గంటలయ్యింది.

## ఆత్మీయ ఆహ్వానం

నన్ను కువైట్‌కు ఆహ్వానించిన 'కడప ఇస్లామిక్ వెల్ఫేర్ సొసైటీ'కి చెందిన నాయకులెవ్వరితో నాకు ముఖ పరిచయాలు లేవు. అంతర్జాలం వలన 'ముఖపుస్తకం' లోని మిత్రులలో శ్రీ హనీఫ్ ముఖాన్ని మాత్రమే ముఖపుస్తకం (ఫేస్‌బుక్) ద్వారా చూసి ఉన్నాను. మరి కొందరితో చాటింగ్ జరిపి ఉన్నా కూడా వారిని గుర్తుపట్టలేను. నాకు ప్రత్యక్ష పరిచయం గల వ్యక్తి కడప నుండి విచ్చేసిన శ్రీ షేక్ ఇస్హాఖ్ అలీ మాత్రమే. ఆయన నాకంటె ముందుగా కువైట్ విచ్చేశారు. నన్ను రిసీవ్ చేసుకోడానికి తానే వస్తానని కూడా నాకు తెలిపి ఉండటంతో ఆ 'ఆజానబాహుని' కోసం నా కళ్ళు వెతకసాగాయి.

ఆ వెతుకులాటలో అటు ఇటు చూసుకుంటూ కువైట్ విమానాశ్రయం బయటకు వస్తున్నానో..లేదో చిరునవ్వులతో నన్ను స్వాగతిస్తూ కువైట్ మిత్రుల బృందం నాకు ఎదురు వచ్చింది. ప్రతి ఒక్కరూ ఆప్యాయంగా ఆలింగనం చేసుకుని 'కువైట్ కు స్వాగతం పలుకుతున్నాం' అన్నారు. ఈమేరకు నన్ను స్వాగతించిన వారిలో శ్రీ షేక్ ఇస్హాక్ అలీ, శ్రీ మహ్మద్ హనీఫ్, శ్రీ షౌకత్ అలీ ఖాన్, 'లక్కీ అజీజ్' పిలువబడే సయ్యద్ సద్రుద్దీన్ ఖాద్రిలను మాత్రం 'ముఖపుస్తకం' పరిచయం వలన గుర్తు పట్టగలిగాను. కువైట్‌లోని 'కడప ఇస్లామిక్ వెల్ఫేర్ సొసైటీ' అధ్యక్షులుగా కార్యక్రమాలకు మార్గదర్శకం చేస్తున్న 'సొసైటీ' అధ్యక్షులు శ్రీ షేక్ న్యామతుల్లా తదితరులు ఆప్యాయంగా ఆహ్వానించారు.

ఆ విధంగా జనవరి 28, 2015న ఉదయం తొమ్మిదిన్నర కువైట్ గడ్డ మీద అడుగు పెట్టాను. మిత్రుల ఆహ్వానం మేరకు విమానాశ్రయంలోని క్యాంటీన్‌లో అందరితో కలసి అల్పాహారం చేశాను. ఆ సమయంలో నా ప్రక్కన ఉన్న 'కువైటీ' అల్పాహారంలో భాగంగా పక్కన పళ్ళెంలో పెట్టి ఉన్న ఆకులను తినటం గమనించా. మన ప్రాంతంలో కన్పించని అతి పెద్ద సైజు నిమ్మకాయలు ముక్కలను ఆ ఆకులతోపాటు నంజుకుంటూ అతడు అల్పాహారం చేస్తున్నాడు. నా ఆశ్చర్యాన్ని గమనించిన శ్రీ హనీఫ్, ఆ ఆకులను 'జర్జీర్' అంటారని అవి శక్తిని, జీర్ణశక్తిని కలుగజేస్తాయని. ఇక్కడ ప్రతి హోటల్‌లో వీటిని ఆహారంతోపాటుగా సర్వ్ చేస్తారని, 'కువైటీలు' 'జర్జీర్' ఇష్టంగా భుజిస్తారని వివరించారు.

ఈ క్యాంటనీ నుండి శ్రీ హనీఫ్ సహకారంతో నా శ్రీమతి రమిజా బానుకు ఫోన్ చేసి నేను క్షేమంగా కువైట్ చేరుకున్న విషయం తెలిపాను. కువైట్ విమానాశ్రయంలో అల్పాహారం ముగిశాక విమానాశ్రయం నుండి పూర్తిగా బయటపడి శ్రీ కువైట్‌లోని 'కడప ఇస్లామిక్ వెల్ఫేర్ సొసైటీ' అధ్యక్షులు శ్రీ న్యామతుల్లా కారులో నేను, శ్రీ ఇస్హాఖ్ అలీ కువైట్ సిటీలోకి వచ్చాం. నేను అలసిపోయి ఉన్నాను కనుక విశ్రాంతి కోసం నన్ను నా గదిలో వదిలిపెడతామన్న మిత్రుల సూచనను కాదంటూ నేను వారి వెంట ఉండి పోయాను. నా కోసం ప్రత్యేంగా హోటల్ గది ఏర్పాటు ఉందన్నారు. నాకు వద్దన్నాను. శ్రీ ఇస్హాఖ్ అలీ బసచేసిన గృహంలో నేనూ ఉండిపోతానంటూ చేసిన నా ప్రతిపాదనకు మిత్రులు సంతోషిస్తూ అంగీకరించారు. ఆ విధంగా శ్రీ ఇస్హాఖ్ అలీ జత చేరిన నేను అప్పటి నుండి మళ్ళీ ఇండియా చేరుకునేంత వరకు శ్రీ అలీ మార్గదర్శకత్వంలో, పూర్తిగా ఆయన సహచర్యంలో గడిపాను.

భారత గణతంత్ర దినోత్సవ సంబరాలు నిర్వహించనున్న సభాస్థలి 'జామీయత్ అల్ ఇస్లాహ్' (Jamiath Al Islah) చూద్దామని శ్రీ న్యామతుల్లా, శ్రీ ఇస్హాఖ్ అలీలతో కలసి నేను వెళ్ళాను. ఆ సభావేదిక చాలా బాగుంది. 'సొసైటీ' నాయకులు చాలా కాలంగా కువైట్‌లో ఉంటున్నందున వారికి అరబిక్ బాగా రావడంతో తమ స్వంత ఊరి జనంతో మాట్లాడినట్టుగా సంభాషణలు సాగిస్తూ తమ తమ పనులను సునాయాశంగా పూర్తి చేసుకుంటున్నారు. ఆయా సంస్థలకు వెళ్ళినప్పుడు తప్ప స్థానికులు ఎవ్వరూ కూడా ఆయా రహదారుల్లో తిరుగుతున్నప్పుడు గాని, బజార్లలోగాని ఎక్కువగా కన్పించలేదు.

ఆకలి వేయసాగింది. మా బసకు సమీపంలో ఉన్న చిన్నపాటి హోటల్‌లో మధ్యాహన్నం భోజనం ముగించుకున్నాం. అక్కడ కూడా నేను విమానాశ్రయంలోని





పలహారశాలలో చూచినట్టుగా 'జర్జీర్' ఆకులను నంజుకుంటూ ప్రజలు భోజనాలు చేయడం, అల్పాహారాన్ని తీసుకోవడం చూశాను. మన దేశంలోని సామాన్యుల హోటళ్ళతో కువైట్‌లోని సామాన్య హోటల్స్‌కు పోల్చి చూస్తే ఎటువంటి ప్రత్యేకత కన్పించ లేదు. అక్కడి వ్యక్తుల్లో కూడా పెద్ద తేడా కన్పించలేదు. భౌగోళికంగా కూడా పెద్ద భిన్నత కన్పించలేదు. 'కువైటీ'ల కంటె ఇతర దేశాల నుండి వచ్చినవారే అక్కడ ఎక్కువగా కన్పించారు. ఇండియానుండి వచ్చిన వారు మరీ ఎక్కువగా ఉండటం వారి వారి ముఖ కవళికలను, ఆకారాలను, ఆహార్యాన్ని బట్టి గ్రహించాను.

జనవరి 30 నాటి కార్యక్రమానికి సంబంధించిన పలు పనులను పూర్తి చేసుకున్నాక, 'ఖైతాన్' ప్రాంతంలో గల శ్రీ ఇస్హాఖ్ అలీ బసచేసి ఉన్న గృహం వద్ద శ్రీ న్యామతుల్లా మమ్మల్ని దించారు. ఆ గృహం కువైట్‌లో ఉద్యోగం చేస్తున్న నెల్లూరు జిల్లాకు చెందిన శ్రీ. నజీబుద్దీన్ ఖాన్ కుటుంబానిది. ప్రస్తుతానికి ఆయన కుటుంబంతో సహా ఇండియా వెళ్ళి ఉన్నందున ఆ గృహం కాస్తా మాకు బసగా మారిపోయింది. ఆ గృహంలో ఒక చిన్నపాటి గది, అతి చిన్న వంటగది, టాయిలెట్ మాత్రమే ఉంది. ఆ గృహానికి ఇరవైఐదువేల అద్దె ఇస్తున్నట్టు తెలిసింది. ఆ గదిలో మా లగేజీ పడేసి, స్నానపానాదులు ముగించి కొంతసేపు విశ్రాంతి తీసుకున్నాం.

ఆ తరువాత స్నానం చేసి సాయంత్రం సమయంలో మళ్లీ మేమిద్దరం కలసి బజారుల్లో పడ్డాం. కువైట్‌లో ఎక్కడి కెళ్ళినా వాహనం ఉండాల్సిందే. అందువల్లే అక్కడ బజార్లలో వ్యక్తుల కంటె వాహనాలు ఎక్కువగా కన్పించాయి. శ్రీ ఇస్హాఖ్ అలీ ఆ వాహనం చోదకులుగా వ్యవహరిస్తుండగా బయలుదేరాం. కువైట్‌లోని 'కడప ఇస్లామిక్ వెల్ఫేర్ సొసైటీ' మూడు దశాబ్దాలు పూర్తిచేసుకున్న సందర్భంగా జరుగుతున్న 30వ వార్షికోత్సవం కోసం రూపుదిద్దుకుంటున్న 'సావనీర్' ప్రింటింగ్ బాధ్యతలు చూస్తున్న శ్రీ బడేపీర్‌ను కలిశాం. సావనీర్ ప్రింటింగ్ వివరాలు తెలుసుకున్నాం.

## నాకు 'వీసా' సమకూర్చిన సంస్థ సందర్శన

నా కువైట్ ప్రయాణానికి 'వీసా'ను సమకూర్చిన 'అల్ జిసర్' కంపెనీ (Al Jisr Intern Co, Shuwaik, Kuwait) కార్యాలయానికి వెళ్ళాం. అక్కడ 'సొసైటీ' అధ్యక్షులు, 'అల్ జిసర్' సంస్థ అధికారి శ్రీ షేక్ న్యామతుల్లాను కలిశాం. ఆ సంస్థ వాణిజ్య విభాగం బాధ్యులు Mr Ratheb Azzt వద్దకు నన్ను తీసుకెళ్ళి శ్రీ న్యామతుల్లా ఆయనకు పరిచయం చేశారు. Mr Ratheb సహృదయంతో స్వాగతం పలికారు. ఈ సందర్భంగా నా గ్రంథాల

గురించి శ్రీ న్యామతుల్లా ఆయనకు చెప్పారు. జనవరి 30న జరుగుతున్న 'భారత గణ తంత్ర దినోత్సవం'లో ప్రధాన ప్రసంగం ఉందని, ఆ కార్యక్రమానికి తప్పక రమ్మని Mr Ratheb ను ఆహ్వానించాం. 'భారత స్వాతంత్ర్యోద్యమంలో ముస్లింల పాత్ర' విషయం మీద ఆయనతో సంభాషించాం. చివరకు నాకు 'వీసా' కల్పించినందుకు Mr Ratheb Azzt, శ్రీ న్యామతుల్లా లకు ధన్యవాదాలు తెలిపాం.

'అల్ జిసర్' కంపెనీ గురించి, అక్కడి అధికారిగా తన బాధ్యతలను గురించి శ్రీ న్యామతుల్లా తెలిపారు. ఆయన కువైట్‌లో గత 30 ఏండ్ల నుండి ఉంటున్నట్టు చెప్పారు. ఈ దేశంలో భారతీయులు ఎక్కువగా ఉన్నారన్నారు. అనధికారిక లెక్కల ప్రకారంగా ఇక్కడ లక్షా 60 వేలకు పైగా తెలంగాణా, ఆంధ్రప్రదేశ్ రాష్ట్రాల ప్రజలు ఉన్నారని ఆయన వివరించారు. ఈ తెలంగాణా, ఆంధ్రప్రదేశ్ చెందిన తెలుగు ప్రజలలో ఒక్క కడప జిల్లా నుండి మాత్రమే 70 వేల మంది ఇక్కడ వివిధ ఉద్యోగాలు, వ్యాపారాలు చేస్తున్నారని తెలిపారు. అలా కొద్ది సేపు మాట-మంతి సాగాక, 'అల్ జిసర్' కంపెనీ నుండి శెలవు తీసుకుని 'సొసైటీ' సావనీర్ ప్రింట్ అవుతున్న ప్రెస్ వద్దకు వెళ్ళాం. ఆ రహదారిలో ఎక్కడ చూసినా మన దేశస్థులు, మన తెలుగు రాష్ట్రాలవారే ఎక్కువగా కన్పించారు. తెలుగు మాట్లాతున్నవారు కూడా అత్యధికంగా కన్పిస్తున్నారు.

## పరిచయ విందు కార్యక్రమం

నా కువైట్ రాక సందర్భంగా కువైట్‌లోని 'కడప ఇస్లామిక్ వెల్ఫేర్ సొసైటీ' ప్రధాన కార్యదర్శి శ్రీ పఠాన్ షౌకత్ అలీ ఖాన్ 'హవల్లీ' ప్రాంతంలో గల తన గృహంలో జనవరి 28, 2015 రాత్రి ఎనిమిది గంటలకు 'పరిచయ విందు కార్యక్రమం' ఏర్పాటు చేశారు. ఆ కార్యక్రమానికి బయలుదేరి నేను, శ్రీ ఇస్హాఖ్ అలీ వెళ్ళేసరికి 'సొసైటీ' నాయకులు, బాధ్యులు, ఇతర మిత్రులు సమావేశ స్థలిలో మా కొరకు ఎదురు చూస్తున్నారు. మేము వెళ్ళగానే శ్రీ షౌకత్ అలీ సాదరంగా స్వాగతం పలికి మమ్మల్ని తన గృహంలోకి తొడ్కొని వెళ్ళారు.

ఈ విందు సమావేశానికి 'సొసైటీ' సంచాలకులు శ్రీ యండి. హనీఫ్ అధ్యక్షత వహించగా తొలుత శ్రీ షౌకత్ అలీ ఆదరపూర్వకంగా అందరికి స్వాగతం పలికారు. ఈ కార్యక్రమంలో 'సొసైటీ' బాధ్యులు, ఇతర మిత్రులు చాలా మంది హాజరయ్యారు. తొలుతగా శ్రీ షౌకత్ పరిచయ కార్యక్రమాన్ని ఆరభించగా ప్రతి ఒక్కరూ తమ్ముతాము పరిచయం చేసుకుంటూ క్లుప్తంగా మాట్లాడారు. ఈ సందర్భంగా వారి మాటల్లో నిస్వార్ధ సేవాభావం, మంచి క్రమశిక్షణ, పూర్తి స్థాయి నిబద్దతను గమనించాను.







ది.28.01.2015 రాత్రి జరిగిన 'పరిచయ విందు కార్యక్రమం'లో మాట్లాడుతున్న కువైట్ 'కడప ఇస్లామిక్ వెల్ఫేర్ సొసైటీ' ప్రధాన కార్యదర్శి శ్రీ షౌకత్ అలీ.

## కువైట్‌లో నా తొలి ప్రసంగం

చివరకు నా వంతు వచ్చింది. నా వ్యక్తిగత పరిచయం చేసుకున్నాను. ఆ తరువాత 'భారత స్వాతంత్ర్యోద్యంలో ముస్లింల పాత్ర' ను పరిచయం చేస్తూ నేను ఎందుకు గ్రంథాలు రాస్తున్నానో వివరిస్తూ, ఎన్ని రాసానో, ఏ ఏ సందర్భాలలో రాశానో వెల్లడిస్తూ ఆ గ్రంథాల అవసరాన్ని వివరించాను. ప్రధానంగా నా 15 ఏండ్ల కృషితో వెలువడిన 'చరితార్థులు' ఆల్బమ్ గురించి తెలిపాను. నా ప్రసంగాన్ని చాలా శ్రద్ధగా, చాలా ఆసక్తిగా విన్నారు. ఆ తరువాత నన్ను ప్రశ్నిస్తూ మరిన్ని వివరాలను నా నుండి తెలుసుకున్నారు. ఈ విధంగా జరిగిన సమావేశం ద్వారా 'కువైట్'లో నా తొలి ప్రసంగం ఆరంభమైంది. మొదటిసారిగా విదేశంలో భారత స్వాతంత్ర్యోద్యంలో పాల్గొన్న ముస్లిం యోధుల ఘనతను వెల్లడించే అవకాశం లభించినందుకు సంతోషం కల్గింది.

ఈ 'పరిచయ విందు కార్యక్రమం' సందర్భంగా గత కొద్దికాలం నుండి నన్ను 'ముఖపుస్తకం' ద్వారా సంప్రదిస్తూ, నా 'ముఖపుస్తకం'లోని పోస్టింగ్స్‌ను అనుసరిస్తూ వాటి మీద వ్యాఖ్యానిస్తూ, వీలున్నప్పుడల్లా నన్ను 'కువైట్'కు రమ్మని ఆహ్వానిస్తూ నాతో చాటింగ్ జరుపుతున్న కొందరు యువకులు, నాకు చాలా కాలంగా పరోక్ష పరిచయం ఉన్న 'నెలవంక' తెలుగు మాసపత్రిక సంపాదకులు మౌలానా శ్రీ సయ్యద్ అబ్దుల్ సలాం, 'కడప ఇస్లామిక్ వెల్ఫేర్ సొసైటీ' మీడియా ఇన్‌చార్జ్ శ్రీ నిజాముద్దీన్, 'కడప ఇస్లామిక్ వెల్ఫేర్ సొసైటీ' యువజన విభాగం నాయకులు శ్రీ సయ్యద్ సద్రుద్దీన్ ఖాద్రి (లక్కీ అజీజ్) తదితరులు ఈ కార్యక్రమంలో నాకు ప్రత్యక్షంగా పరిచయం అయ్యారు.



**ది.28.01.2015న శ్రీ షౌకత్ అలీ గృహంలో జరిగిన 'పరిచయ విందు కార్యక్రమం' సందర్భంగా సోసైటీ' నేతలు.**

నా ప్రసంగం తరువాత ఏర్పాటు చేసిన విందును ముగించాము. ఆ విందులో కువైటీలు బాగా ఇష్టపడి స్వీకరించే పలు పదార్ధాలు, పండ్లు కూడా మాకు వడ్డించారు. ఈ సందర్భంగా మాకు ఆతిధ్యమిచ్చిన శ్రీ షౌకత్ అలీ, శ్రీ హనీఫ్‌లు ఆయా పండ్లు, పదార్ధాల విశిష్టతను నాకు వివరించారు. అనంతరం మిత్రుల నుండి వీడ్కోలు తీసుకుని, మేము మా బసకు చేరుకునే సరికి సరిగ్గా రాత్రి 12గంటలు అయ్యింది.

## ప్రముఖులతో భేటీ ఆరంభం

జనవరి 29, 2015 ఉదయం నేను మేల్కొనేసరికి 7గంటలయ్యింది. శ్రీ ఇస్హాఖ్ శుభోదయం పలుకుతూ, ఇంటికి ఫోన్ చేయాలనుకుంటే ఫోన్ చేయండంటూ తన మొబైల్ నా పరంచేశారు. ఆ సమయంలో ఇండియాలో పదిన్నర అయిందన్నారు. ఆయన మొబైల్ ద్వారా స్వదేశంలోని స్వజనంతో మాట్లాడి తొలిరోజు నాటి కువైట్ విశేషాలు వారికి ఎరుక పరిచాను. ఆ తరువాత త్వరితగతిన తయారై బస నుండి బయట పడ్డాం. కువైట్‌లో తెలుగు వారు నిర్వహిస్తున్న ఒక హోటల్‌కు వెళ్ళాం. అక్కడ అల్పాహార పదార్ధాలన్నీ మనం నిరంతరం తినే 'ఇడ్లి...దోస...పూరి' లాంటివి ఉన్నాయి. ఆ హోటల్లో ఉన్న వాళ్ళంతా విభిన్నమైన యాసలో తెలుగు మాట్లాడుతున్నారు. అక్కడ ఉన్న టివీలో కూడా తెలుగు ఛానెల్స్ నుండి కార్యక్రమాలు ప్రసారం అవుతున్నాయి.

ఆ వాతావరణం స్వదేశంలోని స్వంత పట్టణంలో ఉన్నట్టుగా నాకన్పించింది.





అల్పాహారం ముగించి మళ్ళీ మా కారులోకి ప్రవేశించాం. ఆ రోజున రాత్రికి గాని మాకు ముందుగా నిర్ణయించిన కార్యక్రమం ఏదీలేదు. మరేం చేద్దామనుకుంటూ, ఏవైనా చూడదగ్గ ప్రదేశాలకు వెడదామా? అని ఆలోచిస్తుండగా మిత్రులు శ్రీ హనీఫ్ నుండి శ్రీ ఇస్హాఖ్‌కు ఫోన్ వచ్చింది. కువైట్ ప్రధాన కేంద్రంగా తెలుగుతోపాటు పలు భాషల్లో నిర్వహిస్తున్న 'కువైట్‌యన్నారైస్‌డాట్‌కామ్' ప్రధాన సంపాదకులు శ్రీ చప్పిడి రాజశేఖర్ చేశారని, ఆయన నశీర్ భాయ్ ఇంటర్యూ అడుతున్నారని చెప్పారు.

ఈ విషయమైన శ్రీ రాజశేఖర్ మాతో మాట్లాడగలరని శ్రీ హనీఫ్ చెప్పారు. ఆ ఫోన్ కాల్ తర్వాత శ్రీ రాజశేఖర్ కాల్ కోసం ఎదురు చూస్తుండగా ఆయన నుండి కాల్ వచ్చింది. శ్రీ నశీర్ ఇంటర్యూ చేయాలనుందని అందుకు అవకాశం కల్పించాల్సిందిగా ఆయన కోరారు. శ్రీ ఇస్హాఖ్ సలహా మేరకు నేను శ్రీ రాజశేఖర్‌కు ఇంటర్యూ ఇవ్వడానికి సరేనన్నాను. ఆ తరువాత శ్రీ రాజశేఖర్ మాట్లాడుతూ ఆ రోజుననే మధ్యాహ్నం ఒంటి గంటకు 'సాల్‌మియా' ప్రాంతంలోని 'అవంతి ప్యాలెస్'లో లంచ్-ఇంటర్యూ చేద్దామన్నారు. ఆ 'కువైట్‌యన్నారైస్‌డాట్‌కామ్' ఇంటర్యూకు సమయం ఉన్నందున అప్పటి లోగా కొంతమంది మిత్రులను కలుద్దామని శ్రీ ఇస్హాఖ్ ప్రతిపాదించగా నేను సరేనన్నాను.

దక్షణాఫ్రికా దేశాలలో ఏర్పడిన వివిధ క్షామ పరిస్థితుల మూలంగా ఆకలి-దప్పులతో అల్లాడి పోతున్న ప్రజలకు, అవసరార్థులకు సహాయసహకారాలు అందిస్తున్న 'ఆఫ్రికా వెల్ఫేర్ కమిటీ' నేతృత్వంలో సాగుతున్న 'డైరెక్ట ఎయిడ్ సోసైటీ' కార్యాలయానికి వెళ్ళాము. ఆ సంస్థ ప్రాజెక్టు డైరక్టర్ శ్రీ అబూ ఇబ్రహీం శ్రీ ఇస్హాక్ మిత్రులు. ఆయనకు భారతీయుల పక్షాన బహుమతిగా 'చరితార్థులు' ఆల్బమ్‌ను అందచేశాం. సంతోషంగా ఆయన అల్బమ్ స్వీకరించి ధన్యవాదాలు తెలిపారు. ఆల్బమ్ విశేషాలను తెలుసుకున్నారు. మంచి పని చేశారంటూ అభినందించారు. ఈ సంభాషణ జరుగుతున్నంత సేపు శ్రీ ఇస్హాక్ అలీ మా ఇద్దరి మధ్యన 'ట్రాన్స్‌లేటర్'గా వ్యహరించి సహాయపడ్డారు.

## 'కువైట్‌యన్నారైస్‌డాట్‌కామ్'తో ఇంటర్యూ

'ఆఫ్రికా వెల్ఫేర్ కమిటీ' కార్యాలయంలో ఉద్యోగాలు చేస్తున్న మరికొందరు కడప మిత్రులలో కలసి వారితో మాటా-మంతి ఆయ్యాక మేము 'సాల్‌మియా'కు బయలు దేరాము. కువైట్‌లోని ఈ ప్రాంతాలు దూరం దూరంగా ఉండటంతో ఒక చోటు నుండి మరో చోటుకు వెళ్ళాలంటే సమయం పడుతుంది.

మేము చిన్నగా 'సాల్‌మియా' చేరుకున్నాం. శ్రీ రాజ శేఖర్ సూచించిన 'అవంతి ప్యాలెస్' కనుక్కొడానికి కొంత టైమ్ పట్టింది. ఈ అవంతి ప్యాలెస్ ఆనవాలు




**ది.29.01.2015న అవంతి ప్యాలెస్‌లో 'కువైట్‌యన్నారైస్‌డాట్‌కామ్' ప్రధాన సంపాదకులు చప్పిడి శ్రీ రాజశేఖర్‌కు 'చరితార్థులు' ఆల్బమ్ కానుక.**

కూడా కడప జిల్లాకు చెందిన వ్యక్తి అ మాకక్కడ అందించారు. కడప జిల్లాకు చెందిన వారు అత్యధికంగా ఉన్నందున మాకు ప్రతిచోట కడప మిత్రులే ఎదురు పడసాగారు. 'అవంతి ప్యాలెస్' చిరునామా తెలిసింది కనుక నేరుగా ప్యాలెస్ చేరుకున్నాం. ఈ 'అవంతి ప్యాలెస్' ను మన తెలుగువాళ్ళే నిర్వహిస్తున్నారని, కువైట్‌లో మంచి వ్యాపారసంస్థలను మనవాళ్ళు నిర్వహిస్తున్నట్టుగా తెలిసింది.

ఆ తరువాత శ్రీ ఇస్హాఖ్ అలీతో కువైట్ భౌగోళిక స్వరూపం, చరిత్ర, స్థానికంగా తెలుగు ప్రజల పాత్ర తదితర విషయాలు చర్చిస్తుండగా, 'కువైట్‌యన్నారైస్‌డాట్‌కామ్' ప్రధాన సంపాదకులు శ్రీ రాజశేఖర్ వచ్చారు. పరస్పర పరిచయాలయ్యాక లంచ్‌కు ఆర్డర్ ఇచ్చాం. శ్రీ రాజశేఖర్ ఇంటర్యూ అరంభించారు. నా రచనలను నేను తెలుగులోనే చేయడానికి గల కారణాల నుండి 'భారత స్వాతంత్ర్యోద్యమంలో ముస్లింల పాత్ర' గురించి మాత్రమే రచనలు తీసుకరావడానికి గల కారణాలను, ఆయా ప్రత్యేకతలను తెలుసుకోడానికి ఆయన ఆసక్తి చూపారు. శ్రీ రాజశేఖర్ ప్రశ్నలన్నిటికి సమాధానాలు ఇచ్చాక నా వ్యక్తిగత జీవితం గురించి కూడా వివరాలు ఆయన అడిగి తెలుసుకున్నారు. ఒక వైపున లంచ్ చేస్తూనే సుదీర్ఘ ఇంటర్యూను కానిచ్చాం. సుమారు మూడు గంటల పాటు సాగిన ఈ ఇంటర్యూను శ్రీ రాజశేఖర్ ఎంతో శ్రద్ధతో రికార్డు చేసుకున్నారు.

## 'కువైట్‌యన్నారైస్‌డాట్‌కామ్'లో నా గ్రంథాల ప్రచురణ

ఈ ఇంటర్యూ సందర్భంగా తన 'కువైట్‌యన్నారైస్‌డాట్‌కామ్'లో నా గ్రంథాలను ప్రచురించేందుకు శ్రీ రాజశేఖర్ అనుమతి కోరారు. నా గ్రంథాలన్నిటిని నేను ఎప్పుడో





ప్రజల పరం చేశాను కనుక నా నుండి ఎటువంటి ప్రత్యేక అనుమతి అక్కర లేదన్నాను. ఆ గ్రంథాలన్నీ నా దేశం సొత్తు, నా జాతి సొత్తు కనుక ఎవ్వరైనా ఎక్కడైనా నా గ్రంథాలలోని సమాచారాన్ని ప్రచురించుకోవచ్చని, అయితే ఆ విషయాన్ని తెలిపినట్టయితో నేనూ సంతోషిస్తానన్నాను. నా అంగీకారంతో ఆనందించిన ఆయన నా గ్రంథాలలోని 'భారత స్వాతంత్ర్యోద్యంఃఆంధ్రప్రదేశ్ ముస్లింలు'తో ఆరంభించి గ్రంథాలనిన్నటినీ 'కువైట్ యన్నారైస్‌డాట్‌కాం' ద్వారా తెలుగు పాఠకులకు అందజేస్తానన్నారు. ఆ మీదట నా పది గ్రంథాల 'పిడియఫ్ ఫైల్స్' ను ఆయనకు అంతర్జాలం ద్వారా అందజేశాను.

ఇంటర్యూ కార్యక్రమం ముగించుకుని వస్తూ వస్తూ శ్రీ ఇస్హాఖ్ అలీ పాస్‌పోర్టు తెచ్చుకునేందుకు భారత దేశ పాస్‌పోర్టు కార్యాలయానికి వెళ్ళాం. అక్కడ కూడా చాలా మంది తెలుగువాళ్ళు మాట్లాడుకుంటూ కన్పించారు.వారంతా కడప గడపకు చెందినవారని తెలిసింది.ఆ తరువాత 'సొసైటీ' సావనీర్ ప్రింట్ అవుతున్న ప్రెస్‌కు వెళ్ళి కొన్ని సావనీర్‌లను తీసుకుని మిగిలిన సావనీర్ కాపీలను తరలించడానికి 'సోసైటీ' బాధ్యులు శ్రీ యస్ మొహ్మద్ గౌస్‌కు విషయం తెలియజేశాం. ఆ తరువాత కువైట్‌లో ఉంటున్న కడప జిల్లా. కదిరికి చెందిన ఉర్దూ, అరబిక్, తెలుగులో అనర్గళంగా ధార్మిక ప్రసంగాలు చేయగల ధార్మిక విద్వాంసులు శ్రీ మౌలానా అబ్దుల్ ఖాదిర్ ఉమ్రిని కలిశాం. నా గురించి, నా గ్రంథాలు, ఇతర రచనల గురించి విని ఉన్న శ్రీ అబ్దుల్ ఖాదిర్ ఉమ్రి నన్ను ఆప్యాయంగా స్వాగతిస్తూ సంతోషం వ్యక్తంచేశారు.

## ప్రతి గురువారం తెలుగు బిడ్డల ఆధ్యాత్మిక సమావేశం

ఆ తరువాత కువైట్ పట్టణం 'మాలియా'లో ఖ్యాతిగాంచిన 'మర్జూఖ్ అల్ బదర్' మస్జిద్ కు నేను, మౌలానా శ్రీ అబ్దుల్ ఖాదర్ ఉమ్రి, శ్రీ ఇస్హాఖ్ అలీ కలసి రాత్రి ఎనిమిది గంటలకు చేరుకున్నాం. మేమంతా మసీదు వద్దకు వెళ్ళేసరికి 'సోసైటీ' బాధ్యులు, ఇతర మిత్రులు తమ తమ కుంటుంబాలతో సహా అక్కడ చేరుకుని మా కోసం ఎదురు చూస్తున్నారు. సువిశాలమైన ఆవరణతో, పలు గదులను కలిగి ఎంతో శుభ్రంగా, అందంగా విద్యుత్ కాంతులలో మస్జిద్ వెలిగి పోతుంది. మేము అక్కడి చేరుకోగానే ఇక ఏమాత్రం ఆలశ్యం కాకుండా శ్రీ షేక్ ఇస్హాఖ్ అలీ అధ్యక్షతన మసీదులో కార్యక్రమం ఆరంభమైంది.

తొలుతగా శ్రీ అబ్దుల్ ఖాదిర్ ఉమ్రి ధార్మిక ప్రసంగం సాగింది. ప్రతి ఒక్కరూ సమాజ హితాన్ని దృష్టిలో పెట్టుకుని సామాజిక సేవ చేయాలి. ప్రజావసరాలను తీర్చుతూ ప్రజల అభిమానం సయితం పొందాలన్నారు.'ప్రజలకు ఎవరి వల్లనయితే ఎక్కువ మేలు

కలుగుతుందో అతనే మీలో ఉత్తముడు' అని ఖురాన్ ప్రవచిస్తుంది కనుక ఆ దిశగా ప్రతి ఒక్కరు మరోకరి మేలు కోసం, సమాజ హితం దిశగా కృషి సాగించాలి, ఉత్తమ మానవుడిగా తన్నుతాను తీర్చిదిద్దుకోవాలని శ్రీ ఖాదిర్ ఉద్భోదించారు.

ఆ తరువాత నన్ను ప్రసంగించాల్సిందిగా కోరారు. ఈ కార్యక్రమానికి 'కడప ఇస్లామిక్ వెల్ఫేర్ సొసైటీ' కి చెందిన సభ్యుల కుటుంబాలు, వారి 'పర్దానషీ' మహిళలు. ఇతరులు కూడా హాజరై ఉన్నారన్నారు. మహిళలకు ఏర్పాటు చేసిన ప్రత్యేక గదిలో వారంతా ఉన్నారన్నారు. చక్కని మైక్ సిస్టమ్ ఉందని శ్రీ ఇస్హాఖ్ అలీ వివరిస్తూ, మన స్వాతంత్ర్యోద్యమంలో ముస్లింల పాత్ర గురించి ప్రత్యేకంగా మాట్లాడమని కోరారు.

## కువైట్‌లో నా మొదటి బహిరంగ ప్రసంగం

నా ప్రసంగం ఆరంభమైంది. ఒక విదేశంలో తొలిసారిగా బహిరంగ ప్రసంగం చేయనున్న నేను, ఈ అవకాశం కల్పించిన 'సొసైటీ' కువైట్ నాయకులకు, సభ్యులకు ముందుగా ధన్యవాదాలు తెలిపాను. ఆ తరువాత ఇక్కడి ప్రేక్షకులలో పురుషులతోపాటుగా సమ స్థాయిలో మహిళలు, పిల్లలు కూడా ఉన్నందున సాధారణ తీరుకు భిన్నంగా భారత స్వాతంత్ర్యోద్యమంలో పాల్గొన్న ముస్లిం మహిళల మీద ప్రత్యేకంగా మాట్లాడాను.

1857 నాటి బేగం హజరత్ మహల్, బేగం అజీజున్ దగ్గర నుండి జాతీయోద్యమంలో ప్రముఖ పాత్ర వహించిన ఆబాది బానో బేగం, బేగం జులేఖా, బేగం అన్సారి, బేగం ఆలం, బేగం నిషాతున్నీసా, బేగం షఫాతున్నీసా తదితరుల గురించి ప్రస్తావించాను. భారత స్వాతంత్ర్యోద్యమంలో ఎంతో మంది మహిళలు పాల్గొని అపూర్వ త్యాగనిరతిని, ధైర్య, సాహసాలను ప్రదర్శించినా అవన్నీ సరైన విధంగా నమోదుకు నోచుకోని దురదృష్టకర పరిస్థితిని వివరించాను. అలనాటి మహిళా త్యాగమూర్తుల సాహసిక చరిత్రను నమోదు చేసే విషయంలో వారి పేర్లు ప్రస్తావించకుండా వారి భర్తల పేరుతో వారిని గుర్తించడం వలన చరిత్ర నమోదులో వారి అస్తిత్వాలు ప్రదర్శితం కాకుండా పోవడంతో వారి మూర్తిమత్వాలు బహిర్గతం కాని చేదు నిజాలను తెలిపాను. అందువలన మహిళల పేర్లను వారి భర్తల పేరుతో కాకుండా వారి పూర్తిపేర్లతో నమోదు చేయాల్సిన అవసరాన్ని గుర్తుచేశాను. సుమారు 40 నిమిషాల పాటు సాగిన ఈ ప్రసంగాన్ని శ్రోతలు శ్రద్ధగా వినడంతో ఇది కువైట్ దేశంలో నేను మాట్లాడిన మొదటి బహిరంగ సభ అయ్యింది.

ఈ కార్యక్రమం తరువాత పలువురు యువకులు తమ సందేహాలను నివృత్తి చేసుకోడానికి నన్ను ప్రత్యేకంగా కలసి మాట్లాడారు. నేను మహిళల పక్షాన వకాల్తా






ప్రతి గురువారం తెలుగులో ప్రసంగాలు-విందు క్రమం తప్పక జరుగుతున్న 'మర్జూఖ్ అల్ బదర్' మస్జిద్

తీసుకుని మాట్లాడినట్టుగా కొందరు తమ అభిప్రాయాలను వ్యక్తంచేశారు. ప్రసంగాల తరువాత హాజరైన కుటుంబాలకు, అతిధులకు నిర్వాహకులు ఆతిధ్యం ఏర్పాటు చేశారు. ఒక్కొక్క పెద్ద పెద్ద పళ్ళాలలో ఆహార పదార్ధాలను వడ్డిస్తుండగా, ఆ పళ్ళెం చుట్టూ ముగ్గురేసి, నలుగురేసి ఉమ్మడిగా కూర్చోని పదార్ధాలను కలసి ఆరగించారు. నేను కూడా వారితో భాగం పంచుకున్నాను. ఈ ఆహార పదార్ధాలను కూడా వేర్వేరు కుటుంబాలు ఒక ప్రణాళికా ప్రకారంగా తమ తమ గృహాలలో తయారు చేసుకుని ఇక్కడికి తెచ్చి అందరితో కలసి ఆహార పదార్ధాలను పంచుకుని తినటం ఆనవాయితిగా జరుగుతుందని శ్రీ హనీఫ్ తెలిపారు. ఈ కార్యక్రమం పూర్తయ్యి అందరూ తమ గృహాలకు బయలుదేరేసరికి సుమారు రాత్రి 11 గంటలయ్యింది.

మా వాహనంలో బసకు చేరుకుంటుండగా చరిత్రగల 'మర్జూఖ్ అల్ బదర్' గురించి, కువైట్ దేశంలో మసీదుల నిర్మాణం, నిర్వహణ పద్దతులు, కువైట్ ప్రభుత్వం విధానాల గురించి శ్రీ ఇస్హాఖ్ అలీ నాకు వివరించడం ఆరంభించారు. శ్రీ ఇస్హాఖ్ అలీకి 35 ఏండ్లుగా కువైట్‌లో సంబంధాలు కలిగి ఉండటం నేను కువైట్‌లో ఉన్నన్ని రోజులు ఆయన అనునిత్యం నా వెంట ఉంటూ నాకు మార్గదర్శిగా వ్యవహరించడంతో కువైట్ భౌగోళిక, చారిత్రిక, సామాజిక విషయాలను తెలుసుకునే అవకాశం లభించింది.

కువైట్ దేశంలో ఎవ్వరైనా మస్జిద్‌లను నిర్మించవచ్చు. ఆ మస్జిద్‌లను నిర్మించాక వాటిని ప్రభుత్వానికి స్వాధీనంచేయాలి. ఆ మస్జిద్‌ల నిర్వహణ ప్రభుత్వం చూసు కుంటుంది. ఆ కారణంగా కువైట్ పట్టణంలో నేను సందర్శించిన ప్రతి మస్జిద్ కూడా


ది.29.01.2015న రాత్రి మర్జూఖ్ అల్ బదర్ మస్జిద్‌లో శ్రీ ఇస్హాఖ్ అలీ అధ్యక్షతన జరిగిన కార్యక్రమంలో, కువైట్‌లో నా తొలి ప్రసంగం.

ఎంతో ఆహ్లాదకర విశాలమైన ఆవరణలు కలిగి ఉండి, శుచి శుభ్రతకు మారు పేరుగా కన్పించాయి. ఈ మసీదుల్లో ధార్మిక కార్యక్రమాలు, ప్రసంగాలు చేయడానికి ప్రత్యేకంగా పరీక్షలు నిర్వహించి, సామర్థ్యాలను పరిశీలించి, పరీక్షించి అన్ని అర్హతలు గలవారికి ఉద్యోగులుగా నియమిస్తారు. ఆ ఉద్యోగులు బాధ్యతగా తమ కార్యక్రమాలను నిర్వహిస్తారు.

## తెలుగులో జుమా ప్రసంగాల ఆరంభం

ఈ విధానంలో ఏర్పడిన ఎంతో చరిత్ర గల మస్జిద్ 'మర్జూఖ్ అల్ బదర్'. కువైట్‌లో తెలుగులో శుక్రవారం నాడు 'ఖుద్బా' చదవడానికి రెండు దశాబ్దాల క్రితం కువైట్ ప్రభుత్వం అనుమతించింది. 1994 మార్చి 21న జుమా ప్రసంగాలకు తెలుగులో ఆరంభమయ్యాయి. ఈ 'మర్జూఖ్ అల్ బదర్' పురాతనమైనది కావడంతో వర్షాల వలన కూలిపోయింది. ఆ తరువాత ఖిబ్లా/మాలియా ప్రాంతంలోని,'ఇస్లామిక్ ప్రజన్‌టేషన్ కమిటీ' ప్రధాన కార్యాలయానికి ఎదురుగా గల 'బిన్ హమద్ మస్జిద్'లో కొంత కాలం ప్రార్థనలను కొనసాగించారు. 'మర్జూఖ్ అల్ బదర్' మస్జిద్ పునర్మించిన తరువాత అప్పటి వరకు 'బిన్ హమద్ మస్జిద్'లో జరుగుతూ వచ్చిన జుమా నమాజు, తెలుగులో సాగుతున్న జుమా ప్రసంగాలు 'మర్జూఖ్ అల్ బదర్' మస్జిద్‌లో పునఃప్రారంభమయ్యాయి.

ప్రస్తుతం నేను హజరైన కార్యక్రమం ప్రతి గురువారం 'మర్జూఖ్ అల్ బదర్' మస్జిద్‌లో 'సోసైటీ' క్రమం తప్పకుండా నిర్వహిస్తుంది. ఈ కార్యక్రమం గురించి ప్రత్యేకంగా ప్రకటనలు ఏమీ ఉండవు. ప్రతిసారి తెలియబర్చడం అంటూ, కబురు చేయడం ఉండదు. కువైట్‌లోని తెలుగు ముస్లిం కుటుంబాలకు కార్యక్రమం ప్రతి గురువారం జరుగుతుందని






ది.29.01.2015న రాత్రి మర్జూఖ్ అల్ బదర్ మస్జిద్‌లో  నా ప్రసంగం తరువాత అందరితో కలసి భోజనం

తెలుసు. అందువలన వీలున్నవారంతా గురువారం ఎనిమిది గంటలకల్లా ఇక్కడికి 'మర్జూఖ్ అల్ బదర్'కు  చేరుకుంటారు. ఈ కార్యక్రమాల నిర్వహణ 'సోసైటీ' సూచనల మేరకు, కమిటీ సభ్యుల ఆధ్వర్యంలో సాగుతుంది కనుక సోసైటీ సభ్యులు, ఇతరులు కూడా ముందస్తు సమాచారం లేకుండానే కార్యక్రమానికి హజరవుతారు.

ఈ విధంగా గత 20 సంవత్సరాలుగా కార్యక్రమాలు, తెలుగులో ప్రసంగాలు జరుగుతున్న చరిత్ర ఈ 'మర్జూఖ్ అల్ బదర్' కలిగి ఉందని శ్రీ ఇస్హాక్ అలీ తెలిపారు. మన రాష్ట్రం నుండి విచ్చేసిన ప్రజలకు మాతృభాషలో ధార్మిక సమాచారం అందించేందుకు ఉపక్రమించిన తాను, తమ 'సోసైటీ' ద్వారా తెలుగులో ప్రసంగాలను అనుమతిస్తూ, తమకంటూ ఒక మసీదును కేటాయించమని అలనాడు కువైట్ ప్రభుత్వాధినేతలకు వినతిపత్రం పంపగా, ప్రభుత్వం అంగీకరించటంలో తెలుగులో తొలిసారిగా ఖుద్బా ప్రసంగాల పరంపర ఆరంభమైందన్నారు. ఇండియా నుండి కాని ఇతర దేశాల నుండి కాని,  మన తెలుగు రాష్ట్రాల నుండి ఏ ప్రముఖ వ్యక్తి కువైట్ వచ్చినా వారిని ఆహ్వానించి వారి వారి బాటలో ఆధ్యాత్మిక, సామాజిక అంశాల మీద 'మర్జూఖ్ అల్ బదర్' మస్జిద్‌లో ప్రత్యేక గురువారం సమావేశాల సందర్భంగా ప్రముఖుల ప్రసంగాలు జరుగుతాయన్నారు.

1980లో బ్రతుకు దెరువు కొరకు కువైట్ దేశానికి విచ్చేసి, గత 35 ఏండ్లుగా కువైట్ దేశంతో, కువైట్ నగరంతో, నగరంలోని వివిధ ప్రాంతాలతో, ఆ నగరవాసులతో ప్రత్యేక పరిచయాలను, ఆత్మీయానుబంధాలను ఏర్పర్చుకున్న 'సొసైటీ' వ్యవస్థాపకులలో ఒకరైన శ్రీ షేక్ ఇస్హాక్ అలీ 'మర్జూఖ్ అల్ బదర్' చరిత్రను, తెలుగులో జుమా ప్రసంగాలు

ఆరంభమైన తీరుతెన్నులను, కువైట్‌లో సాగుతున్న తెలుగు ప్రసంగాలు తీరుతెన్నులను, ఆయా విధానాలను వివరించసాగారు. ఆయన వెల్లడిస్తున్న ఆసక్తికరమైన సమాచారాన్ని వింటూ విద్యుత్ వెలుగుల్లో మెరిసిపోతున్న కువైట్ నగరం అందచందాలను అస్వాదిస్తు, నగరంలోని ఆకాశహర్మ్యాలను చూస్తూ, విశాలమైన రహదారులను, ఆ రహదారులలో దర్జాగా తిరుగాడుతున్న సరికొత్త వాహనాలను చూస్తూ ముందుకు సాగిన మేము రాత్రి 12 గంటల ప్రాంతంలో బసకు చేరుకున్నాం.

## అరవైఆరవ భారత గణతంత్ర దినోత్సవ సంబరాలు

జనవరి 30, 2015, భారత గణతంత్ర దినోత్సవం, 'కడప ఇస్లామిక్ వెల్ఫేర్ సొసైటీ' 30వ వార్షికోత్సం సంబరాల రోజు రానే వచ్చింది. అరవై ఆరవ భారత గణతంత్ర దినోత్సవం జనవరి 26న జరపాలని తొలుత నిర్ణయించినా, కువైట్‌లో శుక్రవారం శెలవు కనుక అందరికి వెసలుబాటు కలుగుతుందని జనవరి 30 శుక్రవారం రోజున ఈ సంబరాలు నిర్వహించాలని నిర్ణయించినట్టు 'సొసైటీ' సంచాలకులు శ్రీ మహమ్మద్ హనీఫ్ తెలిపారు. ఆ కారణంగా జనవరి 30న, 'కడప ఇస్లామిక్ వెల్ఫేర్ సొసైటీ' 30వ వార్షికోత్సవం కూడా భారత గణతంత్ర దినోత్సవంతో జతకలిసింది.

ఈ కార్యక్రమానికి ముఖ్యఅతిథి, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం చీఫ్‌విప్, కడప జిల్లా రాజంపేట శాసనసభ్యులు శ్రీ మేడా వెంకట మల్లికార్జున రెడ్డి జనవరి 30న వస్తున్నారని శ్రీ ఇస్హాక్ అలీ చెప్పారు. ముఖ్యఅతిధికి ఆహ్వానం పలికేందుకు కువైట్ విమానాశ్రయానికి వెళ్ళారు. శ్రీ మేడా చెన్నయ్ నుండి కువైట్ ప్రయాణించిన విమానం నేను కువైట్ చేరుకున్నట్టే జనవరి 30, 2015 ఉదయం ఎనిమిదిన్నరకు కువైట్ చేరుకుంది. శ్రీ మేడాతోపాటుగా విచ్చేసిన కడప జిల్లా నాయకులు శ్రీ అతికారి వెంకటప్పయ్య, శ్రీ షేక్ గుల్జార్ బాషా తదిరులకు 'కడప ఇస్లామిక్ వెల్ఫేర్ 'సొసైటీ' కువైట్ నాయకులు ఆదరంగా స్వాగతం పలికారు. 'ప్రవాసాంధ్ర తెలుగుదేశం పార్టి–కువైట్ శాఖ' అధ్వర్యంలో కార్యకర్తలు, శ్రీ మేడా అభిమానులు పెద్ద సంఖ్యలో విచ్చేసి ఆయనకు ఘనంగా స్వాగతం పలికారు.

## 'తెలుగు మస్జిద్' లో సాదర స్వాగతం

ఆ తరువాత శ్రీ ఇస్హాఖ్ అలీ తిరిగి మా బసకు చేరుకున్నారు. ఆ పాటికి నేను తయారుగా ఉండటంతో ఇరువురం కలసి ఆనాటి ప్రధాన కార్యక్రమాలలో పాల్గొనేందుకు ఎప్పటిలాగే బయలుదేరాం. కువైట్‌లోని 'మిర్గాబ్' ప్రాంతంలో 'తెలుగు మస్జిద్'గా ఖ్యాతి గడించిన 'అల్ హమద్' మస్జిద్ ప్రాంగణానికి చేరుకున్నాం. ఆ రోజు శుక్రవారం.






కువైట్ దేశంలో 'తెలుగు మస్జిద్'గా విఖ్యాతిగాంచిన 'బిన్ హమద్ మస్జిద్'

కువైట్‌లో ఉన్న సోదరులు జుమా నమాజు కోసం ఒక్కొక్కరుగా మస్జిద్ ప్రాంగణానికి చేరుకుంటున్నారు.

ఈ విధంగా ఆక్కడికి చేరుతున్న వారిలో అత్యధికులు మంది నాతో 'ముఖపుస్తకం' ద్వారా ఎరిగిన వారు కావడంతో అంతా ఆదరంగా పలకరిస్తూ, ఎంతో ఆత్మీయంగా స్వాగతిస్తున్నారు. 'మీ కోసం ఎన్నాళ్ళ నుంచో ఎదురు చూస్తున్నాం' అంటూ ఆప్యాయంగా పలకరిస్తున్నారు. ఆనందిస్తున్నారు. ఆ వాతావరణం నాకు చాలా ప్రత్యేకంగా కన్పించసాగింది.

చివరకు ముఖ్యఅతిధిగా కువైట్ విచ్చేసిన శ్రీ మేడా వెంకట మల్లికార్జున రెడ్డి, ఆయనతోపాటుగా ఇండియా నుండి కువైట్ విచ్చేసిన శ్రీ షేక్ గుల్జార్ బాషా, శ్రీ వెంకటయ్య తదితరులు మస్జిద్ ప్రాంగణానికి చేరుకున్నారు. అతిధుల రాకతో మసీదు ప్రాంగణం కోలాహలంతో నిండిపోయింది. ఎటువైపు చూసినా తెలుగులో పరస్పరం పలకరింపులు...అభినందనలు...ఆనందపు వ్యక్తీకరణలు దృశ్యమానం కాసాగాయి.. ఆ ప్రాంతంలో ఎక్కడ చూసిన...ఎటు చూసినా...తెలుగువాళ్ళే...ఎవరి నోట విన్నా తెలుగు భాషే విన్పించసాగింది. కువైట్ తెలుగు ప్రజలలో కడప జిల్లాకు చెందిన బిడ్డలు అత్యధికులు కావడంతో కడప మాండలికం స్పష్టంగా మారుమ్రోగుతుంది. ఈ వాతావరణంలో భౌతికంగా మాతృభూమికి మూడువేల ఏడువందల డెభైఐయిదు కిలోమీటర్ల దూరంలోని 'కువైట్'లో నేను ఉన్నాన్న వాస్తవాన్ని కూడా మర్చిపోయి అనిర్వరచనీయమైన అనుభూతికి లోనయ్యాను...ఆనందభరితుడనయ్యాను.

జుమా నమాజ్‌కు సమయం దగ్గరపడుతుండగా అజాం విన్పించింది. మరికొద్ది నిమిషాల్లో పెద్దసంఖ్యలో ప్రజలు మస్జిద్ ప్రాంగణానికి చేరుకున్నారు. 'కడప ఇస్లామిక్ వెల్ఫేర్ సొసైటీ' కువైట్ నాయకులు, సభ్యులు, ఇతరులు పెద్ద సంఖ్యలో హాజరయ్యారు. శ్రీ మేడా రాక సందర్భంగా ముస్లిమేతర మిత్రులు కూడా చాలా మంది మస్జిద్ ప్రాంగణంలో కన్పించారు. నేను, శ్రీ మేడా, ఆయన వెంట వచ్చిన వ్యక్తులు అంతా కలసి శ్రీ షేక్ ఇస్హాఖ్ అలీ మార్గదర్శకత్వంలో మసీదులో ముందు వరుసలో కూర్చున్నాం. తొలుత నన్ను, శ్రీ మేడాను పరిచయం చేస్తూ శ్రీ ఇస్హాఖ్ అలీ మాట్లాడారు. ఆ తరువాత శ్రీ మేడా, నేను మిత్రులను ఉద్దేశించి క్లుప్తంగా మాట్లాడాము.

## 'తెలుగు'లో ఖుద్బా ప్రసంగం

జుమా నమాజ్ సమయం ఆసన్న అవుతుండగా మస్జిద్ లోపల బయట ప్రజలు బాగా నిండిపోయారు. అతిథుల పరిచయాలు, అతిథుల సంక్షిప్త ప్రసంగాలు పూర్తయ్యాక అంతా నమాజ్‌కు సిద్దమయ్యారు. ఆ నమాజుకు ముందుగా మౌలానా శ్రీ సయ్యద్ అబ్దుల్ సలాం తెలుగులో ఖుద్బా ప్రసంగం చేశారు. మౌలానా ధార్మిక ప్రసంగం తెలుగులో ఇలా సాగింది: 'అజ్ఞానాంధకారంలో మునిగి ఉన్న సమాజానికి ఇస్లాం జ్ఞాన కాంతినందించింది. నామోషిగా భావించిన ఆడ కూతుళ్ళను సజీవ సమాధి చేసిన తల్లితండ్రులే ఆమె పుట్టుక శుభవార్తగా, స్వర్గానికి సోపానంగా, నరకాగ్ని నుండి కాపాడే రక్షణ కవచంగా భావించి తలెత్తుక తిరిగారు. కుమారులు, కుమార్తెలకు సయితం ఆస్తి హక్కు ఇవ్వడం తమ విధిగా గుర్తించారు. శతాబ్దాలపాటు మద్యం మత్తులో జోగిన జాతి, ఇక ప్రళయ దినం వరకు చుక్క మద్యం కూడా ముట్టేది లేదని శపథం చేసింది. తన స్థాయి, ఆత్మగౌరవాన్ని మరచిపోయి అగుపించిన ప్రతి వస్తువును దైవంగా తలంచి పూజించిన వారు, నిజ సృష్టికర్త ఒక్కడేనని, సకల ఆరాధనలకు, సమస్త స్తోత్రాలకు, ఉపవాసా రీతులకు ఆయన ఒక్కడే అర్హుడని అర్థం చేసుకున్నారు. ఊడిగం, వెట్టిచాకిరి చెయ్యడానికి వీరు పుట్టారు అనుకునే తమ బానిసలను నాయకులుగా, అధినాయకులుగా నియమించుకోడానికి సిద్దమయ్యారు....ఈ మార్పుకు, వారి సత్ప్రవర్తనకు, పరివర్తనకు కారణం ఒక్కటే–అదే ఇస్లాం...మానవతా ధర్మమయిన ఇస్లాం.' అని ప్రవచించారు.

మౌలానా శ్రీ అబ్దుల్ సలాం ఖుద్బా ప్రసంగం తరువాత శుక్రవారం ప్రత్యేక నమాజ్ పూర్తయ్యింది. శ్రీ మేడా వెంకట మల్లికార్జున రెడ్డి, ఆయన సహచరులు అందరితో కలసి సామూహిక నమాజ్‌లో భక్తి శ్రద్ధలతో పాల్గొన్నారు.







ది.30.01.2015న 'తెలుగు మస్జిద్'గా ఖ్యాతిగాంచిన 'మస్జిద్ అల్ హమద్' వద్ద నన్ను, శ్రీ మేడా మల్లికార్జున రెడ్డిని స్వాగతిస్తున్న 'సొసైటీ' నేతలు.

## 'ముఖపుస్తకం' మిత్రులతో ముచ్చట్లు

ఆ సమయంలో 'ముఖపుస్తకం' (ఫేస్‌బుక్) ద్వారా నాతో స్నేహ సంబంధాలు పెంచుకున్న మిత్రులు చాలా మంది వచ్చి కలిశారు. ప్రతి ఒక్కరూ రావడం వారి వారి పేర్లు, వివరాలు తెలుపుతూ నన్ను కలసి ఆనందించసాగారు. కువైట్‌లో నాకు ఇంతమంది మిత్రులు ఉండటం చాలా ఆశ్చర్యం కలిగించింది. ఆ మిత్రులతో ఎవరు ఎక్కడి వారన్న విశేషాలు తెలుసుకుంటూ కాసేపు వివిధ విషయాల మీద ముచ్చటించాను. 'ముఖపుస్తక' పరిచయం మనుషుల్ని ఎంత సన్నిహితుల్ని చేస్తుందో అర్ధం సాగింది.

ఈ వరుసలో, నా నెల్లూరు మిత్రులు శ్రీ కువైట్ అహమ్మద్ ద్వారా పరిచయమైన, మన దేశంలో నాతో మాట్లాడి, నా ఆల్బమ్ 'చరితార్థులు' ను కువైట్ తీసుక వెళ్ళి అక్కడి మిత్రులకు అందజేసిన శ్రీ సి ముస్తాఫా రెడ్డితో ప్రత్యక్ష పరిచయం కలిగింది. గత కొన్ని ఏండ్లుగా కువైట్‌లోని ఒక కంపెనీలో ఇంజనీర్‌గా బాధ్యతలు నిర్వహిస్తున్న మా సన్నిహిత బంధువు శ్రీ మహమ్మద్ సిరాజ్ కూడా అక్కడే నన్ను కలుసుకున్నారు. ఈ మేరకు నన్ను కలిసిన ప్రతి 'ముఖపుస్తకం' మిత్రులకు, ఇతరులకు ధన్యవాదాలు తెలుపుతూ 'గణతంత్ర దినోత్సవ సభ'కు కూడా విచ్చేయవలసిందిగా ఆహ్వానించాను.

కువైట్ పర్యటన తరువాత నేను స్వదేశం వచ్చాక, మళ్ళీ ముఖపుస్తకం ద్వారా మిత్రులు నా యోగక్షేమాలు అడుగసాగారు. ముఖపుస్తకం మిత్రులు చాలా మందిని కువైట్‌లో కలసినందున అందర్ని గుర్తుపెట్టుకోవడం నాకు కష్టమైయ్యింది. ఇండియా వచ్చాక ముఖపుస్తకం ద్వారా మిత్రులు నన్ను పలకరించినప్పుడల్లా 'మీరు కువైట్‌లో



**ది.30.01.2015న హోటల్‌లో లంచ్ సమయంలో రాష్ట్రంలోని ముస్లింల స్థితిగతుల గురించి శ్రీ మేడాకు వివరిస్తున్న మహ్మద్ హనీఫ్, నశీర్**

నన్ను కలవలేదా సోదరా? అని నేను ప్రశ్నించసాగాను. ఆ ప్రశ్నకు సమాధానంగా ఆయా మిత్రులు నా తొమ్మిది రోజుల పర్యటనలో అక్కడక్కడ నాతో కలిసి తీయించుకున్న ఫోటోలను 'ఇదిగో మిమ్మల్ని ఇలా కలిశాను' అంటూ సాక్ష్యాలు చూపించసాగారు. అప్పుడుగాని నాతో కలసి మిత్రులు ఇన్ని ఛాయాచిత్రాలు తీసుకున్నారా? అన్పించింది. ఈ విషయంలో మిత్రులు చూపిన ఆసక్తి నాకెంతో ఆశ్చర్యం కల్గించింది.

## ముస్లింల స్థితిగతుల మీద శ్రీ మేడాతో చర్చ

జుమా నమాజ్ అయ్యాక 'కడప ఇస్లామిక్ వెల్ఫేర్ సొసైటీ' అతిథుల కోసం ఏర్పాటు చేసిన 'లంచ్' కార్యక్రమంలో పాల్గొనేందుకు నేను, శ్రీ ఇస్హాఖ్ అలీ, మౌలానా శ్రీ షేక్ అబ్దుల్ ఖాద్రి ఉమ్రి 'బనీదిల్‌గార్' ప్రాంతంలో గల 'కాంటినెంటల్ హోటల్' చేరుకున్నాం. మేము వెళ్ళేసరికి 'సోసైటీ' బాధ్యులు, ఇతర హితైషులు చాలా మంది హోటల్ చేరుకుని ఉన్నారు. అంతలో శ్రీ మేడా వెంకట మల్లికార్జున రెడ్డి తన అనుచరులతో కలసి విచ్చేశారు. శ్రీ మేడాతో కలసి అంతా ఖరీదైన 'లంచ్' పూర్తి చేశాం.

శ్రీ మేడా 'సోసైటీ' అతిథిగా కువైట్ వస్తున్న సందర్భంగా నవ్యాంధ్రప్రదేశ్‌లో ముస్లిం జనసముదాయాలు ఎదుర్కొంటున్న ప్రత్యేక సమస్యలను ఆయన దృష్టికి తీసుకొచ్చేందుకు తగిన సమాచారంతో రావాల్సిందిగా 'సొసైటీ' సంచాలకులు శ్రీ హనీఫ్ ముందుగా కోరి ఉన్నందున నేను సమచారం సమకూర్చుకుని కువైట్ వెళ్ళాను. ఈ లంచ్ కార్యక్రమం సందర్భంగా 'కాంటినెంటల్ హోటల్'లో సుమారు రెండు గంటల పాటు శ్రీ మేడా మాతో గడిపారు. ఆ సమయాన్ని వినియోగించుకుంటూ, ఆంధ్రప్రదేశ్







ది. 30.01.2015న 'బహిరంగ సభ జరగనున్న 'రౌధా' ప్రాంతంలోని 'జమియత్ అల్ ఇస్లాహ్ ఆడిటోరియం' ప్రాంగణంలో స్కౌట్ బాలురతో.

విభజన జరిగినాక నవ్యాంధ్రప్రదేశ్ లోని ముస్లింల సామాజిక, ఆర్థిక, రాజకీయ స్థితిగతులు తగిన సమాచారంలో శ్రీ మేడాతో నేను, శ్రీ హనీఫ్ చర్చించాము. మేము వ్యక్తంచేస్తున్న అంశాలు, గణాంకాలను శ్రీ రెడ్డి ఆసక్తిగా తెలుసుకున్నారు.

ఆ తరువాత ఆనాటి ప్రధాన కార్యక్రమం అయినటువంటి అరవైఆరోవ భారత గణతంత్ర దినోత్సవం, 'కడప ఇస్లామిక్ వెల్ఫేర్ సొసైటీ' 30వ వార్షికోత్సవ సంబరం సాయంత్రం ఐదు గంటలకు ఆరంభం కానున్నది కనుక చాలా సమయం మిగిలి ఉంది. ఆ సమయంలో నేను శ్రీ ఇస్హాక్ అలీ ఇరువురం మౌలానా శ్రీ షేక్ అబ్దుల్ ఖాదిర్ ఉమ్రి కలసి శ్రీ ఖాదిర్ మిత్రుని గదికి వెళ్ళాం. ఆ గదిలో కొంతసేపు సేద తీరాక సాయంత్రం ఐదు గంటలు కావస్తున్నందున 'రౌధా' ప్రాంతంలో గల 'జమియత్ అల్ ఇస్లాహ్ ఆడిటోరియం' (Jamiath Al Islah Auditorium) ప్రాంగణానికి చేరుకున్నాం. మన కార్యక్రమం ఆరంభానికి ఇంకా సమయం ఉన్నందున సభికులు, ఆహ్వానితులు, అతిథులు ఆడిటోరియంకు రాసాగారు. 'సొసైటీ' నాయకులు, నిర్వహణలో పాలుపంచుకుంటున్న 'సొసైటీ' కార్యకర్తలు ఏర్పాట్లను చూస్తూ హడాహుడి పడుతున్నారు.

## కువైట్ స్కౌట్ బాలురతో మాటా-మంతి

ఈలోగా 'జమియత్ అల్ ఇస్లాహ్' ప్రాంగణంలోని పచ్చిక బయళ్ళ మీద కూర్చొని ఏదో చర్చించుకుంటున్న చాల మంది బాలురను చూశాను. వారి వస్త్రధారణ బట్టి స్కౌట్ బాలురు అన్పించింది. ఆ బాలుర చెంతకు చేరి నన్ను నేను పరిచయం చేసుకుంటూ నేను ఇండియా నుండి వచ్చానన్నాను. నన్ను ఆహ్వానిస్తూ బాలురు అరబిక్‌లో



ది.30.01.2015న రాత్రి 'రౌధా' ప్రాంతం 'జమియత్ అల్ ఇస్లాహ్ ఆడిటోరియం'లో జరిగిన సభకు స్వాగతం పలుకుతున్న 'కడప ఇస్లామిక్ వెల్ఫేర్ సొసైటీ' సంచాలకులు శ్రీ మహమ్మద్ హనీఫ్.

మాట్లాడసాగారు. మౌలానా శ్రీ అబ్దుల్ ఖాదిర్ ఉమ్రి నన్ను ఆదుకున్నారు. నాకు ఆ బాలురకు మధ్య ఆయన దుబాసి బాధ్యతలను నిర్వహించారు. ఆ బాలురంతా కువైట్ నుండి మరో దేశంలో సేవా కార్యక్రమాలు నిర్వహిచేందుకు వెడుతున్నట్టు తెలిసింది. ఆ బాలుర మాటల్లో మన దేశం పట్ల వారిలో అభిమానం ఉన్నట్టు గమనించాను. ఆ పచ్చిక బయళ్ళ మీద వారితో, వారి నాయకునితో కలసి కూర్చోని కాసేపు ముచ్చట్లాడాను.

## సర్వ సౌకర్యాలున్న వ్యవస్థ 'జమియత్ అల్ ఇస్లాహ్'

ఆడిటోరియం ప్రాంగణానికి విచ్చేస్తున్న అతిథులు ఎవరి పనిలో వారుండగా నేను 'జమియత్ అల్ ఇస్లాహ్' వ్యవస్థను, అక్కడి నిర్మాణాలను, కార్యక్రమాలను పరిశీలించ సాగాను. 'జమియత్ అల్ ఇస్లాహ్' సహకార పద్ధతిలో ఏర్పాటు చేసుకున్న సంస్థ. విశాలమైన ప్రాంగణం. పిల్లలకు, యువకులు, పెద్దలకు, అవసరమగు అధునిక ఏర్పాట్లు ఉన్నాయి. భారీ నిర్మాణాలు, చిన్నా-పెద్ద స్టేడియంలు ఉన్నాయి. సాహిత్యప్రచురణ మీద ప్రత్యేక దృష్టి పెట్టినట్టుంది ఒక ప్రచురణ సంస్థ కూడా ఉంది. అక్కడ చక్కని గ్రంథాలయం ఉంది. అందమైనది మాత్రమే కాకుండా విశాలమైన మసీదుతో పాటుగా వివిధ రకాల క్రీడలకు ఉపయోగపడు ఆటస్థలాలు, స్విమ్మింగ్ పూల్, ప్రజలు సేద తీర డానికి పచ్చని ఆరుబయలు ఉంది. రంగు రంగుల పూలనిచ్చే చక్కని మొక్కలు, చెట్లు గల 'జమియత్ అల్ ఇస్లాహ్ ఆడిటోరియం' ప్రాంగణం ఆహ్లాదకరంగా ఉంది. ప్రజల ధార్మిక అవసరాలు తీర్చడం మాత్రమే కాకుండా ఇక్కడ అన్ని వయస్సుల ప్రజల సామాజిక, మానసిక అవసరాలను తీర్చడానికి 'జామియత్ అల్ ఇస్లాహ్'ను రూపకల్పన చేసినట్టుంది.






ది.30.01.2015న 'రౌధా' ప్రాంతం 'జమియత్ అల్ ఇస్లాహ్ ఆడిటోరియం'లో జరిగిన సభలో జాతీయ గీతం ఆలపిస్తున్న సభికుల్లో ఒక భాగం.

## సొసైటీ స్టాల్‌లో 'చరితార్థులు'

జమియత్ అల్ ఇస్లాహ్ ప్రాంగణం అంతా కలయ తిరుగుతూ తిన్నగా ఆడిటోరియం పరిసరాలకు చేరుకున్నా. ఆడిటోరియం వద్ద 'చరితార్థులు' ఆల్బమ్ కాపీలను విక్రయానికి స్టాల్ ఏర్పాటు చేసుంది. నా పుస్తకాలతోపాటుగా 'ఇస్లామిక్ ప్రెజెంటేషన్ కమిటీ', 'సోసైటీ'లో అంతర్భాగమగు 'అల్ ఫారూఖ్ పబ్లికేషన్స్' ప్రచురణ సంస్థ మరియు 'జమియత్ అహయా అత్తరాస్ అల్ ఇస్లామి' కూడా బుక్‌స్టాల్స్ ఏర్పాటు చేసి తమ తమ ప్రచురణలను ప్రదర్శిస్తున్నాయి. ఈ స్టాల్స్ ఏర్పాటు చేసిన సంస్థలలో కొన్ని ఉచితంగా ధార్మిక గ్రంథాలు అందిస్తుండగా మరికొన్ని భారీ డిస్కౌంట్‌తో పుస్తకాలు అందిస్తున్నాయి. 'చరితార్థులు' ఆల్బమ్ స్టాల్ వద్ద కాసేపు నిల్చోని, ఆల్బమ్‌ను ఆసక్తిగా గమనిస్తున్న పాఠక మిత్రులతో పిచ్చాపాటి మాట్లాడుతుండగా సభా నిర్వాహకులు నన్ను వెతుక్కుంటూ వచ్చారు. సభా కార్యక్రమం ఆరంభం కానుంది కనుక స్టాల్స్ వద్దగల పాఠకమిత్రుల నుండి శెలవు తీసుకుని, త్వరితగతిన ఆడిటోరియం చేరుకున్నాను. ఈ సంబరాల ముఖ్య అతిథి శ్రీ మేడా వెంకట మల్లికార్జు రెడ్డి సభా ప్రాంగణం చేరుకున్నారు. ప్రజలు కూడా ఆడిటోరియం చేరుకుని సభా కార్యక్రమం ఆరంభానికి ఎదురు చూస్తున్నారు.

## భారత అరవై ఆరవ గణతంత్ర సంబరాలు ఆరంభం

భారత అరవైఆరవ గణతంత్ర దినోత్సవం, 'కడప ఇస్లామిక్ వెల్ఫేర్ సొసైటీ' 30వ వార్షికోత్సవ సంబరాలు జమిలిగా ఆరంభం అయ్యాయి. మౌలానా శ్రీ అబ్దుల్ ఖాదిర్ ఉమ్రి ఖురాన్ పఠనం, ఆయత్‌ల అనువాదంతో సభా కార్యక్రమం ఆరంభమైంది.



ది.30.01.2015న రాత్రి 'రౌధా' ప్రాంతం 'జమియత్ అల్ ఇస్లాహ్ ఆడిటోరియం'లో జరిగిన సభలో అధ్యక్షోపన్యాసం చేస్తున్న 'కడప ఇస్లామిక్ వెల్ఫేర్ సొసైటీ' కువైట్ అధ్యక్షులు శ్రీ షేక్ న్యామతుల్లా.

'కడప ఇస్లామిక్ వెల్ఫేర్ 'సొసైటీ' కువైట్ సంచాలకులు శ్రీ మహమ్మద్ హనీఫ్ అతిథులను వేదిక మీదకు స్వాగతిస్తుండగా 'సొసైటీ' కార్యకర్తలు, నాయకులు కలసి అతిథులను ఎంతో గౌరవాభిమానాలతో వేదిక మీదకు తొడ్కొని వెళ్ళి పుష్పగుచ్ఛాలను అంజేస్తూ, ఆహ్వానిస్తూ ఉచితాసనాలు చూపిస్తున్నారు.

సుందరంగా అలంకరించిన సువిశాల సభావేదిక మీద 'సొసైటీ' వ్యవస్థాపక అధ్యక్షులు శ్రీ షేక్ ఇస్హాఖ్ అలీ, 'సొసైటీ' కువైట్ అధ్యక్షులు శ్రీ షేక్ న్యామతుల్లా, కువైట్ 'సొసైటీ' ప్రధాన కార్యదర్శి శ్రీ పఠాన్ షౌకత్ అలీ ఖాన్, స్వదేశం నుండి విచ్చేసిన ముఖ్యఅతిథి శ్రీ మేడా వెంకట మల్లి కార్జున రెడ్డి, గౌరవ అతిథి శ్రీ సయ్యద్ నశీర్ అహమ్మద్, కువైట్‌లోని భారతీయ ముస్లిం సంఘాల సమాఖ్య అధ్యక్షులు శ్రీ సిద్దీఖీ వలియకత్, కువైట్‌లోని భారతీయ ముస్లిం సంఘాల సమాఖ్య పూర్వాధ్యక్షులు శ్రీ మహమ్మద్ అబ్దుల్ కరీం ఇర్ఫాన్, 'ఖాన్ గ్రూప్ ఆఫ్ కంపెనీస్' అధినేత, శ్రీ మొహమ్మద్ హోష్‌దార్ ఖాన్, ఇండియా నుండి విచ్చేసిన కడప జిల్లా రాజకీయ ప్రముఖులు శ్రీ షేక్ గుల్జార్ బాషా తదితర అతిథులు, ప్రముఖులు ఆశీనులయ్యారు.

అనంతరం జాతీయ గీతంతో సభాకార్యక్రమం ఆరంభమైంది. కువైట్ 'సొసైటీ' సంచాలకులు, ప్రస్తుత కార్యక్రమం కన్వీనర్ శ్రీ మహమ్మద్ హనీఫ్ పర్యవేక్షణలో సభాధ్యక్షులు శ్రీ షేక్ న్యామతుల్లా స్వాగత వాక్యాలు పలుకుతూ 'సొసైటీ' చరిత్రను కుప్తంగా వివరించారు. 'కువైట్ వంటి విదేశీ గడ్డపై తెలుగు మరియు ఉర్దూలో జుమా ప్రసంగాలు, వారాంతర సమావేశాలకు అనుమతి ఇచ్చి సహకరించిన 'వజారతుల్







ది.30.01.2015న రాత్రి 'రౌధా' ప్రాంతం 'జమియత్ అల్ ఇస్లాహ్ ఆడిటోరియం'లో జరిగిన సభలో నివేదిక సమర్పిస్తున్న 'కడప ఇస్లామిక్ వెల్ఫేర్ సొసైటీ' ప్రధానకార్యదర్శి శ్రీ షౌకత్ అలీ ఖాన్.

ఔఖాఫ్ లిష్షుహునిల్ ఇస్లామీయా', 'మస్జిద్ అల్ కబీర్' యాజమాన్యానికి ధన్యవాదాలు' తెలిపారు.

ఆ తరువాత కువైట్ 'సొసైటీ' ప్రధాన కార్యదర్శి శ్రీ పఠాన్ షౌకత్ అలీ ఖాన్ మాట్లాడుతూ కువైట్‌లో 'సొసైటీ' 1984లో స్థాపించటం జరిగిందన్నారు. ఆనాటి నుండి తమ 'సొసైటీ' 'ధర్మ పరిచయం–సంఘసంస్కరణ–సామాజిక సేవ' ప్రధాన లక్ష్యాలుగా నిర్దేశించుకుని కువైట్ కార్యక్షేత్రంగా ఎంతో ఆచణాత్మకంగా ముందుకు సాగుతుందన్నారు. గత కొద్దిఏండ్ల నుండి కువైట్‌లో 'సొసైటీ' నిర్వహించిన కార్యక్రమాల వివరాలతో కూడిన నివేదిక సమర్పించారు.

## సొసైటీ 'సావనీర్'–'చరితార్థులు' ఆల్బమ్ ఆవిష్కరణ

ఈ సంబరాలలో భాగంగా 'సొసైటీ' తన 30వ వార్షికోత్సవం జరుపుకుంటున్న, సందర్భాన్ని పురస్కరించుకుని 'కడప ఇస్లామిక్ వెల్ఫేర్ సొసైటీ–కువైట్ 30వ వార్షికోత్సవం సావనీర్' పేరుతో రూపొందించిన ప్రత్యేక 'సావనీర్' ను ముఖ్యఅతిథి శ్రీ మేడా వెంకట మల్లికార్జున రెడ్డి ఆవిష్కరించారు. ఈ సావనీర్‌లో 'సొసైటీ' లక్ష్యాలు, నాయకుల నివేదికలతో, అధ్యక్షులు, కార్యవర్గ సభ్యుల చిత్రాలు, 'సొసైటీ' నిర్వహించిన కార్యక్రమాల వివరాలను ఇటు తెలుగు, అటు ఉర్దూ, ఆంగ్ల భాషల్లో కూడా పొందుపర్చారు. ఈ సమాచారంతో పాటు చక్కని సమాచారయుక్తమైన వ్యాసాలను జతచేశారు.

ఆ తరువాత '1757 నుండి 1947 వరకు బ్రిటిష్ వలసపాలకులకు వ్యతిరేకంగా సాగిన పోరాటాలలో పాల్గొన్న భారత ఉపఖండం లోని 155 మంది




ది.30.01.2015న రాత్రి 'రౌధా' ప్రాంతం 'జమియత్ అల్ ఇస్లాహ్ ఆడిటోరియం'లో జరిగిన సభలో 'సోసైటీ' ప్రచురించిన 'సావనీర్'ను శ్రీ మేడా వెంకట మల్లికార్జున రెడ్డి ఆవిష్కరించిన సందర్భంగా వేదిక మీద శ్రీ హనీఫ్, శ్రీ న్యామతుల్లా, శ్రీ ఇస్హాక్ అలీ, శ్రీ నశీర్ అహమ్మద్.

ముస్లిం యోధుల సంక్షిప్త వివరాలు, చిత్రపటాలతో రూపొందిన 'చరితార్థులు' వినూత్న ఆల్బమ్‌ను ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం చీఫ్‌విప్ శ్రీ మేడా వెంకట మల్లికార్జున రెడ్డి ఆవిష్కరించారు. ఈ ఆల్బమ్ తొలి ప్రతిని కువైట్‌లోని భారతీయ ముస్లిం సంఘాల సమాఖ్య పూర్వాధ్యక్షులు శ్రీ మహమ్మద్ అబ్దుల్ కరీం ఇర్ఫాన్ కు శ్రీ మేడా అందించారు.

అనంతరం మౌలానా శ్రీ అబ్దుల్ ఖాదిర్ ఉమ్రి ధార్మిక ప్రసంగం ఆరంభమైంది. మౌలానా మాట్టాడుతూ, సమాజంలో జరుగుతున్న చెడును చూస్తూ కూడా తమకు ఏమీ పట్టనట్టు, తమకెలాంటి సంబంధం లేనట్టు వ్యవహరిస్తే అటువంటి వారు పరోక్షంగా ఆయా నేరాలను, ఆ నేరస్థులను ప్రోత్సహించినట్టు కాగలదు. అపరాధం చేసిన వారితోపాటు అపరాధాన్ని సహించి నిర్లిప్తంగా ఉండేవారు కూడా నైతికంగా ధర్మం దృష్టిలో నేరస్తులే, శిక్షార్హులే...కనుక చెడును నిరోధించడానికి ప్రతి ఒక్కరూ పూనుకోవాలన్నారు. భిన్న సంస్కృతులకు కేంద్రంగా భాసిల్లుతున్న భారత దేశంలో ప్రతి ఒక్కరూ తమ ఇంటి నుండి మంచిని, మానవత్వాన్ని, మత సామరస్యాన్ని, పరిశుద్ధతను పెంపొందించేందుకు పూనుకున్నప్పుడు మాత్రమే 'స్వచ్ఛ భారతం–స్వేచ్ఛా భారతం' సాధ్యమవుతుందన్నారు.

'గౌరవ అతిథి'గా విచ్చేసిన నన్ను 'భారత స్వాతంత్ర్యోద్యమంలో ముస్లింల పాత్ర'ను వివరిస్తూ ప్రధాన ప్రసంగం చేయాల్సిందిగా కన్వీనర్ శ్రీ హనీఫ్ స్వాగతించారు. ప్రప్రథమంగా భారతీయులందరి పక్షాన కువైట్‌లో ఉన్న స్వదేశీ సోదరులందరకి భారత గణతంత్ర దినోత్సవ శుభాభివందనాలు వెల్లడిస్తూ ప్రసంగం ఆరంభించాను. అనంతరం 1984 స్థాపించిన 'కడప ఇస్లామిక్ వెల్ఫేర్ సొసైటీ' చరిత్రను ప్రస్తావిస్తూ మూడు








ది.30.01.2015న రాత్రి ది.30.01.2015న 'రౌధా' ప్రాంతం 'జమియత్ అల్ ఇస్లాహ్ ఆడిటోరియం'లో జరిగిన సభలో 'చరితార్థులు' ఆల్బమ్‌ను శ్రీ మేడా వెంకట మల్లికార్జున రెడ్డి ఆవిష్కరించిన సందర్భంగా వేదిక మీద శ్రీ షౌకత్, శ్రీన్యామతుల్లా, శ్రీ ఇస్హాక్ అలీ, శ్రీ నశీర్.

దశాబ్దాలుగా సేవాసంస్థకు సారధ్యం వహిస్తున్న 'సొసైటీ' సభ్యులను, నాయకులను అభినందించాను. బ్రతుకుతెరువు కొరకు వచ్చిన మనకు మన జాతీయ పర్వ దినాలను జరుపుకోడానికి అనుమతించిన 'కువైట్' పాలకులకు ధన్యవాదాలు తెలిపాను.

భారత స్వాతంత్ర్యసంగ్రామంలో భాగంగా 1765 ప్రాంతంలోనే ఈస్ట్ ఇండియా కంపెనీ తుపాకులకు ప్రాణాలు పణంగా పెట్టిన 150 మంది ఫకీర్ల ఆత్మ బలిదానంతో ఆరంభించాను. బ్రిటిష్ సామ్రాజ్యవిస్తరణ కాంక్షను పసిగట్టి ఆది నుండి ఆంగ్లేయులను వ్యతిరేకిస్తూ, పరదేశీయులను నిరోధించేందుకు స్వదేశీ పాలకులతో కలసి జాతీయ ఐక్యసంఘటన ఏర్పాటుకు పిలుపునిచ్చిన 'మైసూరు పులి' టిపూ సుల్తాన్ ధైర్యసాహసాలను, ఆయన పోరాట రీతులను వివరించాను.

1857 నాటి ప్రథమ స్వాతంత్ర్యసమరం కంటె ముందుగా 1780లో మద్రాస్ ప్రెసిడెన్సీలో భాగమైన ఆంధ్రలోని విశాఖపట్నంలో ఈస్ట్ ఇండియా కంపెనీ సైనిక స్థావరంలో తిరుగుబాటును విజయవంతం చేసిన గుంటూరు జిల్లా సత్తెనపల్లి గ్రామస్తుడు సుబేదార్ శ్రీ అహమ్మద్ సాహసాన్ని, ఆయన బలిదానాన్ని ప్రస్తావించాను. ప్రథమ స్వాతంత్ర్యసంగ్రామంలో హిందూ ముస్లింలు కలసి కట్టుగా సాగించిన పోరాటం, ఆ సందర్భంగా ఈ జనసమూహాల మధ్య వ్యక్తమైన ఐక్యత ఈస్ట్ ఇండియా కంపెనీ సైనికాధికారుల్లో గుబులు పుట్టించి తీరుతెన్నులను వివరిస్తూ, ఆ ఐక్యతను విచ్ఛిన్నం చేయడానికి ఆంగ్లేయులు అనుసరించిన 'విభజించు–పాలించు' విధానం మన దేశానికి ఎంతటి చేటును తెచ్చిపెట్టిందో సోదాహరణంగా పేర్కొన్నాను.

1857లో ఆంగ్లేయులకు ముచ్చెమటలు పట్టించిన బేగం హజరత్ మహల్, మౌల్వీ అహ్మదుల్లా షా ఫైజాబాది, బేగం అజీజున్, అజీముల్లా ఖాన్ లాంటి యోధుల పోరాట చరిత్రలు ఏవిధంగా మరుగున పడ్డాయో వివరించాను. 1885 నాటి భారత జాతీయ కాంగ్రెస్ ఏర్పాటు నుండి ఆరంభమై 1906 నాటి భారత జాతీయోద్యమంలో ముస్లిం యోధుల అద్వితీయ పాత్రను విశదీకరించాను. 1947లో స్వరాజ్య సాధన వరకు భారతీయ ముస్లిం సమాజం బ్రిటిష్ వలసపాలకులకు వ్యతిరేకంగా సాగిన పోరాటాలలో ప్రదర్శించిన ధైర్యసాహసాలను, త్యాగనిరతిని స్థాయీపూలకంగా విశ్లేషించాను.

## జాతీయోద్యమంలో ఆంధ్రుల భాగస్వామ్యం

చివర్లో ఆంధ్రప్రదేశ్ చరిత్రను ప్రస్తావిస్తూ మన్యం పోరాట యోధుడు శ్రీ అల్లూరి సీతారామరాజుకు తుపాకి ఉపయోగించడం నేర్పిన బ్రిటిష్ ప్రభుత్వంలోని హెడ్‌కానిస్టేబుల్ శ్రీ షేక్ మదీనా, అల్లూరి విప్లవోద్యమానికి పరోక్షంగా సహకరించిన బ్రిటిష్ ప్రభుత్వంలోని డిప్యూటీ కలెక్టర్ శ్రీ పజులుల్లా ఖాన్‌ల వివరాలు వెల్లడించాను. భారత స్వాతంత్ర్యోద్యమ సాహిత్య చరిత్రలో అద్భుత సృష్టిగా పేర్కొనదగిన 'జైహింద్'–'నేతాజీ'లను సృష్టించిన హైదరాబాద్ నివాసి శ్రీ ఆబిద్ హసన్ సఫ్రాని, 1919లో మహాత్ముని పిలుపు మేరకు తన ప్రభుత్వ పదవిని త్యజించిన తొలి ఆంధ్రుడు కృష్ణా జిల్లా విజయవాడకు చెందిన శ్రీ గులాం మొహిద్దీన్ కార్యదక్షత, త్యాగనిరతిని పేర్కొన్నాను. 1943లో ఆజాద్ హింద్ ఫౌజ్ పోరాట నిధికి తాను దాచుకున్న 20 వేల రూపాయలను విరాళంగా ఇచ్చి, భారత జాతీయ సైనికుడిగా తుపాకి చేతపట్టి నేతాజి బాటన సాగిన విజయనగరం జిల్లా వేపాడ గ్రామస్తులు శ్రీ షేక్ ఖాదర్ మొహియుద్దీన్ లాంటి స్వాతంత్ర్య సమరయోధుల పోరాట విశేషాలను ఏకరువు పెట్టాను. ఈ విషయాలన్నీ తాము ఇంత వరకు విననటువంటివి, చదవనటువంటివి కావడంతో సభికులు ఉద్వేగభరితులవుతూ పలుమార్లు తమ కరతాళ ధ్వనులతో విశేషాంశాలను స్వాగతించారు.

## ఐక్యత లక్ష్యంగా చరిత్ర రచన

చివరకు హిందూ–ముస్లింల మధ్యనున్న స్నేహబంధాలు మరింత బలోపేతం చేయడానికి, మత సామరస్యవాతావరణాన్ని మరింతగా పటిష్టం చేయాలన్న సంకల్పంతో 'భారత స్వాతంత్ర్యోద్యమంలో ముస్లింల పాత్ర'ను వివరిస్తూ నేను సాగిస్తున్న చరిత్ర గ్రంథాల రచన వైనాన్ని తెలియపర్చాను. సద్భావన, సదవగాహన, తద్వారా ఏర్పడు సఖ్యత–సామరస్య వాతావరణం ద్వారా ప్రశాంతత, ప్రశాంతత ద్వారా సమాజంలో








ది.30.01.2015న రాత్రి 'రౌధా' ప్రాంతం 'జమియత్ అల్ ఇస్లాహ్ ఆడిటోరియం'లో జరిగిన సభలో 'భారత స్వాతంత్ర్యోద్యమంలో ముస్లిం పాత్ర' అను అంశం మీద ప్రధాన వక్తగా ప్రసంగిస్తున్న శ్రీ సయ్యద్ నశీర్ అహమ్మద్.

ప్రగతి ఏ విధంగా సాకారమవుతుందో వివరిస్తూ నా చారిత్రిక రచనలు భారత దేశంలోని వివిధ సాంఘిక జనసముదాయాల మధ్య సఖ్యత–సామరస్య వాతావరణం మరింతగా బలపడడానికి దోహదం కాగలవన్న ఆశాభావాన్ని వ్యక్తంచేస్తూ ముగించాను.

## నా ప్రసంగంలో దొర్లిన పొరపాట్లు

నా ప్రసంగంలో వస్తుగతంగా రెండు పొరపాట్లు దొర్లాయి. 1857 నాటి మౌల్వీ లియాఖత్ అలీ విరచిత 'హమ్ హై ఇస్‌కే మాలిక్...హిందూస్తాన్ హమారా' గీతం గురించి మాట్లాడుతూ దీనిని కెప్టన్ మోహన్ సింగ్ నాయకత్వంలోని భారత జాతీయ సైన్యం 'మార్చింగ్ సాంగ్'గా స్వీకరించిందని పొరపాటుగా చెప్పాను. శ్రీ మోహన్ సింగ్ నాయకత్వంలోని 'భారత జాతీయ సైన్యం' అల్లామా మహమ్మద్ ఇక్బాల్ రచన 'సారే జహాఁ సేఁ అచ్ఛా హిందూస్తా హమారా'ను మార్చింగ్ సాంగ్‌గా స్వీకరించింది. ఆ తరువాత 1857 నాటి ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామం గురించి మాట్లాడుతూ, ప్రముఖ చరిత్రకారుడు శ్రీ సురేంద్ర నాథ్ సేన్ ప్రచురించిన '1857' గ్రంథంలోని చారిత్రక విశేషాలను ప్రస్తావిస్తూ రచయిత పేరును తప్పుగా పలికాను.

## శ్రీ మేడా వెంకట మల్లికార్జున రెడ్డి ప్రసంగం

నా ప్రసంగం తరువాత ముఖ్య అతిధి శ్రీ మేడా వెంకట మల్లికార్జున రెడ్డి మాట్లాడుతూ, విదేశంలో ఆరంభించిన 'కడప ఇస్లామిక్ వెల్ఫేర్ సొసైటీ' అటు స్వదేశంలో పలు సంక్షేమ–అభివృద్ధి కార్యక్రమాలను చేపట్టి నిర్వహించడమే కాకుండా కువైట్‌లో కూడా పలు అభివృద్ధి– సంక్షేమ కారక్రమాలను మూడు దశాబ్దాలుగా నిర్వహించగలగటం




ది.30.01.2015న రాత్రి 'రౌధా' ప్రాంతం 'జమియత్ అల్ ఇస్లాహ్ ఆడిటోరియం'లో జరిగిన సభలో శ్రీ సయ్యద్ నశీర్ అహమ్మద్ ను 'సొసైటీ' పక్షాన సత్కరిస్తున్న శ్రీ మేడా వెంకట మల్లికార్జున రెడ్డి.

అద్భుతమని ప్రశసంసించారు. జాతీయ భావాలను ప్రోదిచేసే, వివిధ సాంఘిక జన సముదాయాలకు చెందిన భారతీయుల మధ్యన స్నేహసంబంధాలను మరింతగా పటిష్ట చేయగల 'ఆగస్టు 15 స్వాతంత్ర్య దినోత్సవం', 'భారత గణతంత్ర దినోత్సవం' లాంటి జాతీయ పండగలను 'కడప ఇస్లామిక్ వెల్ఫేర్ సొసైటీ' క్రమం తప్పక నిర్వహించడం ముదావహం అన్నారు. మన ముఖ్యమంత్రి శ్రీ నారా చంద్రబాబు నాయుడు నాయకత్వంలో జరుగుతున్న సంక్షేమ-అభివృద్ధి కార్యక్రమాల వివరాలను శ్రీ మేడా ఎకరువు పెట్టారు.

## ఇక్బాల్ తరానాతో ఉర్రూతలూగించిన ఇస్హాఖ్ అలీ

ఆ తరువాత 'కడప ఇస్లామిక్ వెల్ఫేర్ సొసైటీ' వ్యవస్థాపక అధ్యక్షులు, మూడు దశాబ్దాలుగా సమాజ సేవలో ముందుకు సాగుతున్న 'సొసైటీ' కార్యక్రమాల రూపశిల్పి, మార్గదర్శకులు శ్రీ షేక్ ఇస్హాఖ్ అలీ ప్రంసగిస్తూ 1984లో కువైట్‌లో స్థాపించబడిన 'కడప ఇస్లామిక్ వెల్ఫేర్ సొసైటీ' సేవాతత్పరులైన 'సొసైటీ' సభ్యుల ఆర్థిక-అంగ-మేధో సహకారం, ఇతర ఉదార హృదయులైన దాతల చేయూత వలన మాత్రమే మనుగడ సాగిస్తుందని, మంచి పనులు చేయగలుగుతుందన్నారు.

అనంతరం ప్రముఖ తాత్వికుడు, విశ్వకవిగా విఖ్యాతుడు శ్రీ అల్లామా మహమ్మద్ ఇక్బాల్ చే ఉర్దూ భాషలో విరచితమైన విఖ్యాత తరానా 'సారే జహాఁ సే అచ్ఛా... హిందూస్థాన్ హమారా' తెలుగు అనువాదాన్ని ఆకర్షణీయమైన బాణిలో శ్రీ ఇస్హాఖ్ అలీ మృధుమధురంగా పాడి విన్పించారు. మాతృభూమి ఔనత్యాన్ని ఎత్తిచూపుతూ, అసేతు







**ది.30.01.2015న రాత్రి 'రౌధా' ప్రాంతం 'జమియత్ అల్ ఇస్లాహ్ ఆడిటోరియం' జరిగిన సభలో శ్రీ మేదా వెంకట మల్లికార్జున రెడ్డిని సత్కరిస్తున్న శ్రీ ఇస్హాఖ్ అలీ.**

హిమాచల పర్యంతం ఉన్న మన మాతృభూమి విశ్వంలోనే ఎంతో గొప్పదంటూ శ్రీ ఇక్బాల్ రాసిన పాట శ్రీ ఇస్హాఖ్ గొంతు నుండి తెలుగు దనం నింపుకుని కమ్మగా వెలువడటంతో సభికులు ఎంతో ఉద్వేగానికి లొనయ్యారు. శ్రీ ఇస్హాఖ్ పాటను పూర్తిగా పాడుతున్నంత వరకు సభాస్థలిలో పూర్తి నిశ్శబ్దం ఆవరించింది. శ్రీ ఇక్బాల్ పాటను రసరమ్యంగా పాడిన శ్రీ ఇస్హాఖ్‌ను సభికులు తమ కరతాళ ధ్వనులతో అభినందించారు.

అనంతరం కువైట్‌లోని భారతీయ ముస్లిం సంఘాల సమాఖ్య అధ్యక్షులు శ్రీ సిద్దీఖీ వలియకత్ మాట్లాడుతూ, భారత గణతంత్ర దినోత్సవాన్ని,'కడప ఇస్లామిక్ వెల్ఫేర్ సొసైటీ' 30వ వార్షికోత్సవం సంబరాల సందర్భంగా 'సొసైటీ' సభ్యులకు, నాయకులకు అభినందనలు తెలిపారు. స్వచ్ఛంద సంస్థలు, అందునా సేవా సంఘాలు స్థాపించడం వాటిని దశాబ్దాల పర్యంత ప్రజల హితం కాంక్షిస్తూ, అభివృద్ధి-సంక్షేమ కార్యక్రమాలతో ముందుకు తీసుకెళ్ళడం అరుదైన విషయం అన్నారు. అసాధ్యాన్ని సుసాధ్యం చేసి చూపుతున్న 'సొసైటీ' సభ్యులకు, నాయకులకు, మార్గదర్శకులకు ఆయన శుభాభి వందనాలు తెలిపారు. భవిష్యత్తులో 'సొసైటీ' కార్యక్రమాలకు తమ వంతుగా చేయూత ఇవ్వగలమని శ్రీ సిద్దీఖీ వలియకత్ వాగ్దానం చేశారు.

భారతీయ ముస్లిం సంఘాల సమాఖ్య పూర్వాధ్యక్షులు శ్రీ మహమ్మద్ అబ్దుల్ కరీం ఇర్ఫాన్ మాట్లాడుతూ 'కడప ఇస్లామిక్ వెల్ఫేర్ సొసైటీ' కువైట్‌లో భారతీయుల చేత స్థాపింబడిన ఇతర సంస్థలకు మార్గదర్శకంగా నిలచిందన్నారు. మూడు దశాబ్దాలుగా


ది.30.01.2015న రాత్రి 'రౌధా' ప్రాంతం 'జమియత్ అల్ ఇస్లాహ్ ఆడిటోరియం'లో జరిగిన సభలో ప్రసంగిస్తున్న 'కడప ఇస్లామిక్ వెల్ఫేర్ సొసైటీ' వ్యవస్థాపక అధ్యక్షులు శ్రీ షేక్ ఇస్హాఖ్ అలీ.

ప్రజలకు ఇటు ధార్మిక పరిజ్ఞానం కలుగజేస్తూ, సంఘ సంస్కరణ కార్యక్రమాలను ముమ్మరంగా చేయబడుతూ, అటు సామాజిక సేవా కార్యక్రమాల ద్వారా అవసరార్థులకు తగిన సేవలను అందించడం అభినందనీయం అన్నారు.

ప్రముఖ వ్యాపారవేత్త, కువైట్‌లోని 'ఖాన్ గ్రూప్ ఆఫ్ కంపెనీస్' అధినేత శ్రీ మొహమ్మద్ హోష్‌దార్ ఖాన్ మాట్లాడుతూ అటు స్వదేశం ఇటు విదేశంలోని ప్రజలలో జాతీయ సమైక్యత, సమగ్రతా భావనలను పెంపొందింప చేయడానికి 'కడప ఇస్లామిక్ వెల్ఫేర్ సొసైటీ' జాతీయ పండుగలును నిర్వహించడం సంతోషదాయకం అన్నారు.

ఇండియా నుండి విచ్చేసిన కడప జిల్లా నాయకులు శ్రీ జి. షేక్ గుల్జార్ బాషా మాట్లాడుతూ విస్మరణకు గురైన ముస్లిం స్వాతంత్ర్యసమరయోధుల చరిత్రలను పాఠ్య పుస్తకాలలో పాఠ్యాంశాలుగా చేర్చాలని డిమాండ్ చేశారు. కడప జిల్లాకు చెందిన ప్రముఖ స్వాంత్ర్యసంగ్రామ యోధులు శ్రీ షేక్ పీర్ షాహ్ స్మారక స్థూపం ఏర్పాటుకు శ్రీ మేడా వెంకట మల్లికార్జున రెడ్డి చొరవ చూపాలని విజ్ఞప్తి చేశారు.

## తెలుగు ధార్మిక రచయితలకు సత్కారం

కువైట్ ప్రధాన కేంద్రంగా నడుస్తున్న తెలుగు ప్రచురణ సంస్థలకు పలు ధార్మిక గ్రంథాలను, స్థానికంగా ప్రచురితమవుతున్న తెలుగు ధార్మిక పత్రికల ద్వారా ఉపయుక్తమగు ధార్మిక-సామాజిక వ్యాసాలను, ఉర్దూ,అరబిక్ భాషల నుండి ధార్మిక సాహిత్యం అనువాదాలను అందించిన పలువురు తెలుగు రచయితలను ఈ సందర్భంగా 'కడప ఇస్లామిక్ వెల్ఫేర్ సొసైటీ' ఘనంగా సత్కరించింది. కువైట్‌లో జరుగుతున్న పలు ధార్మిక సమావేశాలు, సభలలో, జుమ్మా ప్రార్థనలలో ప్రత్యేకంగా తెలుగు భాషలో ధార్మిక





ప్రసంగాలను చేస్తూ, తమ రచనల ద్వారా తెలుగు భాషావర్గానికి ధార్మిక జ్ఞానాన్ని అందిస్తూ ధార్మిక ప్రసంగీకులుగా, ధార్మిక గ్రంథాల రచయితలుగా, అనువాదకులుగా విఖ్యాతిచెందిన పలువురికి 'సొసైటీ' దుశ్శాలువ, పత్యేక జ్ఞాపికలతో ఘనంగా సత్కరించింది. ఈ సత్కారం పొందిన వారిలో మౌలానా శ్రీ షేక్ అబ్దుల్ ఖాదిర్ ఉమ్రి. మౌలానా శ్రీ సయ్యద్ అబ్దుల్ సలాం ఉమ్రి. శ్రీ షేక్ మొహమ్మద్ అజీజురైహమాన్, మౌలానా శ్రీ షేక్ హబీబుర్రెహమాన్ జమాయ్, మౌలానా శ్రీ జఫ్రుల్లా ఖాన్ నద్వి, శ్రీ షేక్ మొహమ్మద్ బిలాల్, శ్రీ షేక్ ముజిబుర్రెహమాన్, మౌలానా శ్రీ షేక్ మొహమ్మద్ సలీం జమాయ్‌లు ఉన్నారు.

చివరగా ముఖ్యఅతిథి శ్రీ మేడా వెంకట మల్లికార్జున రెడ్డిని, గౌరవ అతిథిగా హజరైన నన్ను 'సొసైటీ' వ్యవస్థాపక అధ్యక్షులు శ్రీ షేక్ ఇస్హాఖ్ అలీ ఆధ్వర్యంలో 'సొసైటీ' నాయకులు దుశ్శాలువతో సత్కరించి ప్రత్యేక జ్ఞాపికలను అందజేశారు.

## ఆనందోత్సవాల మధ్య ముగిసిన సభ

కువైట్‌లోని వివిధ ప్రాంతాల నుండి విచ్చేసిన సుమారు వెయ్యి మంది సభికులతో ఉత్సాహం-ఉద్వేగాల నడుమ దేశభక్తి ప్రపూరితమైన వాతావరణంలో 'అరవైఆరోవ భారత గణతంత్ర దినోత్సవం-కడప ఇస్లామిక్ వెల్ఫేర్ సొసైటీ 30వ వార్షికోత్సవ సంబరం' సుమారు మూడు గంటల పాటు జరిగింది. ఈ సంబరాలలో పాల్గొన్న అతిథులకుగాని, సభికులకు గాని ఎటువంటి ఇబ్బంది లేకుండా 'సొసైటీ' నాయకులు శ్రీ షేక్ అన్వర్, శ్రీ నజీర్ అహమ్మద్, శ్రీ యస్.యండి రఫి, శ్రీ యస్.మొహమ్మద్ గౌస్, శ్రీ పి.మస్తాన్ సాహెబ్, శ్రీ షేక్ షక్షావలి, శ్రీ షేక్ ఫక్రుద్దీన్, శ్రీ సయ్యద్ యజ్దాని, శ్రీ షేక్ ఇర్ఫాన్, శ్రీ షేక్ షఫి, శ్రీ షేక్ అజీజ్, శ్రీ నియాజ్ హుస్సైన్, శ్రీ షేక్ గఫార్, శ్రీ షేక్ తౌసిఫ్, శ్రీ షేక్ యజ్దాన్, శ్రీ షేక్ అమీన్, శ్రీ షేక్ షబ్బీర్ అలీ ఖాన్, శ్రీ షేక్ సలీం, షేక్ రహమతుల్లా, శ్రీ షేక్ కమాల్ శ్రీ అజీజ్ ఖాద్రి తదితరులు సభా కార్యక్రమ నిర్వహణా బాధ్యతలను సమర్థవంతంగా నిర్వహించారు. చివరకు అత్యంత ఉత్సాహభరిత వాతావరణంలో ఆరంభమై చివరకు అదే ఉత్సాహం- ఉద్వేగంతో సాగిన 'అరవైఆరవ భారత గణతంత్ర దినోత్సవం'-'కడప ఇస్లామిక్ వెల్ఫేర్ సొసైటీ 30వ వార్షికోత్సవ సంరంభం' 2015, జనవరి 30 రాత్రి పదిగంటల ప్రాంతంలో ముగిసింది.

## చరిత్ర పట్ల వెల్లడైన అంతులేని అభిమానం

సభా కార్యక్రమం ముగిశాక సభికులు నన్ను చుట్టుముట్టారు. భారత స్వాతం త్ర్యోద్యంలో ముస్లింల పాత్రకు సంబంధించి కొన్ని విశేషాలను మాత్రమే నేను




30.01.2015న రాత్రి 'రౌధా' ప్రాంతం 'జమియత్ అల్ ఇస్లాహ్ ఆడిటోరియం'లో జరిగిన సభలో ప్రముఖ రచయిత, 'నెలవంక' సంపాదకులు, మౌలానా శ్రీ సయ్యద్ అబ్దుల్ సలాం ఉమ్రిని సత్కరిస్తున్న శ్రీ మేడా వెంకట మల్లికార్జున రెడ్డి, 'సోసైటీ' ప్రధానకార్యదర్శి శ్రీ షౌకత్ అలీ ఖాన్.

వివరించినప్పటికి ఆ చారిత్రక విశేషాల పట్ల సభికులు అంతులేని ఆసక్తి చూపారు. నా విజిటింగ్ కార్డుల కోసం కొందరైతే నాతో ఫోటోలు దిగడానికి మరికొందరు ఉత్సాహం చూపారు. 'మాకు తెలియని చాలా విషయాలను తెలుసుకున్నాం' అంటూ ఆనందపడ్డారు. నేను వెల్లడించిన చారిత్రక విషయాలు, ఆ విషయాల వెల్లడికి నేను ఎంచుకున్న తెలుగు భాష, విషయాన్ని ప్రజెంట్ చేసిన తీరు సభికులను ఆకట్టుకుందని పలువురు అన్నారు. ఆ విషయాలను ప్రస్తావిస్తూ తమ ఆనందాన్ని, నా పట్ల ఎంతో అభిమానాన్ని చూపారు.

సభా కార్యక్రమం తరువాత సభికులకు 'సోసైటీ' సభాప్రాంగణంలోనే 'డిన్నర్' ఏర్పాటు చేసినందున సభా ప్రాంగణం నుండి కదలని సభికులు నన్ను ఏమాత్రం ముందుకు కదలనివ్వలేదు. సమయం గడిచి పోతుందని, డిన్నర్‌కు మనం మరోచోటకు వెళ్ళాల్సి ఉన్నందున వేగిర పడమంటూ శ్రీ ఇస్హాఖ్ అలీ నన్ను తొందర పెట్టసాగారు. అభిమాన తెలుగు సోదరులు మాత్రం ఆ మాట... ఈ మాట మాట్లాడుతూ, నా ప్రసంగం లోని అంశాలను ప్రస్తావిస్తూ, గుచ్చి గుచ్చి వివరాలు అడుగుతూ, నాతో కలసి ఫోటోలు దిగుతూ నన్ను ఏమాత్రం కదలన్విలేదు. చివరకు శ్రీ ఇస్హాఖ్ అలీ ప్రత్యక్ష జోక్యం, నా క్షమాపణలతో మాకు సభా ప్రాంగణం నుండి అతి కష్టంగా స్వేచ్ఛ దొరికింది.

## కువైట్ చరిత్రకారుని ఇంట రాత్రి విందు

మేము 'రౌధా' ప్రాంతంలోని 'జమియత్ అల్ ఇస్లాహ్ ఆడిటోరియం' నుండి బయలు దేరి 'అల్ ఫీహా' ప్రాంతానికి చేరుకున్నాం. ఆ ప్రాంతం చాలా ఖరీదైన ప్రాంతంగా అన్పించింది. కన్పించింది. ఆ పరిసరాల గురించి మిత్రులతో విచారించగా అది కువైట్







30-01-2015న రాత్రి చరిత్రకారుడు, కువైట్ మాజీ మంత్రి డాక్టర్ రాషిద్ అబ్దుల్లా అల్ ఫర్హాన్ ఇంట 'విందు' సందర్భంగా.

ప్రభుత్వంలోని ప్రముఖులు, కువైట్ నగర ప్రముఖులు, నగరంలోని సంపన్న వర్గాలు నివశించే ప్రాంతంగా చెప్పారు. రాత్రి పూట కూడా పగటి పూటలా చక్కని, చిక్కని వెలుగు పర్చుకుని అక్కడి రహదారులు, భవనాలు వెలిగిపోతున్నాయి.

'అల్ ఫీహా'లో నివాసం ఉంటున్న డాక్టర్ రాషిద్ అబ్దుల్లా అల్ ఫర్హాన్ కువైట్ ప్రభుత్వంలో వక్ఫ్ మంత్రిగా బాధ్యతలు నిర్వహించారు. ఆయన ఇండియా నుండి విచ్చేసిన 'సొసైటీ' అతిధుల గౌరవార్ధం విందు ఏర్పాటు చేశారని శ్రీ ఇస్హాఖ్ అలీ చెప్పారు. డాక్టర్ రాషిద్ గృహాన్ని బయట నుండి చూస్తే మన ప్రాంతంలో కన్పించే విలాసవంతమైన గృహంలా ఏమాత్రం కన్పించలేదు. ఆ గృహంలోపలికి వెళ్ళడానికి చాలా చిన్న చిన్న ద్వారాలు ఉన్నాయి. అటు ఇటుగా సాగుతున్న ఆ ద్వారాల గుండా అటు తిరిగి ఇటు తిరిగి ఓ పెద్ద హాలులోకి ప్రవేశించాం.

ఆ గృహాన్ని 'దివానియా అల్ ఫర్హాన్' అంటారట. గతంలో రాచరిక కుటుం బాలలో మనం గమనించినట్టుగా కువైట్‌లోని సంపన్నుల గృహాలలో కూడా 'దివానే ఖాస్' 'దివానే ఆమ్' ఏర్పాటు ఉంది. కుటుంబ సభ్యులతో, సన్నిహితులతో విందులకు, సమావేశాలకు ఒకటి 'దివానే ఖాస్' మిత్రులతో ఇతరులతో విందులకు, సమావేశాలకు 'దివానే ఆమ్' లాగా సువిశాల ప్రత్యేక సమావేశ మందిరాలు సంపన్నుల గృహాలలో ఉంటాయని తెలిసింది. ముందుగా అక్కడకు చేరుకున్న మిత్రులు మమ్మల్ని స్వాగతిస్తుండగా మేం తిన్నగా 'దివానే ఆమ్' చేరుకున్నాం. అది చాలా విశాల మైన గది. కువైట్ చరిత్ర-సంస్కృతికి సంబంధించిన వివిధ తైలవర్ణ చిత్రాలతో, ప్రత్యేకంగా ఏర్పాటు చేసిన విద్యుత్ కాంతులతో ఆ గది దేదీప్యమానంగా వెలిగిపోతుంది. మేము వెళ్ళిన కాసేపటికి



**30-01-2015న రాత్రి చరిత్రకారుడు, కువైట్ మాజీ మంత్రి డాక్టర్ రాషిద్ అబ్దుల్లా అల్ ఫర్హాన్ ఇంట 'విందు' సందర్భంగా మిత్రులతో...**

శ్రీ మేడా వెంకట మల్లికార్జున రెడ్డి ఆయన అనుచరులు 'దివానియా అల్ ఫర్హాన్' చేరుకున్నారు.

మాకు ఆతిథ్యం ఇస్తున్న డాక్టర్ రాషిద్ అబ్దుల్లా అల్ ఫర్హాన్ ఆంగ్లం-అరబిక్‌లో అందర్నీ పలకరిస్తూ. ఆత్మీయంగా అతిథులను ఆహ్వానిస్తూ సమావేశమందిరానికి చేరుకున్నారు. సమావేశ మందిరంలో అష్టపదులు దాటిన వయస్సుడైన ఆయన కువైట్ స్థానికుల వేషధారణలో ఉన్నా ఎటువంటి పటాటోపం లేకుండా చాలా సామాన్య వ్యక్తిలా కన్పించారు. కువైట్ ప్రభుత్వంలో పలు సంవత్సరాలు మంత్రి పదవి నిర్వహించిన ఆయన ప్రఖ్యాత చరిత్రకారుడు, న్యాయవాది. అంతకు మించి వితరణశీలి. సమావేశ మందిరంలో అందర్నీ పలకరిస్తూ, ఆయన కలయ తిరుగుతుండగా ఇండియా నుండి విచ్చేసిన ముఖ్య అతిథులను ఆయనకు శ్రీ ఇస్హాఖ్ అలీ పరిచయం చేశారు. మన ఆల్బమ్ 'చరితార్థులు'ను శ్రీ అలీ డాక్టర్ రాషిద్‌కు అంతకిత్రమే ఇచ్చి ఉండటం వలన, దానిని ఆయన పరిశీలించి ఉన్నందున, 'ది ఇమ్మోర్టల్స్' ఆల్బమ్ ప్రస్తావన మళ్ళీ తెస్తూ నన్ను డాక్టర్ రాషిద్ కు శ్రీ ఇస్హాఖ్ పరిచయం చేశారు.డాక్టర్ రాషిద్ 'ది ఇమ్మోర్టల్స్' ఆల్బమ్‌ను ప్రస్తావిస్తూ నన్ను అభినందించారు. ఆల్బమ్‌లోని యోధుల విశేషాలు డాక్టర్ రాషిద్‌కు వివరించాను.

అనంతరం ఆరంభమైన డాక్టర్ రాషిద్ ఏర్పాటు చేసిన ఖరీదైన విందు కార్యక్రమం రాత్రి 12 గంటలకు పూర్తయ్యింది. డాక్టర్ రాషిద్, ఇతర మిత్రుల నుండి





శెలవు తీసుకుని 'భారత గణతంత్ర దినోత్సవం, 'కడప ఇస్లామిక్ వెల్ఫేర్ సొసైటీ' 30వ వార్షికోత్సవ సంబరాల' ఏర్పాట్లు, బహిరంగ సభ తదితర కార్యక్రమాలు జరిగిన తీరు తెన్నులను సమీక్షించుకుంటూ రాత్రి పన్నెండున్నర ప్రాంతంలో శ్రీ ఇస్హాఖ్ అలీ, నేను మా బసకు చేరుకున్నాం.

## హైదరాబాద్ మిత్రుల అల్పాహార ఆతిథ్యం

జనవరి 31, 2015 ఉదయం 'సాల్మియా' ప్రాంతంలోని 'చికెన్ తిక్కా' కాంటినెంటల్ హోటల్'లో 'హైదరాబాద్ ముస్లిం వెల్ఫేర్ అసోసియేషన్' మమ్మల్ని అల్పాహార సమావేశానికి ఆహ్వానించింది. ఆ ఆహ్వానాన్ని పురస్కరించుకుని మేము హోటల్‌కు చేరుకున్నాం. అక్కడ అసోసియేషన్ బాధ్యులు శ్రీ మహమ్మద్ అబ్దుల్ కరీం ఇర్ఫాన్ మమ్మల్ని ప్రేమతో స్వాగతించారు. 'చికెన్ తిక్కా' కాంటినెంటల్ హోటల్' ఖరీదైన సెల్ఫ్ సర్వింగ్ హోటల్. అక్కడ స్వదేశీ, విదేశీ అల్పాహార పదార్థాలు ఉన్నాయి. అవికాకుండా వినియోగదారులు కోరినవి అప్పటికప్పుడు తయారు చేసి సత్వరమే అందించడానికి అవసరమైన ఆధునిక యాంత్రిక సదుపాయాల ఏర్పాట్లు ఉన్నాయి. అక్కడ 'సెల్ఫ్ సర్వింగ్' అయినప్పటికి 'చికెన్ తిక్కా' సహాయకులు కూడా అందుబాటులో ఉన్నారు. అతిథులంతా తమకు ఇష్టమెచ్చిన పదార్థాలను ఏరికోరి స్వయంగా తెచ్చుకుని ఆరగించసాగారు.

నేను మాత్రం నాకు తెలియని, కొత్త పదార్థం అన్పించిన ప్రతిదాన్ని సేకరించుకుని రుచి చూశాను. నేను ఏ కొత్త ప్రదేశం వెళ్ళినా మన ప్రాంతంలో, మన గృహాల్లో మనం ఎల్లప్పుడూ తినే పదార్థాలు కాకుండా ఆయా ప్రాంతాలలో ప్రత్యేకం అనదగిన పదార్థాలను ఎక్కువగా రుచి చూడటం అలవాటు. 'చికెన్ తిక్కా' కాంటినెంటల్ హోటల్'లో మాత్రం 'సొసైటీ' కువైట్ సంచాలకులు శ్రీ మహ్మద్ హనీఫ్ నా వెంట ఉండి అక్కడి పదార్థాలు, వాటి రుచి తదితర ప్రత్యేకతలను వివరిస్తూ ఆహార పదార్థాలకు సంబంధించిన కొంగ్రొత్త విషయాలు తెలుసుకునే అవకాశం నాకు కల్పించారు.

ఆ క్రమంలో ఇక్కడి పదార్థాలలో కొన్నిటిని జిహ్వ అంగీకరించగా మరి కొన్నిటిని పూర్తిగా తిరస్కరించింది. ఆహార పదార్థాల మీద అతిథుల దాడి పూర్తయ్యాక శ్రీ మేడా వెంకట మల్లికార్జున రెడ్డి, ఆయన సహచరులు, 'సొసైటీ' నేతలు మేము అంతా కలసి కొద్దిసేపు 'ఇష్టాగోష్టి'గా మాట్లాడుకున్నాం. శ్రీ ఇర్ఫాన్ నానుండి కొన్ని విషయాలు తెలుసు కున్నారు. అంతకు ముందు 'భారత గణతంత్ర దినోత్సవం-కడప ఇస్లామిక్ వెల్ఫేర్ సొసైటీ 30వ వార్షికోత్సవ సంబరాల' సభాప్రాంగణంలో చాలా విషయాలను ముచ్చటించి ఉన్నందున ఇష్టాగోష్టి త్వరితగతిన ముగిసింది. ఈ సందర్భంగా శ్రీ కరీం ఇర్ఫాన్



2015 జనవరి, 31 ఉదయం 'చికెన్ తిక్కా' హోటల్ సమీపాన 'భారత స్వాతంత్ర్యోద్యమం : ఆంధ్రప్రదేశ్ ముస్లింలు' గ్రంథాన్ని శ్రీ మేడాకు అందజేస్తున్న సందర్భంగా, శ్రీ ఇస్హాఖ్, శ్రీ గుల్జార్ బాషా, శ్రీ పి మస్తాన్ తదితరులు.

మాట్లాడుతూ చరిత్ర రచనకు సంబంధించినంత వరకు నాకు అవసరమగు సహాయ సహకారాలను అందించగలమని వాగ్దానం చేశారు.

## శ్రీ పీర్ షాహ్ స్థూపం ఏర్పాటుకు శ్రీ మేడా వాగ్దానం

'అరవైఆరవ భారత గణతంత్ర దినోత్సవం–'కడప ఇస్లామిక్ వెల్ఫేర్ సొసైటీ 30వ వార్షికోత్సవ సంబరాల' సందర్భంగా ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామయోధులు, కడప జిల్లా పూర్వపు సిద్దవట్టం తాలూకా, యల్లంపేటకు చెందిన శ్రీ పీర్ షాహ్ స్థూపాన్ని ఏర్పాటు చేయాల్సిందిగా నేను, షేక్ గుల్జార్ బాషా కోరినందున శ్రీ పీర్ షాహ్ వివరాలు కావాలని శ్రీ మేడా వెంకట మల్లికార్జున రెడ్డి కోరారు. ఆ కారణంగా 'చికెన్ తిక్కా' హోటల్ నుండి బయటకు వచ్చాక శ్రీ పీర్ షాహ్ వివరాలను శ్రీ మేడాకు తెలిపాను. శ్రీ పీర్ షాహ్ పూర్తి వివరాలు గల 420 పేజీల 'భారత స్వాతంత్ర్యోద్యమంఃఆంధ్రప్రదేశ్ ముస్లింలు' నా గ్రంథాన్ని శ్రీ మేడాకు అందజేశాము. శ్రీ పీర్ షాహ్ స్థూపం ఏర్పాటుకు తగిన ప్రతిపాదనలు చేయగలనని కడప జిల్లావాసులకు శ్రీ మేడా వాగ్దానం చేశారు.

'చికెన్ తిక్కా' హోటల్' లో 'హైదరాబాద్ ముస్లిం వెల్ఫేర్ అసోసియేషన్' వారి అల్పాహార ఆతిథ్యం పూర్తి చేసుకున్నాక శ్రీ ఇస్హాఖ్అలీతో కలసి మేం కువైట్ సంచారానికి బయలు దేరాం. అటుఇటు తిరుగుతుండగా భోజన సమయానికి 'లక్కీ అజీజ్'గా పిలువబడు 'సొసైటీ' యువజన విభాగం బాధ్యులు సయ్యద్ సద్రుద్దీన్ ఖాద్రి నుండి మాకు 'లంచ్'కు ఆహ్వానం అందింది. ఆయనతో కలసి హవాల్లీ ప్రాంతంలో గల ఒక హోటల్‌కు చేరుకుని అంతా కలసి లంచ్ పూర్తి చేసుకున్నాం.





ఆ సాయంత్రం మరో కార్యక్రమంలో పాల్గొనాల్సి ఉన్నందున కొద్దిసేపు మిత్రుల వద్ద విశ్రాంతి తీసుకుందామని బయలుదేరాం. మా వాహనం 'హవాల్లీ' ప్రాంతం కుండా సాగుతుండగా, శ్రీ ఇస్హాక్ అలీ గతంలోకి వెళ్ళిపోతూ 'ఇక్కడే మా కడప ఇస్లామిక్ వెల్ఫేర్ సొసైటీ స్థాపనకు ఆలోచన అంకురించింది' అన్నారు. ఆ చరిత్ర కావాలని నేను కోరగా 30 ఏండ్ల నాటి వివరాలను ఆయన ఏకరవు పెట్టసాగారు.

## 'సొసైటీ' ఏర్పాటు పూర్వ రంగం

ఆంధ్రులకు ప్రధానంగా కడప జిల్లా ప్రజలకు కువైట్‌తో చాలా కాలం నుండి సత్సంబంధాలున్నాయి. తెలుగు ప్రజలు ఇక్కడ ఎంతో కాలంగా ఇక్కడ ఉద్యోగాలు, వ్యాపారాలు చేస్తున్నారు. ఆ విధంగా ఇక్కడకు చేరుకున్న తెలుగువారికి చేతినిండా డబ్బు, నూతనంగా లభించిన స్వేచ్ఛ వలన సామాజికంగా గాని, ధార్మికంగా కాని తగినంత నియంత్రణ లేకుండా పోయింది. ఆ కారణంగా పెరుగుతున్న విచ్చలవిడితనం, ఫలితంగా ఎదురవుతున్న ఆర్థిక దురవస్థతోపాటు నైతిక పతనావస్థలను గమనించిన కొంతమందిలో ఈ దుస్థితిని సంస్కరించాలన్న ఆలోచనలు అకురించాయి. ఆనాటి అవాంఛనీయ పరిస్థితి నుండి సన్మార్గం దిశగా స్వజనులను మళ్ళించడానికి అవసరమైన సంస్కరణోద్యమం సాగించడానికి ఒక వ్యవస్థ ఏర్పాటు దిశగా ఆలోచనలు ఆచరణాత్మకంగా సాగాయి.

తెలుగు ప్రజలలో ధార్మిక చింతన పెంచడం కోసం ఇస్లాం ధార్మిక అవగాహన కలిగించేందుకు 'ఉర్దూ' భాషలో మౌఖిక ప్రచార కార్యక్రమాలను నిర్వహించేందుకు ప్రయత్నాలు ప్రారంభమయ్యాయి. ఆ దిశగా మౌఖిక ప్రచారం ఉర్దూలో చేస్తుండటం వలన ఉర్దూ భాషలో ధార్మిక విషయాలను పూర్తిగా ఆకళింపు చేసుకోడానికి భాషాపరంగా సమస్యలు ఎదురు కాసాగాయి. ఈ సమస్య వలన సందేశం తెలుగులో సుబోధకం చేయడం మంచిదన్న అభిప్రాయం ఏర్పడింది. ఆ తరువాత నిర్వాహకుల ప్రయత్నాల ఫలితంగా మౌఖిక ప్రచార కార్యక్రమాలలో 'తెలుగు'భాష క్రమంగా చోటు చేసుకుంది. ఆ పరిణామానికి అనుకూలంగా, ధార్మిక పరిజ్ఞానాన్ని మరింత ఎక్కువ మందిలోకి తీసుకెళ్ళాలన్న సంకల్పానికి 'తెలుగు ఇస్లామిక్ పబ్లికేషన్స్' లాంటి సంస్థల తెలుగులో వెలువరిస్తున్న సాహిత్యం తోడుగా నిలచింది.

## కువైట్‌లో సంస్కరణోద్యమం

ఈ మేరకు తెలుగులో ఆరంభమైన ధార్మిక ప్రసంగాలకు తొలుత అభ్యంతరాలు ఎదురైనప్పటికి తెలుగు ప్రసంగాల పట్ల తెలుగు భాషావర్గీయులు బాగా ఆకర్షితులయ్యారు. మాలియా పార్క్ వద్ద సాగుతున్న చిన్న చిన్న ప్రసంగాలకు హాజరవుతున్నవారి సంఖ్య

పెరిగేకొద్దీ, కువైట్‌లోని అనిశ్చిత వాతావరణం మూలంగా పలు ఇబ్బందులు ఎదురు సాగాయి. ఆ ఇక్కట్లను అధిగమించేందుకు స్థానిక మాలియా పోలీసు స్టేషన్ వెనుక గల 'మాలియా మస్జిద్'లో సమావేశాలకు ప్రభుత్వం నుండి అనుమతిని రాబట్టారు. అప్పటి నుండి ఎటువంటి వాతావరణం తెచ్చిపెట్టుతున్న ఇక్కట్లు ఏమాత్రం లేకుండా ప్రశాంతంగా ధర్మపరిచయం–సామాజిక సంస్కరణ లక్ష్యాలుగా ఆరంభమైన కార్యక్రమాలు ముమ్మరం కాసాగాయి. ఈ వాతావరణం పట్ల ఆకర్షితులైన స్థానిక ప్రజలు, వితరణశీలురు ఈ కార్యక్రమాల నిర్వాహకులకు పూర్తి స్థాయిలో అండగా నిలవడానికి ముందుకు వచ్చారు.

ఈ ఆలోచనా క్రమం ఆచణాత్మకం అయ్యాక శ్రీ యండి. అహమ్మద్‌కు తోడుగా శ్రీ పఠాన్ రసూల్ ఖాన్, శ్రీ సయ్యద్ జాఫర్, శ్రీ షేక్ అల్లాబక్ష్‌లు వచ్చి చేరడంతో తొలుతగా అరంభమైన తెలుగు మౌఖిక ప్రచార కార్యక్రమాలు మరింత ముమ్మరం అయ్యాయి. ఆ కార్యక్రమాలకు ప్రధానంగా 'తెలుగు ఇస్లామిక్ పబ్లికేషన్స్' ప్రచురించిన సాహిత్యం, ఆ సంస్థ ద్వారా ప్రచురితం అవుతున్న 'గీటురాయి' వారపత్రిక పంపిణి మంచి సహాకారిగా నిలిచాయి. కువైట్‌లో శెలవు దినమైన శుక్రవారం రోజున 'మాలియా పార్క్' వద్దకు వచ్చే యువకులకు ధర్మపరిచయం చేయడానికి, వారి ఆలోచనా క్రమాన్ని సంస్కరించడానికి మౌఖిక–రాత ప్రచారం తొలుత ఉర్దూతో ఆరంభించి, ఆ తరువాత క్రమంగా తెలుగులో ప్రసంగాలు ఆరంభించారు.

## ఉద్యోగార్థిగా శ్రీ ఇస్హాఖ్ కువైట్ ప్రవేశం

1980లో ఉద్యోగార్థిగా కువైట్ చేరుకున్న ఇరవై ఏండ్ల యువకుడు శ్రీ షేక్ ఇస్హాఖ్ అలీతో తెలుగులో మౌఖిక–రాతపూర్వక ధార్మిక–సంస్కరణల ప్రచార కార్యక్రమాలు మరింత వేగాన్ని అందుకున్నాయి. ప్రచార సాధనాలు, ప్రచార మాధ్యమాలు అంతగా అభివృద్ధి చెందని ఆ రోజుల్లో, ఇండియా నుండి వస్తున్న మిత్రులు, ఇండియాకు వెడుతున్న మిత్రుల ద్వారా తమ సమాచారం, వస్తువులను అటుఇటు మార్పిడి చేసుకునేవారు. కువైట్‌లో ప్రతి శుక్రవారం శెలవు దినం కనుక కువైట్ వివిధ ప్రాంతాల నుండి 'హోటల్ షెరాటన్' ఎదురుగా ఉన్న 'మాలియా పార్కు' వద్దకు తెలుగు ప్రజలు పెద్ద సంఖ్యలో చేరుకుని ఆయా మార్పిడి కార్యక్రమాలను సాగించేవారు.

ఆ సమూహాన్ని లక్ష్యంగా చేసుకుని 'మాలియా పార్కు'ను కార్యక్షేత్రం గావించుకుని శ్రీ యండి. అహమ్మద్, శ్రీ షేక్ ఇస్హాఖ్ అలీల జోడి తొలుతగా ఆటలు–







కువైట్‌లోని 'కడప ఇస్లామిక్ వెల్ఫేర్ సోసైటీ' వివిధ బాధ్యతలు నిర్వహిస్తున్న యువ నాయకత్వం శ్రీ పఠాన్ ఆయూబ్ ఖాన్ (కార్యక్రమాల సమన్వయకర్త), శ్రీ యస్ అజీజ్ ఖాద్రి (యువజన విభాగం ప్రచార బాధ్యులు), శ్రీ నిజాముద్దీన్ (ప్రచార కార్యక్రమాల బాధ్యులు), శ్రీ పఠాన్ నవాబ్ ఖాన్ (ఆర్థిక వ్యవహారాల బాధ్యులు), శ్రీ షేక్ ఇంతియాజ్ (సమాజ సేవా కార్యక్రమాల కేంద్రం బాధ్యులు).

పాటలు–నాటకాలు లాంటి వినోద కార్యక్రమాల నిర్వహణ తోపాటుగా ధార్మిక పరిజ్ఞానం కోసం ప్రసంగాలతో ప్రచారం ఆరంభించి, చిన్న చిన్న జనమూహాలతో సమావేశాలను నిర్వహిస్తూ, చివరకు తెలుగులో ధార్మిక–నైతిక ప్రబోధం గావించే సాహిత్య పంపిణితో తమ సంస్కరణోద్యమాన్ని ముమ్మరం చేశారు.

## 1984లో కువైట్‌లో 'సొసైటీ' స్థాపన

ఈ మేరకు వినూత్న పంథాలో వ్యక్తిగతంగా కార్యక్రమాలు ఆరంభించి ముందుకు సాగుతున్న శ్రీ షేక్ ఇస్హాఖ్ అలీ, శ్రీ యండి అహమ్మద్‌ల జోడికి శ్రీ షేక్ న్యామతుల్లా (రాజంపేట), శ్రీ సయ్యద్ జాఫర్ (నందలూరు), శ్రీ పఠాన్ రసూల్ ఖాన్ (ప్రొద్దుటూరు), షేక్ అల్లాహ్ బక్ష్ (రాజంపేట) యండి సలీం (రైల్వే కోడూరు) లాంటి సంఘసేవాతత్పరులు తోడయ్యారు. ఈ మిత్రులతో శ్రీ ఇస్హాఖ్ అలీ సాగించిన మేధోమధనం కారణంగా కువైట్‌లో ఒక వ్యవస్థ నిర్మాణం అవసరమని భావించారు.

ఆ భావనలకు కార్యరూపం కల్పిస్తూ తెలుగు భాషా వర్గీయులు ప్రధానంగా కడప జిల్లాకు చెందిన సుమారు వందమందితో మాలియా ప్రాంతంలో గల 'మస్జిద్ అల్ నఫీసి'లో 1984 డిసెంబర్ ఏడవ తేదిన తొలి సమావేశం జరిగింది. ఈ సందర్భంగా శ్రీ ఇస్హాఖ్ అలీ ప్రతిపాదించిన ఆలోచనలను మాత్రమే కాకుండా, ఆయన మస్తిష్కంలో మెరిసిన 'కడప ఇస్లామిక్ వెల్ఫేర్ సొసైటీ' పేరును కూడా సమావేశం స్వాగతించింది.

ఆ విధంగా మిత్రుల నుండి లభించిన సమ్మతి, ప్రోత్సాహం ఫలితంగా 1984 చివరి మాసంలో శ్రీ షేక్ ఇస్హాఖ్ అలీ వ్యవస్థాపక అధ్యక్షులుగా 'కడప ఇస్లామిక్ వెల్ఫేర్

సొసైటీ' కువైట్‌లో రూపు దిద్దుకుంది. 'ధర్మపరిచయం-సంఘసంస్కరణ-ప్రజాసేవ'లను ప్రధాన లక్ష్యాలుగా ప్రకటించుకున్న 'సోసైటీ' ఆయా రంగాలను కార్యక్షేత్రంగా చేసుకుంది. ఆ తరువాత కడప జిల్లా వాసులను మాత్రమే 'సోసైటీ'లో సభ్యత్వం కల్పించాలని, 'సోసైటీ' కార్యకలాపాలను కడప జిల్లాకు మాత్రం పరిమితం చేయాలని నిర్ణయమైంది.

'ధర్మపరిచయం-సంఘసంస్కరణ-ప్రజాసేవ' ప్రధాన లక్ష్యాలుగా నిర్మాణమైన 'సొసైటీ'కి శ్రీ ఇస్హాఖ్ అలీ కార్యదక్షత, సంఘ నిర్మాణ కౌశల్యానికి తోడుగా శ్రీ ముస్తాఫా రెడ్డి (కడప), షేక్ ఖాదర్ వలి (గుండ్లూరు), శ్రీ షేక్ మహబూబ్ బాషా (నందలూరు), శ్రీ షేక్ అబ్దుల్ హఖ్ (కడప), శ్రీ యండి సలాం (రైల్వే కొడూరు), శ్రీ హాజీ షేక్ రహమతుల్లా (కడప), శ్రీ షేక్ అబ్దుల్ సత్తార్ (ఓబిలి), శ్రీ షేక్ మహబూబ్ బాషా (తిరుపతి) లాంటి కార్యదక్షుల నుండి అండదండలు లభించడంతో 'సొసైటీ' కార్యక్రమాలు ఒక నిర్దుష్ట పద్దతి ప్రకారంగా ఆంభమయ్యాయి.

## 1985లో కడపలో 'సొసైటీ' ఆరంభం

కువైట్‌లోని 'కడప ఇస్లామిక్ వెల్ఫేర్ సొసైటీ' సత్కార్యాలకు సమర్ధవంతమైన సమిష్టి నాయకత్వం తోడుకావడంతో 'సోసైటీ'కి ప్రజల నుండి ఆర్థిక-అంగబలం మెండుగా లభించింది. బహుళంగా ప్రజా మద్దతు కూడగట్టుకున్న 'సోసైటీ' కువైట్‌లో కార్యక్రమాలను ముమ్మరం చేసింది. కువైట్‌లో కార్యక్రమాల నిర్వహణ ద్వారా గడించిన అనుభవాన్ని తమ సామర్థ్యానికి జోడించిన శ్రీ షేక్ ఇస్హాఖ్ అలీ కడప ప్రధాన కేంద్రంగా చేసుకుని కడప జిల్లాలో తమ కార్యక్రమాల నిర్వహణకు పూనుకున్నారు. ఆయన పూనికకు కువైట్‌లో ఉన్న కడప జిల్లా మిత్రుల ఆర్థిక-హార్థిక సహాయసహకారాలు అందడం, అంతకు మించి ప్రోత్సాహం లభించడంతో 1985లో కడప కేంద్రంగా 'కడప ఇస్లామిక్ వెల్ఫేర్ సొసైటీ'ని స్థాపించారు. కడప జిల్లా ప్రజల నుండి, వదాన్యుల నుండి, ప్రధానంగా కడప నుండి సంపాదన కోసం విదేశాలకు వెళ్ళిన వ్యక్తుల నుండి క్రియాశీలక సహకారం 'కడప ఇస్లామిక్ వెల్ఫేర్ సొసైటీ'కి లభించడం ఆరంభం అయ్యింది.

ప్రజల, వదాన్యుల తోడ్పాటు అందడంతో 'కడప ఇస్లామిక్ వెల్ఫేర్ సొసైటీ' పలు కార్యక్రమాలకు నిర్వహణకు నడుంకట్టింది. ఆయా కార్యక్రమాల నిర్వహణలో శ్రీ ఇస్హాక్ అలీ పూర్తి నిమగ్నమయ్యారు. ఆ కార్యక్రమాలు బాగా పెరగటంతో ఆయా కార్యక్రమాల నిర్వహణకు పూర్తి స్థాయిలో సమయం కేటాయించగల నిబద్ధత గత వ్యక్తి అవసరం ఏర్పడింది. ఆ కారణంగా శ్రీ ఇస్హాక్ అలీ 2001 లో కువైట్‌లో తాను చేస్తున్న ఉద్యోగానికి 'గుడ్‌బై' చెప్పిన 'సొసైటీ' పూర్తికాలం కార్యకర్తగా ఆయన ప్రజాసేవకు





అంకితమయ్యారు. అప్పటి నుండి ఆయన సాగిస్తున్న నిరంతర కృషికి ఆయన సహచరుల త్యాగనిరతి తోడుకావడంతో 1984 నుండి 2014 వరకు మూడు దశాబ్దాల కాలంలో 'కడప ఇస్లామిక్ వెల్ఫేర్ సొసైటీ' ప్రాంతీయ, జాతీయ, అంతర్జాతీయ స్థాయిలో తన సేవాకార్యక్రమాలను విస్తరించింది.

ప్రజలకు అన్ని రకాల సేవలందించాలన్న లక్ష్యంలో 01.ధర్మ పరిచయ కమిటీ, 02. సంస్కరణ కమిటీ, 03. విద్య-శిక్షణా కమిటీ, 04. గ్రంథాల కమిటీ, 05. స్వయం ఉపాధి కల్పనా కమిటీ, 06. వివాహ సహాయక కమిటీ, 07. వైద్య సహాయక కమిటీ, 08. ప్రచురణ విభాగం, 09. వడ్డీరహిత రుణ సహాయక కమిటీ, 10. జకాత్ కమిటీ, 11. న్యాయ సలహా కేంద్రం, 12. మసీదుల నిర్వహణ-నిర్మాణ కమిటీలను ఏర్పాటు చేసింది. ఈ కమిటీల ద్వారా గత 30 ఏండ్లుగా కడప జిల్లాలో పలు కార్యక్రమాలను నిరంతరం నిర్వహిస్తూ ప్రజల ఆశీస్సులు, అధికార అనధికార ప్రముఖుల అభినందనలు అందుకుంటున్న కువైట్ 'కడప ఇస్లామిక్ వెల్ఫేర్ సొసైటీ' అరవై ఆరవ భారత గణతంత్ర దినోత్సవం సంబరాలలో భాగంగా తన 30వ వార్షికోత్సవాన్ని కూడా కువైట్‌లో అత్యంత ఘనంగా జరుపుకుంది. ఆ తరహాలోనే 2015 చివర్లో కడపలో కూడా 'కడప ఇస్లామిక్ వెల్ఫేర్ సొసైటీ' 30వ వార్షికోత్సవాన్ని ఘనంగా జరుపుకోవాలని ఉవ్విళ్ళూరుతుందని శ్రీ ఇస్హాఖ్ అలీ వెల్లడించారు.

## కువైట్ 'సొసైటీ' రథసారధులు

1984లో ఆరంభమైన 'కడప ఇస్లామిక్ వెల్ఫేర్ సొసైటీ' (కువైట్) తొలి అధ్యక్షులుగా శ్రీ షేక్ ఇస్హాక్ అలీ వ్యవహరించగా, ఆ తరువాత షేక్ అబ్దుల్ హాఖ్ శ్రీ పఠాన్ రసూల్ ఖాన్. షేక్ ఖాదర్ వలీ, షేక్ రియాజ్, శ్రీ మహమ్మద్ హనీఫ్, శ్రీ పి. షౌకత్ అలీ అధ్యక్షులుగా కృషిచేయగా ప్రస్తుతం షేక్ న్యామతుల్లా అధ్యక్షులుగా సారధ్యం వహిస్తున్నారు.

'కడప ఇస్లామిక్ వెల్ఫేర్ సొసైటీ' కువైట్ సలహామండలిలో శ్రీ మహ్మద్ హనీఫ్ (గౌరవ సంచాలకులు), షేక్ న్యామతుల్లా (గౌరవాధ్యక్షులు), శ్రీ పఠాన్ షౌకత్ అలీ (పధాన కార్యదర్శి), శ్రీ పఠాన్ నవాబ్ ఖాన్ (ఆర్థిక వ్యవహారాలు), శ్రీ యస్ అబ్దుల్ అజీజ్ (యువజన విభాగం), శ్రీ పఠాన్ అయూబ్ ఖాన్ (కార్యక్రమాల సహ సమన్వయ కర్త), శ్రీ నిజాముద్దీన్ (ప్రచార విభాగం), షేక్ ఇంతియాజ్ (సంఘ సేవాసమితి). గౌరవ సభ్యులుగా శ్రీ షేక్ అన్వర్, శ్రీ పి. మస్తాన్ సాహెబ్, శ్రీ షేక్ మహ్మద్ గౌస్, షేక్

నజీర్ అహమ్మద్, షేక్ యండి రఫీ వ్యవహరిస్తూ తమ సమయాన్ని సంపదను 'సొసైటీ' కార్యక్రమాలకు వ్యయం చేస్తున్నారు.

## కడప 'సొసైటీ' సారధులు

1985లో కడపలో ఆరంభమైన 'కడప ఇస్లామిక్ వెల్ఫేర్ సొసైటీ'కి తొలి అధ్యక్షులుగా శ్రీ షేక్ ఇస్హాఖ్ అలీ వ్యవహరించగా 2014 నాటి 'సొసైటీ' సలహక మండలి గౌరవాధ్యక్షులుగా శ్రీ షేక్ మస్తాన్, అధ్యక్షులుగా డాక్టర్ శ్రీ మహమ్మద్ ముజిబుల్లా డాక్టర్ శ్రీ ముఖ్తార్ అహమ్మద్, కోశాధికారిగా శ్రీ షేక్ ఖాజా మోహిద్దీన్‌లు బాధ్యతలు నిర్వహిస్తున్నారు. శ్రీ సయ్యద్ అహ్మద్ బాషా (ధర్మపరిచయ కమిటీ), శ్రీ అక్బర్ అలీ రషీద్ (కార్యాలయం బాధ్యులు) కాగా కార్యనిర్వాహక సభ్యులుగా శ్రీ పాపా సాహెబ్, శ్రీ మహమ్మద్ గౌజ్, శ్రీ దౌలత్ బాషా బాధ్యతలు చేపట్టారు.

2015-2016 కాలానికి 'కడప ఇస్లామిక్ వెల్ఫేర్ సొసైటీ' సంచాలకులుగా శ్రీ షేక్ ఇస్హాఖ్ అలీ (కడప), అధ్యక్షులుగా శ్రీ మౌలానా రష్షాది (కడప), ఉపాధ్యక్షులుగా శ్రీ షేక్ మస్తాన్ (రైల్వే కోడూరు), ప్రధాన కార్యదర్శిగా 'యన్‌జీవో షబ్బీర్'గా విఖ్యాతులైన శ్రీ షేక్ ఖాజా మొహియుద్దీన్ (కడప), కోశాధికారిగా డాక్టర్ ముఖ్తార్ (కడప), కార్యవర్గ సభ్యులుగా శ్రీయుతులు షేక్ గౌస్ (బద్వేల్), సయ్యద్ హుసైన్ (పొద్దుటూరు), షేక్ దౌలత్ బాషా (రాజంపేట), షేక్ జుబైర్ (రైల్వే కోడూరు), షేక్ గౌస్ అలీ (రాయచోటి), షేక్ షామీర్ (ప్రొద్దుటూరు), మహమ్మద్ గౌస్ (రాజంపేట)లుగా వ్యవహరిస్తున్నారు.

'కడప ఇస్లామిక్ వెల్ఫేర్ సొసైటీ' అటు కువైట్‌లోగాని ఇటు కడపలో గాని ఏ కార్యక్రమం చేపట్టినా కడప-కువైట్ కమిటీలలోని 7 గురు సభ్యుల ఉన్నత సలహా మండలి సమ్మతి మీద మాత్రమే కార్యక్రమాల నిర్వహణ జరుగుతాయిని శ్రీ షేక్ ఇస్హాఖ్ అలీ అటు కడప ఇటు కువైట్ 'సొసైటీ'ల పూర్వరంగం, సొసైటీ ఏర్పాటు, విధాన నిర్ణయాల సరళి, కార్యక్రమాల నిర్వహణ తీరుతెన్నులను నాకు వివరించారు.

## ప్రవాసాంధ్ర మిత్రుల సమావేశం

కడప జిల్లా నుండి ఎన్నికైన ఏకైక తెలుగుదేశం శాసనసభ్యులు శ్రీ మేడా వెంకట మల్లికార్జున రెడ్డి కువైట్ రాక సందర్భంగా 'ప్రవాసాంధ్ర తెలుగుదేశం-కువైట్ కమిటీ' ఆయన గౌరవార్థం జనవరి 31, 2015 సాయంత్రం మాలియా ప్రాంతంలోని 'ఆంధ్రా రెస్టారెంట్'లో విందు సమావేశం ఏర్పాటు చేసింది. ఆ కార్యక్రమానికి నన్ను, శ్రీ షేక్ ఇస్హాఖ్ అలీని కూడా వక్తలుగా ఆహ్వానించింది.





ఆ సమావేశానికి వెళ్ళే ముందు మేము శ్రీ పి. మస్తాన్ సాహెబ్ గృహంలో విశ్రాంతి తీసుకునేందుకు వెళ్ళాం. రెండు గదులు మాత్రమే కలిగి ఉన్న ఆ గృహంలో 12 మంది ఉంటున్నారు. ఒక్కోక గదిలో రైల్లో బెర్తులు ఏర్పాటు చేసినట్టుగా ఒకదాని మీద మరొక పడక ఏర్పాటు ఉంది. ఈ గృహంలో కడప నుండి సంపాదన కోసం వచ్చిన 12 మంది యువకులు, నడి వయస్కులు కలిసి ఉంటున్నారు. అంతా కలసి ఉమ్మడిగా ఆహార పదార్ధాలను వంట తెలిసినవారి సహకారంతో తయారు చేసుకుంటారు. వంట, శుచి-శుభ్రత కార్యక్రమాలను వంతుల వారిగా నిర్వహించుకుంటారు. ఈ మేరకు అయిన అద్దె, ఆహారం, ఇతర ఉమ్మడి కార్యక్రమాల ఖర్చును అంతా కలసి సమమంగా పంచుకుంటారు. అంతా ఎక మనస్కులై తమ తమ బాధ్యతలను నిర్వర్తిస్తూ ఎటువంటి బేధాభిప్రాయాలకు తావు లేకుండా మసలుకుంటారని గత 30 ఏండ్లుగా కువైట్‌లో ఉద్యోగం చేస్తున్న, ప్రస్తుత అద్దె గృహం భాగస్వామి శ్రీ మస్తాన్ సాహెబ్ వివరించారు.

శ్రీ మస్తాన్ సాహెబ్ గృహంలో కొంత సేపు విశ్రాంతి తీసుకున్నాక మేం నేరుగా 'మాలియా' లోని 'ఏ.యల్ వతియ్యా కాంప్లెక్స్'లో ఆంధ్రులచే నిర్వహించబడుతున్న 'ఆంధ్ర రెస్టారెంట్'కు బలయలు దేరాము. మా వెంట శ్రీ మస్తాన్ కూడా వచ్చారు. ఒక ప్రక్కన ముఖ్యఅతిధి శ్రీ మేడా రాక కోసం ఎదురు చూస్తున్న నిర్వాహకులు ఆత్మీయంగా మమ్మల్ని ఆహ్వానించారు. కువైట్‌లోని వివిధ ప్రాంతాల నుండి విచ్చేసిన తెలుగు వారితో సభాప్రాంగణం అంతా తెలుగు వాతావరణం వెల్లివిరుస్తుంది. కడప యాసలో సాగుతున్న పలకరింపులు, మాటా-మంతితో ఆ ప్రాంతమంతా తెలుగుమయం కావడంతో నేను విదేశమైన 'కువైట్'లో ఉన్నట్టు కాకుండా 'కడప'లో ఉన్నట్టు నాకన్పించింది.

అంతలో సభాప్రాంగణానికి శ్రీ మేడా మల్లికార్జున రెడ్డి రావడంతో అంతా కోలాహలం. జిందాబాద్‌లు..జేజేలతో ఆ ప్రాంగణం అంతా మారుమ్రోగిపోయింది. ఆ సంరంభం అంతా పూర్తిగా సర్దుకున్నాక శ్రీ సుబ్బరాయుడు అధ్యక్షతన సభాకార్యక్రమం ఆరంభమైంది. 'ప్రవాసాంధ్ర తెలుగుదేశం-కువైట్ కమిటీ' అధ్యక్షులు శ్రీ కొండూరి వెంకటరావు తరదితరులు ప్రసంగాలు చేశారు.

## ముస్లింలకు పాలనాధికారంలో భాగస్వామ్యం

చివరకు నా వంతు వచ్చింది. రాష్ట్రంలో 2014 జరిగిన అసెంబ్లీ ఎన్నికలలో తెలుగు దేశం పార్టీ ఒక్క సీటు కూడా ముస్లింలకు కేటాయించక పోవడం వలన శాసనసభలో అధికార పక్షం నుండి ఒక్క ముస్లిం శాసన సభ్యుడు కూడా లేనటువంటి దురదృష్టకర పరిస్థితి ఏర్పడిందని, ఈ పరిస్థితిని అధిగమించడానికి తెలుగు దేశంలోని



31-01-2015న కువైట్‌లోని ప్రవాసాంధ్ర తెలుగు దేశం శాఖ ఆధ్వర్యంలో జరిగిన సభలో మాట్లాడుతున్న షేక్ ఇస్హాఖ్ అలీ.

ముస్లిం నేతలకు శాసనమండలిలో స్థానం కల్పించి అల్పసంఖ్యాక వర్గాల మంత్రిత్వశాఖను కేటాయిస్తే బాగుంటుందని, ఆ దిశగా కృషి చేయాల్సిందిగా శ్రీ మేడాను కోరారు. కడపలో ప్రముఖ ముస్లిం స్వాతంత్ర్య సమరయోధుల స్మారక స్థూపాల ఏర్పాటుకు ఎదురవుతున్న ఇక్కట్లను ఏకరువు పెడుతూ ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామయోధులు శ్రీ షేక్ పీర్ షాహ్ స్మారకంగా స్థూపం ఏర్పాటు విషయాన్ని మరోమారు శ్రీ మేడా దృష్టికి తెచ్చాను.

అనంతరం శ్రీ షేక్ ఇస్హాఖ్ అలీ మాట్లాడుతూ అన్ని సాంఘీక జనసముదాయాల మధ్యన సామరస్య వాతావరణం ఏర్పాటుకు ఒకరినొకరు సద్భావనతో అర్థం చేసుకోవాలని సూచించారు. మనదేశంలోని సాంఘిక జనసముదాయాలన్నీ ఐక్యంగా మెలిగినప్పుడు మాత్రమే మన మాతృభూమి ప్రగతి పథాన మరింత వేగంగా దూసుకపోగలదన్నారు. ఈ సందర్భంగా 'కడప ఇస్లామిక్ వెల్ఫేర్ సొసైటీ' మతాలకు అతీతంగా అవసరార్దులను ఆదుకుంటున్న వైనాన్ని ఆయన వివరించారు. చివర్న శ్రీ మేడా వెంకట మల్లికార్జున రెడ్డి మాట్లాడుతూ, ముస్లిం మైనారిటీ సోదరుల మద్దతు వలన తాను శాసనసభ్యునిగా ఎన్నికయ్యానన్నారు. శాసనసభ్యునిగా తన పరిధిలోనున్న ముస్లిం మైనార్టీల సమస్యలను తాను పరిష్కరించగలనని, వారి విజ్ఞప్తులను ప్రభుత్వాధినేత శ్రీ నారా చంద్రబాబు నాయుడు దృష్టికి తీసుకవెళ్ళి సానుకూల పరిష్కారానికి కృషి చేయగలనని వాగ్దానం చేశారు.

ఆతరువాత శ్రీ మేడా వెంకట మల్లికార్జున రెడ్డి తోపాటుగా, శ్రీ ఇస్హాఖ్ అలీ, నన్ను ప్రత్యేకంగా గౌరవిస్తూ జ్ఞాపికతో నిర్వాహకులు సత్కరించారు. ఈ సందర్భంగా







31-01-2015న కువైట్ లోని ప్రవాసాంధ్ర తెలుగు దేశం శాఖ ఆధ్వర్యంలో జరిగిన సభలో శ్రీ మేడా సమక్షంలో నాకు జ్ఞాపికను అందిస్తున్న 'దేశం' నాయకులు.

'కువైట్ఎన్నార్ఐడాట్‌కామ్' ప్రధాన సంపాదకులు శ్రీ సిహెచ్ రాజశేఖర్ ఒక సీనియర్ జర్నలిస్టుగా నన్ను ప్రత్యేక జ్ఞాపికతో సన్మానించారు. ఈ కార్యక్రమంలో శ్రీ షేక్ గుల్జార్ బాషా, శ్రీ అతికారి వెంకటప్పయ్య, 'సొసైటీ' నాయకులు శ్రీ పఠాన్ షౌకత్ అలీ ఖాన్, శ్రీ షేక్ న్యామతుల్లా తదితరులను నిర్వాహకులు జ్ఞాపికలతో గౌరవించారు. ఈ కార్యక్రమంలో 'సొసైటీ' నాయకులు శ్రీ మహమ్మద్ గౌస్, శ్రీ నిజాముద్దీన్, శ్రీ అజీజ్ ఖాద్రి, శ్రీ షబ్బీర్ తదితరులు పాల్గొన్నారు. ఈ కార్యక్రమం తరువాత డిన్నర్ పూర్తి చేసుకుని రాత్రి 11.30 ప్రాంతంలో మా బసకు చేరుకున్నాం.

## భారత రాయబారితో భేటి

01 ఫిబ్రవరి, 2015 ఉదయం నేనూ, శ్రీ ఇస్హాక్ అలీ కాస్త ఆలశ్యంగా నిద్ర లేచాం. స్వదేశానికి ఫోన్‌లు చేసుకుని కుశలప్రశ్నలతో ఇక్కడి విశేషాలు అక్కడి వారికి వివరించాం. ఆ తరువాత త్వరితగతిన తయారయ్యి, మా బస క్రింద ఉన్న కేరళ రాష్ట్రం వారి హోటల్‌లో అల్పాహారం పూర్తి చేసుకున్నాం. 'షాబ్.' ప్రాంతంలో ఉన్న భారత రాయబారి కార్యాలయం వెళ్లాం. మేము, మాతోపాటుగా 'సొసైటీ' బాధ్యులు, శ్రీ మేడా వెంకట మల్లికార్జునరెడ్డి, ఆయన అనుచరులు, కువైట్‌లో ఉంటున్న శ్రీ సుబ్బారాయుడు తదితరులంతా వచ్చాక అంతా కలసి రాయబారి కార్యాలయంలోకి వెళ్ళాం.

భారత రాయబారి కార్యాలయాన్ని ముందుగా చేరుకున్న మేము, మా రాక గురించి కార్యాలయంలోని అధికారికి తెలిపాం. అక్కడి సిబ్బంది మమ్మల్ని సాదరంగా ఆహ్వానిస్తూ కార్యాలయంలో ఉన్న గ్రంథాలయంలో మమ్మల్ని కూర్చొబెట్టారు. ఆ సందర్భంగా నేను అక్కడి గ్రంథాలను పరిశీలించాను. ఆ గ్రంథాలయంలో ఆంగ్ల గ్రంథాలు



**31-01-2015న కువైట్‌లోని ప్రవాసాంధ్ర తెలుగు దేశం శాఖ ఆధ్వర్యంలో జరిగిన సభలో 'కువైట్‌ఎన్నార్ఐడాట్‌కామ్' ప్రధాన సంపాదకులు శ్రీ రాజశేఖర్ నశీర్‌కు జ్ఞాపిక అందిస్తున్న దృశ్యం.**

అధికంగా ఉన్నప్పటికి తమిళం, మలయాళం, బెంగాలి భాషల్లో పలు గ్రంథాలు ఉండటం గమనించాను. కువైట్‌లోని భారతీయులలో అత్యధికులు అనగా 20% పైగా తెలుగువారు ఉన్నప్పటికి రాయబారి గ్రంథాలయంలో తెలుగు గ్రంథం కన్పించకపోవడం బాధించింది.

ఆ విషయాన్ని గ్రంథాలయాధికారిణి వద్ద ప్రస్తావించగా తమ వద్ద తెలుగు గ్రంథాలు లేవన్నారు. 'భారత స్వాతంత్ర్యోద్యమంలో ముస్లింల పాత్ర'ను వివరిస్తూ నేను రాసిన పలు గ్రంథాలు ఉన్నాయని ఆమెకు తెలిపాను. ఆమె తన సంతోషాన్ని వ్యక్తంచేస్తూ తెలుగు గ్రంథాలు ఉన్నట్టయితే తమకు ఇవ్వాల్సింగా ఆమె కోరారు. మా వద్ద అప్పుడున్న తెలుగు గ్రంథాలను గ్రంథాలయానికి ఇస్తామనగా, ఆ గ్రంథాలను భారత రాయబారికి అందజేయాల్సిందిగా గ్రంథాలయాధికారిణి సూచించారు.

ఆ తరువాత కొద్దిసేపటికి భారత రాయబారి శ్రీ సునీల్ జైన్ మమ్మల్ని సమావేశం మందిరంలోనికి ఆహ్వానించారు. ఆయన మాతోపాటుగా ప్రత్యేక హాలులో గల రౌండ్ టేబుల్ వద్ద ఇరువురు అధికారులతో పాటు కలసి కూర్చున్నారు. శ్రీ జైన్ మాట్లాడుతూ కువైట్‌లో ఉన్న తెలుగు ప్రజల వివరాలు వెల్లడించారు. ఈ సందర్భంగా శ్రీ మేడా వెంకట మల్లికార్జున రెడ్డి, నాయకత్వంలో శ్రీ యం. సుబ్బరాయుడు, శ్రీ మహ్మద్ హనీఫ్, శ్రీ పఠాన్ షౌకత్ అలీ ఖాన్, శ్రీ షేక్ న్యామతుల్లా తదితరులు కువైట్ వస్తున్న ఉద్యోగార్థులలో ముఖ్యంగా మహిళలు, స్థానికంగా ఉద్యోగాలు చేస్తున్న వ్యక్తులు ఎదుర్కొంటున్న ఇక్కట్లను వివరించారు. ఆయా సమస్యల పరిష్కారం కోసం ఆచరణాత్మక







01-02-2015 కువైట్‌లోని భారత రాయబారి శ్రీ సునీల్ జైయిన్‌కు శాసనసభ్యులు శ్రీ మేడా సమక్షంలో గ్రంథాల అందజేత.

మార్గాలను సూచిస్తూ రాయబారికి వినతిపత్రాన్ని అందజేశారు. చివరకు శ్రీ సునీల్ జైన్ స్పందిస్తూ, సమస్యల పరిష్కారానికి తగు చర్యలు తీసుకోగలమన్నారు.

## రాయబారి గ్రంథాలయానికి 'చరితార్థులు' బహూకరణ

భారత రాయబారి శ్రీ సునీల్ జైయిన్‌తో మా బృందం చర్చలు ముగిశాక, 'భారత స్వాతంత్ర్యోద్యమంలో ముస్లింల పాత్ర'ను వివరిస్తూ నేను రాసిన గ్రంథాల పూర్తి సెట్టును ఆయనకు అందజేశాం. అనంతరం 'చరితార్థులు' ఆల్బమ్ వివరాలను, విశేషాలను నేను విశదీకరించాను. ఆ తరువాత 'చరితార్థులు' ఆల్బమ్‌ను ఆయన ద్వారా కువైట్‌లోని భారతీయ రాయబారికార్యాలయం గ్రంథాలయానికి అందిస్తున్నట్టు ప్రకటించి 'చరితార్థులు' గ్రంథాన్ని శ్రీ మేడా వెంకట మల్లికార్జున రెడ్డి ద్వారా రాయబారి శ్రీ సునీల్ జైయిన్‌కు అందజేశాం. శ్రీ జైయిన్ ఎంతో సంతోషం వ్యక్తం చేస్తూ ఆల్బమ్ వివరాలను అడిగి తెలుసుకున్నారు. ఈ కార్యక్రమంలో శ్రీ ఇస్హాక్ అలీ, శ్రీ షేక్ న్యామతుల్లా, శ్రీ గండికోట గుల్జార్ బాషా, శ్రీ అతికారి వెంకటప్పయ్య తదితరులు ఉన్నారు.

ఈ కార్యక్రమం తరువాత భోజనం ముగించి, 'ఖైతాన్' ప్రాంతంలో ఉంటున్న శ్రీ పి. మస్తాన్ సాహెబ్ గృహంలో సేదతీరడానికి మరోమారు వెళ్ళాము. ఆయన మమ్మల్ని ఎంతో ప్రేమగా ఆహ్వానించారు. అక్కడ కొంతసేపు విశ్రాంతి తీసుకున్నాం. ఆ రోజు సాయంత్రం ఇండియా వెడుతున్న శ్రీ మేడా మల్లికార్జునరెడ్డికి వీడ్కోలు పలికేందుకు కువైట్ అంతర్జాతీయ విమానాశ్రయం వెళ్ళాం. అక్కడ నుండి రాత్రి ఎనిమిదిన్నర గంటల ప్రాంతంలో మరో కార్యక్రమంలో పాల్గొనేందుకు హడాహుడిగా బయలుదేరాం.




01-02-2015 కువైట్‌లోని భారత రాయభారి శ్రీ సునీల్ జైయిన్‌కు 'చరితార్థులు' ఆల్బమ్‌ను బహూకరిస్తున్న నశీర్ అహమ్మద్

## భారతీయ మిత్రులతో సమావేశం

భారతదేశం నుండి దశాబ్దాల క్రితం కువైట్ వచ్చి ఇక్కడే స్థిరపడి వ్యాపారాలు చేస్తూ, తనదైన వ్యాపార సామ్రాజ్యాన్ని ఏర్పాటుచేసుకున్న హైదరాబాద్‌కు చెందిన శ్రీ మొహ్మద్ హోష్‌దార్ ఖాన్ ఆహ్వానం మేరకు 'మిర్గాబ్' ప్రాంతంలో గల ఆయన కార్యాలయం చేరుకున్నాం. భారతదేశం నుండి గాని ఇతర దేశాల నుండి గాని ప్రముఖ వ్యక్తి లేక వ్యక్తులు ఎవరైనా కువైట్ వచ్చిన వారిని వారం వారం శ్రీ ఖాన్ తన కార్యాలయంలో 'డిన్నర్ సమావేశం' ఏర్పాటు చేస్తుంటారని తెలిసింది. ఈ మేరకు ప్రముఖులను, అతిధులను ఆహ్వానించి, ఆయా ప్రముఖుల, అతిధుల ప్రసంగాలు ఏర్పాటు చేయడం అయన ఆనవాయితిగా నిర్వహిస్తున్నారని, ఈ విధంగా ప్రతి వారం ఇక్కడ కార్యక్రమాలు జరుగుతుంటాయని శ్రీ ఇస్హాఖ్ అలీ నాకు తెలిపారు.

ఈ విషయాన్ని జనవరి 30న జరిగిన సభలో నా ప్రసంగం విన్న తరువాత శ్రీ హోష్‌దార్ ఖాన్ నాతో మాట్లాడుతూ తమ ఆదివారం నాటి సమావేశానికి తప్పకుండా రావాల్సిందిగా ముందస్తుగా నన్ను ఆహ్వానించారు. ఈ విషయాన్ని ఆయన శ్రీ ఇస్హాఖ్ అలీతో మరోమారు చెప్పి నన్ను తొడ్కోని రావాల్సిందిగా కోరారు. ఆ కార్యక్రమాన్ని గుర్తు చేసుకుని శ్రీ ఖాన్ ఏర్పాటు చేసిన 'డిన్నర్ సమావేశం'లో పాల్గొనడానికి మేము విచ్చేశాం. మేము కాస్త ఆలశ్యంగా సమావేశస్థలి చేరుకునే సరికి కార్యక్రమం ఆరంభమైంది. ఈ కార్యక్రమానికి ప్రముఖ ధార్మిక విద్వాంసులు, ప్రముఖ ఆరబిక్ రచయిత మౌలానా సలావుద్దీన్ మఖ్బూల్ అధ్యక్షత వహించారు.







01-02-2015 రాత్రి శ్రీ మొహ్మద్ హోష్‌దార్ ఖాన్ 'డిన్నర్ సమావేశం'లో ప్రముఖ ఉర్దూ-ఆరబిక్ రచయిత మౌలానా సలావుద్దీన్ మఖ్బూల్ అధ్యక్షతన నా ఉర్దూ ప్రసంగం.

## ఉర్దూలో ప్రసంగం

నా కంటె ముందు ఒకరు మాట్లాడాక సమావేశం కన్వీనర్ శ్రీ ఖాలిద్ అజ్మీ నన్ను సభికులకు పరిచయం చేశారు. అధ్యక్షుని అనుమతితో ఆంగ్లంలో ప్రసంగం ఆరంభిస్తూ ఏ భాషలో మాట్లాడమంటారని అడిగాను. భారత దేశంలోని పలు రాష్ట్రాల నుండి వచ్చిన వ్యక్తులు సమావేశం మందిరంలో ఉన్నందున ఉర్దూలో మాట్లాడమన్నారు. నాకు 'లక్నవీ ఉర్దూ'గాని 'దక్కనీ ఉర్దూ'గాని రాదని నా ప్రాంతంలో మాట్లాడే సాధారణ గ్రామీణ 'ఉర్దూ'లో మాత్రం నేను మాట్లాడగలనని చెప్పాను. సభికులతోపాటుగా అధ్యక్షులు కూడా అంగీకరించడంతో నాకొచ్చిన 'ఉర్దూ'లో హిందీ, ఆంగ్ల పదాల సహకారంతో సుమారు 30 నిమిషాలు మాట్లాడాను. నా ప్రసంగాంశాలను ఎంతో ఆసక్తిగా విన్న సభికులు ఆనవాయితికి భిన్నంగా మరిన్ని విషయాలను వెల్లడించమని, మరింతసేపు మాట్లాడమని విజ్ఞప్తి మేరకు నేను మరో 20 నిమిషాల పాటు మాట్లాడాను.

ఈ సందర్భంగా నా గ్రంథాల రచన లక్ష్యం, భారత దేశంలోని హిందూ-ముస్లిం జన సముదాయాల మధ్యన సద్భావన, సదవగాహన, సహిష్ణుత, సామరస్య వాతావరణం మరింతగా పటిష్ట పర్చడానికి ఈ చారిత్రక సమాచారం ఏవిధంగా దోహదపడుతుందో విశ్లేషించాను. శాంతి-ప్రశాంతత లేని చోట ప్రగతి ఏలా సాధ్యం కాదో వివరిస్తూ, మన మాతృభూమి ప్రగతికి దేశంలోని ప్రధాన సాంఘిక జనసముదాయాల మధ్య స్నేహపూరిత సంబంధాలు, సోదరభావం మరింతగా గట్టి పడాల్సిన అవసరం ఎంతగా ఉందో సోదాహరణంగా విశదీకరించాను.




**01-02-2015 రాత్రి శ్రీ మొహ్మద్ హోష్‌దార్ ఖాన్ 'డిన్నర్ సమావేశం'లో నశీర్ ప్రసంగమయ్యాక శ్రీ ఖాన్‌కు 'చరితార్థులు' ఆల్బమ్ బహూకరణ.**

ఆ లక్ష్యం దిశగా నేను రాస్తున్న గ్రంథాల పరంపరలో భాగంగా తెచ్చిన వినూత్న ఆల్బమ్ 'చరితార్థులు/ఇమ్మోర్టల్స్' గ్రంథం గురించి ప్రత్యేకంగా వివరించాను. ఆంగ్లం- తెలుగు భాషలో 155 మంది ముస్లిం స్వాతంత్ర్య సమర యోధుల వివరాలతోపాటుగా అపురూప చిత్రపటాలతో రూపుదిద్దుకున్న ఆల్బమ్ రూపకల్పనకు సాగిన కృషిని ఏకరువు పెట్టాను. నా మాటలను సావధానంగా విన్న సభికులు కొందరు, ఆ తరువాత పలు ప్రశ్నలు సంధించగా తగిన సమాచారం అందించాను. ఈ మేరకు 'ఉర్దూ'లో మొదటిసారిగా పూర్తి స్థాయిలో సాగిన నా ప్రసంగం 'ఉర్దూ' భాషాప్రవీణులకు ఆమోదయోగ్యం కావడం నాకు, నాతోపాటుగా షేక్ ఇస్హాఖ్ అలీ, నాకు ఆతిధ్యం కల్పించిన శ్రీ మొహ్మద్ హోష్‌దార్ ఖాన్‌ల తదితరులకు ఎంతో ఆనందం కల్గించింది. ఆ తరువాత శ్రీ ఖాన్‌కు భారతీయుల పక్షాన 'చరితార్థులు' ఆల్బమ్‌ను బహూకరించాము.

## ఆల్బమ్‌ను ఉర్దూ/హిందీలో ప్రచురణకు వాగ్దానం

చివరకు సమావేశం కన్వీనర్ శ్రీ ఖాలిద్ అజ్మీ మాట్లాడుతూ 'చరితార్థులు' ఆల్బమ్‌ను ఉర్దూ / హిందీ భాషలో తర్జుమా చేసి ఇచ్చినట్టయితే తాము ప్రచురించడానికి సిద్ధమని ప్రకటించగా, శ్రీ ఇస్హాఖ్ అలీ మాట్లాడుతూ 'చరితార్థులు' ఆల్బమ్‌లోని సమాచారాన్ని తాము ఉర్దూ-హింది భాషల్లో తర్జుమా చేయించి ఇవ్వగలమన్నారు.

ఈ సమావేశంలో పాల్గొన్న పలువురు మిత్రులు నా ప్రసంగం అర్థవంతంగా ఉండటమే కాకుండా సమాచారయుక్తంగా ఉందన్నారు. ఈ సందర్భంగా తాము చాల





నూతన చారిత్రక విషయాలను తెలుసుకున్నామన్నారు. భారత దేశంలోని ఇతర రాష్ట్రాలలో హిందూ-ముస్లిం జనావళి మధ్యన సఖ్యత, సోదరభావాన్ని మరింతగా పటిష్టం చేయగల నా ప్రసంగాల అవసరం చాలా ఉందని అభిప్రాయపడ్డారు. నా గ్రంథాలను ఆయా రాష్ట్రాల ప్రాంతీయ భాషలతోపాటుగా, ప్రధానంగా ఉర్దూ, హిందీ భాషల్లో ప్రచురిస్తే మంచి ప్రయోజనం ఉంటుందన్న అభిప్రాయాన్ని వ్యక్తంచేశారు.

సమావేశం తరువాత కూడా మిత్రులెవ్వరూ తక్షణమే సమావేశస్థలి వదలి వెళ్ళకుండా నాతో బాతాఖానికి దిగారు. ఆ క్రమంలో మరింత సేపు ముచ్చట్లు సాగాయి. అనంతరం రాత్రి 11.30 ప్రాంతంలో అందరి వద్ద శెలవు తీసుకుని బసకు చేరుకున్నాం.

## కువైట్ నగర సంచారం

ఫిబ్రవరి 02, 2015 ఉదయాన్నే లేచి ఆరోజు కార్యక్రమాల గురించి నేను, శ్రీ ఇస్హాఖ్ అలీ ఇరువురం మాట్లాడుకున్నాం. ముందుగా నిర్ణయించిన కార్యక్రమాలు ఏవీ లేకపోవడంతో 'కువైట్'లోని ముఖ్యమైన సందర్శన స్థలాలకు వెళ్ళాలనుకున్నాం. అల్పాహారం కావించి బయలుదేరాం. మా కారు కువైట్ నగరం రోడ్ల మీద సాగిపోతూ ఉండగా నేను కువైట్ చరిత్ర గురించి శ్రీ అలీతో ప్రస్తావించాను. కువైట్ నగరంతో మూడున్నర దశాబ్దాల అనుబంధం గల ఆయన అలనాటి విశేషాలతో సహా ఇలనాటి విషయాలను గణాంకాలతో సహా వివరించసాగారు. ఆ విషయాల్లో కువైట్ గడ్డకు ఆంధ్రప్రదేశ్ బిడ్డలకు ఉన్న సంబంధాల చరిత్ర వెల్లడి కాసాంది. శ్రీ ఇస్హాఖ్ అందించిన చరిత్రకు, ఇతర మిత్రులు సరఫరా చేసిన విశేషాలు, వివరాలను అంతర్జాలం ద్వారా, పలు ఆంగ్ల గ్రంథాల నుంచి నేను సేకరించుకున్న మరింత సమాచారాన్ని జోడించి 'కువైట్ దేశం చరిత్ర' ను ఇక్కడ క్లుప్తంగా ప్రస్తావిస్తున్నాను.

## కువైట్ రాజ్య చరిత్ర

పదహారువందల పదమూడులో కువైట్ మత్స్యకారుల పల్లె. సుమారు శతాబ్దం తరువాత 1716లో బని ఉత్బూస్ (Bani Utubs) తెగ ప్రజలు ఇక్కడకు వచ్చి స్థిరనివాసం ఏర్పాటు చేసుకున్నారు. ఈ మత్స్యకారుల పల్లె తిన్నగా రూపాంతరం చెందుతూ 18వ శతాబ్దం నాటికి ఇండియా, మస్కట్, బాగ్దాద్, అరేబియా దేశాలలో వ్యాపార సంబంధాలు పెంచుకుని మంచి వ్యాపార కూడలిగా. నౌకా నిర్మాణ కేంద్రంగా అభివృద్ధి చెందింది. ఆ తరువాత అంతర్జాతీయ రంగంలో వచ్చిన మార్పులు, ప్రపంచ యుద్ధాల ఫలితంగా పలు విధి-నిషేధాలకు గురయ్యింది. ఇరవై శతాబ్దంలో ప్రతికూల పరిస్థితులు ఏర్పడటంతో 21 శతాబ్దం ఆరంభం నాటికి కువైట్ రాజ్యం అలనాటి వైభవాన్ని పూర్తిగా కోల్పోయింది.




పదహారవ శతాబ్దంలో కువైట్‌కు ప్రప్రథమ అమీర్ (పాలకుడు) షేక్ సభా అల్ జాబెర్ అల్ సభాహ్ (HH Sheikh Sabha Al-Jaber Al Sabah) కాగా ప్రస్తుత 15వ పాలకుడిగా షేక్ సభాహ్ అల్ అహ్మద్ అల్ జబెర్ అల్ సభాహ్ (HH Sheikh Sabah Al-Ahmed Al-Jaber Al Sabha) ఎంపికయ్యారు. ఈ అమీర్‌లను 'సభాహ్ కుటుంబ మండలి' (Sabah Family Council) ఎంపిక చేస్తుంది. సభాహ్ కుటుంబ మండలి చేసిన ఎంపికకు కువైట్ జాతీయ మండలి (Kuwait National Council) ఆమోదం అవసరం. ఈ క్రమంలో ప్రస్తుత పాలకులు HH Sheikh Sabab Al-Ahamed Al-Jaber Al Sabah 2006 జనవరిలో అమీర్ గా ఎంపిక కాగా HH Sheikh Nawaf Al-Ahmed Al -Jaber Al Sabah రాజకుమారుడిగా బాధ్యతలు నిర్వహిస్తున్నారు.

1930 ప్రాంతంలో కువైట్‌లో అపార పెట్రోలు నిక్షేపాలు బల్పడటంతో కువైట్ దశ-దిశ ఒక్కసారిగా మారిపోయింది. సంపద-స్వేచ్ఛా కలిగిన ప్రాంతంగా కువైట్ ఖ్యాతి గడించడంతో ఆర్థిక-సాంఘిక-సాంస్కృతిక-వైజ్ఞానిక-శ్రామిక రంగాలలోని ప్రతిభ ఇక్కడ పోగుపడడం ఆరంభించింది. అప్పటివరకు బ్రిటిష్ రక్షిత ప్రాంతంగా, ఆంగ్లేయుల అధిపత్యం క్రింద నలిగిన కువైట్ 1961లో పూర్తిగా స్వాతంత్ర్యం పొంది స్వేఛ్ఛా వాయువులు పీల్చుకోవడం ఆరంభించింది. 1961 నుండి అప్పటి వరకు కరెన్సీగా చలామణిలో ఉన్న మన 'రూపాయి' స్థానంలో 'కువైట్ దినార్' చోటు చేసుకుంది.

అరేబియన్ గల్ఫ్ ప్రాంతంలో కువైట్ రాజ్యం ప్రధాన ప్రెటోల్ ఉత్పిత్తిదారునిగా పరిణమించింది. కువైట్ అమీర్, అయన తోపాటుగా ఏర్పాటు చేసిన జాతీయ మండలి






HH Sheikh Sabab Al-Ahamed Al -Jaber Al Sabah The Amir - State of Kuwait

Emblem State of Kuwait

HH Sheikh Nawaf Al-Ahmed Al -Jaber Al Sabah The Crown Prince - State of Kuwait

కల్పించిన స్వేచ్ఛ-స్వాంత్ర్యాల ఫలితంగా అన్నిరంగాలలో గణనీయమైన ప్రగతి కన్పించింది. 1958లో మొట్టమొదటి సారిగా 'అల్ అరబి' పత్రిక ఆరంభమైంది. నాటక రంగం ప్రధాన వినోద ప్రధానమైన రంగంగా వృద్ధి చెందింది.

ఈ మేరకు కువైట్ రాజ్యంలో ముమ్మరంగా ఆరంభమైన అభివృద్ధి-నిర్మాణ కార్యక్రమాల ద్వారా లాభించేందుకు, ఉపాధి పొందేందుకు పలు దేశాల నుండి ఉద్యోగార్థులు ఇక్కడి తరలి రాసాగారు. స్థానికంగా స్వదేశీయుల మీద గాని విదేశీయుల మీద గాని అభ్యంతరకర ఆంక్షలు, విధినిషేధాలు లేకపోవడంతో భారతదేశం నుండి పెద్ద సంఖ్యలో ప్రజలు కువైట్‌కు విచ్చేశారు. ఆ తరువాత కువైట్ రాజ్యంలో సాగుతున్న నిర్మాణ పనులలో భాగస్వాములయ్యారు. ఆనాడు కువైట్‌లో సాగిన పలు నిర్మాణాలకు భారత దేశం నుండి తరలించిన నిర్మాణ సామగ్రి ఆనవాళ్ళు. ఆనాటి భారతీయుల ప్రతిభ ఆయా నిర్మాణాలలో ఈనాటికి కన్పిస్తుంది.

1980 నుండి కువైట్‌కు ఆర్థిక సంక్షోభాలు ఎదురుకాసాగాయి. జాతీయంగా, అంతర్జాతీయంగా జరిగిన పలు సంఘటలను ఈ సంక్షోభాన్ని మరింత తీవ్రతరం చేశాయి. 1990లో ఇరాక్ సాగించిన గల్ఫ్ యుద్ధం కువైట్‌ను పూర్తిగా కష్టాల కడలికిలోకి నెట్టి వేసింది. ఇరాక్ సైన్యం కువైట్ విడిచిపెట్టి పోతూ పెద్ద సంఖ్యలో ప్రెటోలు బావులను ధ్వంసంచేసి, బావులను పూర్తిగా తగుల బెట్టింది, పూర్తి స్థాయిలో విధ్వంసాన్ని సృష్టించింది.

ఆ ఇరాక్ దాడి నుండి ఆమెరికా జోక్యంలో 1991 ఫిబ్రవరి 26న పూర్తిగా బయట పడిన కువైట్ ఆ రోజును 'విమోచన దినం'గా ప్రకటించుకుంది. ఆ తరువాత

అధికార పగ్గాలు చేపట్టిన పలువురు 'అమీర్'లు కువైట్‌ను సంక్షోభం నుండి బయట పడేసేందుకు కృషి చేశారు. ఆ కృషి ఫలితంగా, ప్రజల శ్రమ కారణంగా, కలసి వచ్చిన ప్రకృతి సంపద ఆలంబనగా చేసుకుని ఈనాడు ప్రపంచంలోని అత్యధిక సంపన్న రాజ్యాలలో కువైట్ ఒకటిగానూ, పౌరుల తలసరి ఆదాయం విషయంలో ప్రపంచంలోనే ఖతార్ రాజ్యం తరువాత ద్వితీయ స్థానంలో నిలుస్తుంది.

## కువైట్‌లో అత్యధికులు కడప జిల్లావాసులు

2014 నాటి అనధికారికి లెక్కల ప్రకారంగా కువైట్‌లో మొత్తం 41 లక్షల మంది ప్రజలు నివశిస్తుండగా వీరిలో 12 లక్షల మంది మాత్రమే కువైట్ స్థానికులు. మిగిలిన 28 లక్షల మందిలో భారతీయులు, పాకిస్థాన్, బంగ్లాదేశ్, మలేషియా, ఫిలిపైన్స్, సిరియా, ఈజిప్టు తదితర దేశాల ప్రజలు ఇక్కడ ఉద్యోగాలు, వ్యాపారాలు చేస్తుంటారు. ఈ మొత్తం జనాభాలో భారతీయులు సుమారు తొమ్మిదన్నర లక్షల మంది ఉండవచ్చు.

ఈ సంఖ్యలో రెండు తెలుగు రాష్ట్రాల ప్రజల సంఖ్య లక్షా 60 వేలు ఉండొచ్చని తెలుస్తుండగా, వీరిలో ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం కడప జిల్లావాసులు 70 వేలకు పైగా ఉన్నారంటున్నారు. కువైట్ నగరంలో ఏప్రాంతానికి వెళ్ళినా అక్కడ తెలుగు విన్పించడం, తెలుగుదనం కన్పించడం నా అనుభవం. పునావృతమయ్యే ప్రజావసరాలకు సంబంధించిన వ్యాపారాలలో తెలుగు ప్రజలు ఎక్కువగా ఉన్నారు. కువైట్ నగరంలోని 'హవల్లి' ప్రాంతంలో గల ఒక అతి పెద్ద వ్యాపార కూడలిలో అంతా తెలుగువాళ్ళే కన్పించారు. ప్రధానంగా కడప జిల్లావాసులే అక్కడ వ్యాపారస్థులు మాత్రమే కాకుండా, కుటుంబాలకు కుంటుంబాలు వివిధ పనులు నిర్వర్తిస్తూ కువైట్ నగరంలో చాలా చోట్ల దర్శనమిచ్చారు.

## ఆంక్షలు అత్యల్పం

కువైట్ రాజ్యంలో ప్రజల మీద ప్రత్యేక ఆంక్షలు అత్యల్పం. ఆ కారణంగా పరాయి దేశంలో ఉన్నామన్న భావన ఏమాత్రం లేకుండా ఇక్కడ ఇతర దేశస్థులు పూర్తి స్వేచ్ఛగా ఉంటున్నారు. మతపరమైన ఆంక్షలు ఏవీ కూడా ఇక్కడలేవు. మత సంబంధమైన ఆచరణ స్వచ్ఛందం. అన్ని ప్రధాన మతాలకు సంబంధించిన ప్రజలు ఇక్కడ ఉంటున్నందున ఆయా మతాలకు సంబంధించిన కార్యక్రమాలు నిర్వహించడానికి స్వేచ్ఛ మాత్రం ఉంది. ఆయా కార్యక్రమాలను ఇండోర్‌లో జరుపుకోవాలి. అందుకోసం ప్రత్యేక ప్రార్థనాలయాలు ఇక్కడ ఉండవు. మస్జిద్‌ల నిర్మాణం విషయంలో కూడా ఆంక్షలున్నాయి. మస్జిద్‌లను స్థానికులు గాని, స్థానికేతరులు గాని నిర్మించవచ్చు. ఈ మస్జిద్‌ల నిర్వహణా





వ్యవహారాలను మాత్రం పూర్తి స్థాయిలో కువైట్ ప్రభుత్వం మాత్రమే నిర్వహిస్తుంది.

## శతకం దాటిన భారతీయుల సాంస్కృతిక సంఘాలు

కువైట్‌లో ఇతర దేశాల ప్రజానీకం అత్యధిక సంఖ్యలో ఉంటున్నందున వారిలో విద్యా, వినోదం, విజ్ఞానం, సంఘసేవా కార్యక్రమాల కోసం గాను ఆయా దేశాల ప్రజలతో ఏర్పడిన పలు సంఘాలను, సంస్థలను ఆరంభించి దశాబ్దాల పాటుగా నిర్వహిస్తున్నారు. అంతర్జాలం ద్వారా తెలుస్తున్న అనధికారిక లెక్కల ప్రకారంగా భారతీయుల ఆధ్వర్యంలో ఒక సమయంలో 164 సంస్థలు ఇక్కడ ఉనికిలోకి రాగా ఆ సంఖ్య కాస్త దిగజారి ప్రస్తుతానికి వందకు చేరుకున్నట్టుగా తెలుస్తుంది. సాంస్కృతిక-విద్యా-వైజ్ఞానిక సంస్థలు ఏర్పాటు చేసుకుంటున్న కార్యక్రమాలు మాత్రమే కాకుండా మన రాష్ట్రంలోని వివిధ రాజకీయ పక్షాల అభిమానులు ఇక్కడ ఆయా పార్టీల శాఖలను ఏర్పాటు చేసుకుని, ఆ పార్టీల నాయకులు, అధినాయకుల రాకపోకల సందర్భంగా తమ స్వాగతసత్కార కార్యక్రమాలను, సభలు-సమావేశాలను నిర్విఘ్నంగా నిర్వహించుకుంటున్నారు.

కువైట్‌లో పలు భాషా పత్రికలు నడుస్తున్నాయి. మనవాళ్ళు కూడా పలు పత్రికలు నడుపుతున్నారు. ఈ విషయంలో తెలుగువారి కంటె మళయాళీలు ముందున్నట్టు అన్పించింది. తెలుగు, తమిళం, మళయాళం భాషల్లో ప్రకటనలు ఆయా మస్జిద్‌ల వద్ద ప్రత్యేకంగా ఏర్పాటు చేసిన గోడల మీద చాలా దర్శనమిచ్చాయి. అంతర్జాల పత్రికలు, వెబ్‌సైట్లు కూడా గణనీయమైన సంఖ్యలో ఇక్కడున్న పలు భాషావర్గాలకు చెందిన భారతీయులు నడుపుతున్నారు, నిర్వహిస్తున్నారు.

భారత గణతంత్ర దినోత్సవాలకు గౌరవ అతిధిగా నేను హాజరవుతున్నాని తెలియగానే, నేను కువైట్ చేరుకున్న మరుసటి రోజున మన తెలుగు బిడ్డడు శ్రీ సిహెచ్. రాజశేఖర్ తాను నిర్వహిస్తున్న 'కువైట్ఎన్నారైడాట్‌కామ్' లో నా ఇంటర్వ్యూను కోరారు. ఆయనకు ఇచ్చిన ఇంటర్వ్యూను నేను అక్కడ ఉండంగానే ఆయన అంతర్జాలం ద్వారా సవివరంగా తెలుగు ప్రజలకు అందించారు.

శ్రీ ఇస్హాఖ్ అలీతో కలసి తొమ్మిది రోజుల పాటు కువైట్ రాజ్యంలోని వివిధ ప్రాంతాలను కారులో తిరిగాను, చూశాను. ప్రభుత్వం-ప్రైవేటు వ్యక్తుల కార్యాలయాలు, గృహాలు సందర్శించాను. బజార్లలో స్థానికు కువైటీలు ఎక్కడా కన్పించలేదు. అరకొరగా కన్పించినా అక్కడ ఒకరు ఇక్కడ ఒకరు తప్ప. 'కువైట్ విశ్వవిద్యాలయం' ప్రాంతంలో మాత్రం స్థానిక విద్యార్థులు అధికంగా కన్పించారు.

కువైట్ రాజ్యంలో రోడ్లు చాలా విశాలంగా ఉన్నాయి. కువైట్‌లోని ప్రధాన రోడ్లు కాస్త శుభ్రంగా కన్పించినా, కొన్ని ప్రాంతాలలోని రహదారులు మాత్రం మన ప్రాంతాలలోని రోడ్ల మాదిరిగానే చెత్తా చెదారంతో నిండి ఉన్నాయి. ఈ ప్రధాన రోడ్ల మీద మనుషుల కంటె ఎక్కువ సంఖ్యలో విభిన్న వాహనాలు తిరుగుతున్నాయి. బహుళ అంతస్తుల సామూహిక నివాస గృహాలు గల ప్రాంతంలో నివాస గృహాల ప్రాంతం కంటె వాహనాల పార్కింగ్ స్థలం అత్యధిక విస్తీర్ణంలో కన్పించింది. పగటిపూట ఖాళీగా కన్పించిన పార్కింగ్ స్థలాలు రాత్రిపూట పూర్తిగా కిక్కిరిసిపోయి దర్శనమిచ్చాయి.

## దర్శనీయ 'మస్జిద్-యే-ఫాతిమా'

ఈ విషయాలన్నీ మాట్లాడుకుంటూ కొన్ని ప్రధాన దర్శనీయ స్థలాలకు వెళ్ళగా పునర్దురణ కార్యక్రమాలు, ఇతర కారణాల మూలంగా అవి మూతపడి ఉన్నాయి. అ సమయంలో వినూత్నమైన రీతిలో నిర్మితమైన 'మస్జిద్-యే-ఫాతిమా' సందర్శనకు వెళ్ళాం. అది నిజంగా అద్భుతమైన నిర్మాణం. అక్కడ ధార్మిక కార్యక్రమాల నిర్వహిస్తున్న డాక్టర్ అబ్దుల్ హకీం బిన్ అబ్దుల్ అజీజ్‌ను కలిశాం. ఈజిప్టులో ఇస్లామిక్ తత్వశాస్త్రంలో డాక్టరేట్ చేసిన ఆయన మస్జిద్‌లోని అన్ని భాగాలకు తీసుకవెళ్ళి నిర్మాణ కౌశల్యాన్ని వివరించారు. అనంతరం డాక్టర్ అజీజ్ ఇచ్చిన అల్పాహార ఆతిథ్యం స్వీకరించి 'చరితార్థులు' ఆల్బమ్‌ను 'మస్జిద్-యే- ఫాతిమా' గ్రంథాలయానికి భారతీయుల బహుమతిగా అందజేశాం.

భోజన సమయం ముంచుక రాగా మమ్మల్ని డిన్నర్‌కు ఆహ్వానించిన శ్రీ షేక్ ఖాజావలి నుండి ఫోన్ వచ్చింది. శ్రీ ఇస్హాఖ్ అలీ ఆయనతో మాట్లాడి మిర్గాబ్ ప్రాంతంలోని 'తబఖ్ పాకిస్తానీ' హోటల్‌కు చేరుకున్నాం.అక్కడికి మా హోస్టు, మిత్రులు శ్రీ లక్కీ అజీజ్, శ్రీ ఖాలిద్ అజ్మీ రాగా అంతా కలసి భోజనాలు చేశాం.

ఆ తరువాత కువైట్ రాజ్యానికి ప్రత్యేక గుర్తింపుగా నిలచిన 'కువైట్ టవర్స్' సందర్శనకు వెళ్లాం. ఈ టవర్స్ ఎత్తు 613.5 మీటర్లు, కౌవారం 187 మీటర్లు. ఈ టవర్స్‌లో రెస్టారెంట్, కేఫ్, లాంజ్, రిసెప్షన్ హాల్ ఏర్పాటు ఉన్నాయి. ఈ టవర్స్‌ల్లో తరుచుగా సభలు సమావేశాలు జరుగుతుంటాయి. అంత ఎత్తు నుండి కువైట్ నగరాన్ని చూసేందుకు సందర్శకులు పెద్ద సంఖ్యలో ఇక్కడకు వస్తారని తెలిసింది. ప్రత్యేకంగా ఏర్పాటు చేసిన వాటర్ టవర్స్, దేదీప్యమానంగా సప్త వర్ణాల వెలుగులు పంచడానికి చేసిన ఏర్పాట్లతో ఈ టవర్స్ ప్రత్యేకతను సంపాదించుకున్నాయి. ఈ టవర్స్‌ను మరింత అందంగా తీర్చిదిద్దడానికి సాగుతున్న విస్తరణ కార్యక్రమాల వలన ప్రస్తుతం సందర్శకులను






పది వేల మంది ఒక్కసారిగా నమాజ్ చేసుకోడానికి వినూత్న రీతిలో ఎటువంటి స్థంబాలు లేకుండా నిర్మితమైన 'మస్జిద్-యే-ఫాతిమా'

అనుమతించడం లేదని తెలిసింది. మాకు సందర్శనావకాశం లభించలేదు. నా మనస్సు బాధపడింది. ఇక చేసేదిలేక సముద్రానికి సమీపాన ఉన్న టవర్స్ ప్రాంతాన అటు ఇటు చూసి, ఆ టవర్స్ ప్రత్యేకతలను తెలుసుకుని అక్కడ నుండి బయటపడ్డాం.

## మస్జిద్-యే-కబీర్

మిత్రులు శ్రీ షేక్ ఖాజా వలి, శ్రీ అజీజ్ ఖాద్రి తదితరులు తోడురాగా, తొలుత నా కువైట్ కార్యక్రమాల జాబితాలో పేర్కొనబడి ఉన్న ప్రఖ్యాత 'మస్జిద్-యే-కబీర్' (Grand Mosque of Kuwait) చూడడానికి వెళ్ళాం. ఈ మస్జిద్ నిర్మాణం 1979లో ఆరంభమై 1986లో పూర్తయ్యింది. కువైటీలు గర్వించదగిన నిర్మాణంగా చెప్పబడే 'మస్జిద్-యే-కబీర్' 45 వేల చదరపు మీటర్ల స్థలంలో నిర్మించారు. ఈ మస్జిద్ నిర్మాణానికి కువైట్ రాజ్యం పద్నాలుగు మిలియన్ల కువైట్ దినార్‌లను వ్యయం చేసింది. ఈ మస్జిద్ ప్రాంతంలో 20 వేల చదరపు మీటర్ల స్థలంలో వివిధ భవనాలు నిర్మితమయ్యాయి. మస్జిద్ మధ్యలో ఉన్న ప్రార్థనా స్థలంలో 20 వేల మంది సౌకర్యవంతంగా నమాజ్ చేసుకోవచ్చు.

రంజాన్ మాసంలో ప్రతిరోజు 'మస్జిద్-యే-కబీర్' ప్రాంగణంలో 1,80,000 మంది నమాజ్ చేస్తారు. మస్జిద్-యే-కబీర్ లోపల ప్రత్యేకంగా నిర్మితమైన 23 మీటర్ల కైవారం కలిగిన అతి ఎత్తున ఉన్న సుందరమైన 'డోమ్' ప్రత్యేకాకర్షణ. ఈ మస్జిద్ పైకప్పు 43 మీటర్ల ఎత్తు కలిగి ఉండి, పలు రంగులతో మిశ్రితమైన మస్జిద్ గోడలు, అద్భుత రీతిలో తయారు చేయబడిన పైకప్పు భాగం ప్రత్యేక అలంకరణలతో నిర్మితమై


Grand Mosque of Kuwait

దివ్వంగా వెలిగిపోతుంటుంది. ఆ కారణంగా సాయం సమయాల్లో ఇక్కడకు నమాజ్ కోసం మాత్రమే కాకుండా ప్రత్యేకంగా విద్యుత్ వెలుగుల్లో మస్జిద్ అందచందాలను, ఆకర్షణీయమైన ప్రత్యేక ఏర్పాట్లను సందర్శించేందుకు దేశవిదేశాల నుండి సందర్శకులు, స్థానికులు, యాత్రికులు పెద్ద సంఖ్యలో ఇక్కడకు వస్తుంటారు.

ప్రపంచం మొత్తం నుండి సేకరించిన అపురూప గ్రంథాలు కలిగిన అతిపెద్ద గ్రంథాలయం ఉందిక్కడ. అధ్యయనం, పరిశోధనకు వచ్చేవారికి అన్ని రకాల ఏర్పాట్లు ఉన్నాయి. ధార్మిక–చారిత్రక–సాంస్కృతిక–వైజ్ఞానిక సభలు సమావేశాలు జరుపుకోడానికి ఐదువేల మంది ప్రేక్షకులకు తగిన ఏర్పాట్లు కలిగి ఉన్న ఐదు ప్రత్యేక సమావేశ మందిరాలున్నాయి. సుమారు ఐదు వందల వాహనాలకు సరిపడ సువిశాల పార్కింగ్ సౌకర్యం ఇక్కడ ఉంది. కువైట్ రాజ్య వక్ఫ్‌శాఖకు సంబంధించిన కార్యాలయాలు కూడా ఇక్కడ ఏర్పాటయ్యాయి. ఈ మస్జిద్ ప్రాంగణానికి సందర్శకులుగా వచ్చినా, పరిశోధనలకు వచ్చి ఇక్కడి సిబ్బంది గౌరవంగా ఆహ్వానించి, రిఫ్రెష్‌మెంట్స్ అందించి, వారి అవసరాలను తీర్చి, అవసరమైన సమాచారం అందించి తగిన గౌరవాభిమానాలు చాటడం నా స్వానుభవం.

## అవసరార్థికి 'సొసైటీ' ఆలంబన

ప్రఖ్యాత మస్జిద్–యే–కబీర్ సందర్శనం తరువాత కడప జిల్లాకు చెందిన ఓ వ్యక్తి అనారోగ్యం వలన స్థానిక ప్రభుత్వాసుపత్రిలో ఒంటరిగా ఉన్నారని, ఆయన ఆరోగ్య పరిస్థితి తెలుసుకుని సమాచారం అందించాల్సిందిగా కడప నుండి శ్రీ ఇస్హాఖ్ అలీకి వర్తమానం అందింది. ఆ వ్యక్తిని చూసేందుకు మేం 'అల్ ఆర్దియా' ప్రాంతంలో గల






In side the Grand Mosque of Kuwait

'ఫర్వానియా' అసుపత్రి వెళ్ళాం. ఆ ప్రభుత్వాసుపత్రి విశాల మైన ప్రాంగణంలో విద్యుత్ వెలుగుల్లో అందంగా కన్పిస్తుంది.బయటా లోపల శుభ్రంగా ఉంది. అక్కడ చికిత్స ఉచితం. చికిత్స పొందుతున్న వ్యక్తి అపస్మారక స్థితిలో ఉన్నారు. ఆయనకు చికిత్స చేస్తున్న వైద్య సిబ్బందితో శ్రీ షేక్ ఇస్హాఖ్ అలీ మాట్లాడారు. ఆ వివరాలన్నిటిని ఇండియాలోని సంబంధితులకు అప్పటకప్పుడు తెలిపారు. కువైట్‌లో ఉన్న రొగి సంబంధితులకు సమాచారం అందించారు. ఆర్థిక–హార్థిక సహాయానికి 'కడప ఇస్లామిక్ వెల్ఫేర్ సొసైటీ' ని తప్పకుండా సంప్రదించమని వారికి ధైర్యం చెప్పారు.

## కువైటీ ప్రముఖుల విందు సమావేశం

'ఫర్వానియా అసుపత్రి' నుండి నేరుగా మేము 'జునూబ్ అల్ సుర్రా' ప్రాంతంలో గల శ్రీ అబూ మొహ్మద్‌కు చెందిన 'దివానీయా' కు బయలుదేరాం. రాత్రి ఎనిమిది కావస్తుంది. ఆలశ్యం అయ్యిందంటూ శ్రీ ఇస్హాఖ్ అలీ కారును పరుగెత్తించ సాగారు. మేం శ్రీ పి మస్తాన్ సాహెబ్ గృహానికి వెళ్ళి రిఫ్రెష్ అయ్యి, ఆయనతో కలసి తిన్నగా దివానీయా చేరుకున్నాం. బయట నుండి చూస్తే దివానీయా పెద్ద భవనంలా అన్పించలేదు. అతి ఎత్తు గోడలతో నిర్మితమైన ఆ భవనం బయట పెద్ద ప్రవేశ ద్వారాలు ఏవీ కన్పించ లేదు. ఓ ఇరుకు ద్వారం ద్వారా లోనికి ప్రవేశించాం. మలుపులు తిరుగుతున్న మార్గం గుండా హాలులోకి చేరాం. అది పెద్ద సమావేశ మందిరం. చాలా విలాసవంతంగా ఉంది. వర్ణచిత్రాలతో, ప్రత్యేక విద్యుత్ దీపాలతో అలంకృతమై ఉంది. ఆ హాలు చుట్టూతా ఉన్న ప్రత్యేక కుర్చీలలో కొందరు 'కువైటీలు' ఆశీనులై ఉన్నారు. హాలు మధ్యలో ఉన్న

పెద్ద టేబుల్ మీద వివిధ రకాల శాఖాహార పదార్ధాలు సర్దిపెట్టి ఉన్నాయి. గృహ సహాయకులు మరిన్నిటిని తెచ్చి ఆ టేబుల్ మీద సర్దుతున్నారు.

## ఆంగ్లంలో ప్రసంగం

శ్రీ అబూ మొహ్మద్ స్వగృహం 'దివానీయా'లో ప్రతివారం ఇటువంటి సత్సంగం జరుగుతుందని, ఆ సమావేశలకు ప్రముఖులను ప్రత్యేకంగా ఆహ్వానించి పలు అంశాల మీద ఇక్కడ ఇష్టాగోష్టి జరుగుతుందని, ఈ వారం ఇష్టాగోష్టికి నన్ను ఆహ్వానించారని శ్రీ ఇస్హాఖ్ అలీ చెప్పారు. అంతా తాపీగా కూర్చొన్నాక, నన్ను శ్రీ ఇస్హాఖ్ సభికులకు పరిచయం చేశారు. ఆ తరువాత సమావేశానికి అధ్యక్షత వహించిన ప్రముఖ ఇంజనీర్, చరిత్ర పట్ల అవగాహన, అంతకంటె ఎక్కువ మక్కువ గల శ్రీ అబూ ఖాలిద్ నన్ను ప్రసంగిచమన్నారు.

భారత స్వాతంత్ర్యోద్యమంలో ముస్లింలు నిర్వహించిన పాత్రకు సంబంధించిన విశేషాంశాలను తొలుత వివరించాను. ఆ తరువాత నా రచనల లక్ష్యాన్ని విశ్లేషిస్తూ భారత దేశంలోని ప్రధాన సాంఘిక జనసముదాయాల మధ్యనున్న సోదరభావం, స్నేహసంబంధాలను మరింత పటిష్టం చేయడమని పేర్కొన్నాను. సమాజంలో సంఘర్షణ వైఖరి, విద్వేషాలు ప్రశాంతతను నాశనం చేస్తాయని, అటువంటి సంఘర్షణ వాతావరణంలో ప్రగతి అసాధ్యమన్నాను. మా దేశంలోని సాంఘిక వాతావరణాన్ని మంచిగా ఉందని, ఈ వాతావరణాన్ని పరిరక్షించటం మాత్రమే కాకుండా మరింతగా బలోపేతం చేయడానికి కృషి చేస్తున్నానని వివరించాను. ఆంగ్లంలో సాగిన నా ప్రసంగాన్ని సభికులు సావధానంగా విన్నారు. ఆ తరువాత మరికొన్ని ప్రశ్నలు వేసి నా సమాధానంతో సంతృప్తి చెంది మంచి పని చేస్తున్నారంటూ సభికులు నన్ను ప్రత్యేకంగా అభినందించారు.

అనంతరం శ్రీ అబూ ఖాలిద్ మాట్లాడుతూ భారత దేశ చరిత్రకు సంబంధించిన కొన్ని ప్రత్యేక ప్రశ్నలు వేశారు. ఆ ప్రశ్నలకు సమాధానాలయ్యాక, 'చరితార్థులు' ఆల్బమ్‌ను క్షుణ్ణంగా పరిశీలించారు. చివరకు ఉన్నతమైన లక్ష్యంతో సాగుతున్న నా రచనా వ్యాసాంగం కొనసాగాలని నేను ఆశిస్తున్నట్టుగా భారత ప్రజలంతా సుఖంగా ఉండాలని ఆకాంక్ష వ్యక్తంచేశారు. ఈ సందర్భంగా 'చరితార్థులు' ఆల్బమ్‌ను కువైట్ ప్రజలకు భారతీయుల బహుమతిగా అందజేయగా, సత్సంగం పక్షాన శ్రీ అబూ ఖాలిద్ స్వీకరించారు.

## కువైట్ మిత్రుని సహృదయం

ఈ కార్యక్రమం చివర్న మేమంతా 'దివానీయా' నుండి బయటకు వస్తుండగా మా వెంట వచ్చిన శ్రీ పి. మస్తాన్ సాహెబ్ నా వద్దకు వచ్చి 40 కువైట్ దీనార్ల కరెన్సీని







ది 02-02-2015 రాత్రి కువైట్‌లోని 'దివానియా'లో కువైటీ ప్రముఖుల ఆహ్వానం మీద జరిగిన విందు సమావేశంలో నిర్వాహకులకు 'చరితార్థులు' ఆల్బమ్ బహూకరణ.

సందేహిస్తూ నా చేతుల్లో పెట్టారు. ఆ కరెన్సీని శ్రీ అబూ ఖాలిద్ నాకు అందజేయమన్నారని ఆయన తెలిపారు. మనం ఆయనకు 'చరితార్థులు' ఆల్బమ్‌ను భారతీయుల బహుమతిగా అందించినప్పుడు మూల్యం తీసుకోవడం బాగాలేదని నేను కరెన్సీని తిరస్కరించాను. 'నశీర్‌కు బహుమతి ఏమి ఇవ్వలేకున్నాను...అందువల్ల ఈ మొత్తాన్ని ఆయనకు ఇవ్వండి' అని శ్రీ ఖాలిద్ తనతో అన్నారని శ్రీ మస్తాన్ చెప్పారు. 'పుస్తక ప్రచురణ చాలా కష్టమైన పని...ఆ కష్టనష్టాలు నాకు తెలుసు...చరిత్రకు సంబంధించిన గ్రంథాల ప్రచురణ చాలా వ్యయప్రయాసలతో కూడుకున్నది...నశీర్ చేస్తున్న పని చాలా మంచి ప్రయత్నం...ఇది ఆయనకు అందిస్తున్న నా చిరుకానుక మాత్రమే...దయచేసి కాదనకుండా తీసుకుని ఆయనకు అందివ్వండి' అని శ్రీ ఖాలిద్ తనతో అన్నారని శ్రీ మస్తాన్ చెప్పారు.

ఆ విషయాన్ని నా కనుసైగలతో శ్రీ ఇస్హాఖ్ అలీ దృష్టికి తీసుకెళ్ళాను. ఈ వ్యవహారాన్ని గమనిస్తున్న ఆయన బహుమతులుగా కరెన్సీ ఇవ్వడం కూడా కువైటీలకు ఆనవాయితి...నిరాకరిస్తే అగౌరవంగా భావిస్తారు, కనుక స్వీకరించాల్సిందిగా సంజ్ఞ చేశారు. ఆ మీదట శ్రీ ఖాలిద్ ఇచ్చిన 40 కువైట్ దీనార్లను అంగీకరించాల్సి వచ్చింది. రచయిత ఇక్కట్ల గురించి ఆలోచించి అతి చిన్న సహాయమైనా అందజేయాలనుకున్న శ్రీ అబూ ఖాలిద్‌కు మనస్సులో ధన్యవాదాలు తెలుపుకున్నాను.

## గృహ సహాకునితో మాటా-మంతికి ప్రయత్నం

సమావేశం మందిరంలోకి ప్రవేశించాక శ్రీ అలీతో నేను తెలుగులో మాట్లాడటం గమనించి ఆ గృహసహాయకులలో ఒకతను నన్ను చూసి నవ్వాడు. అతను తెలుగు




**ది 02-02-2015 రాత్రి కువైట్‌లోని 'దివానియా'లో కువైటీ ప్రముఖుల విందు సమాశేశంలో శ్రీ ఇస్హాఖ్ అలీ, నేను, డాక్టర్ శ్రీ అబూ ఖాలిద్**

వాడు. అతనితో మాటలు కలిపాను. యువకుడు. కడప జిల్లా నుంచి వచ్చాడు. మూడు సంవత్సారాగా కువైట్‌లో ఉంటున్నాడు. మా అతిథేయి ఇంట గృహ సహాయకునిగా ఉంటున్నాడు. మంచి ఆదరణ...మంచి జీతం... మంచి జీవితం లభిస్తుందన్నాడు. మరో రెండు నెలల్లో ఇంటికి వెళ్ళి వివాహం చేసుకుంటానని చెప్పాడు. ఆ తరువాత భార్యతో సహా మళ్ళీ కువైట్ వచ్చేస్తానన్నాడు. భార్యకు కూడా తమ యజమాని ఇంట్లోనే ఉద్యోగం లభిస్తుందని అతను నమ్మకంగా చెప్పాడు.

ఈ యువకుని పరిశీలనగా గమనించిన నాకు అక్కడ ఒక ప్రత్యేకత కన్పించింది. ఈ సమావేశం ముగియనున్నదనంగా మేమంతా బయటకు వెళ్ళేందుకు ఉద్యుక్తులం అవుతుండగా అక్కడ ఏర్పాటు చేసిన ఆహార పదార్ధాలను ఒక ప్లేటులో తీసుకుని మరోక వ్యక్తితో కలసి హాలులోనే మాకు సమీపాన ఉన్న మరో సోఫా మీద కూర్చొని ఆ యువకుడు తింటున్నాడు. 'దివానీయా'కు వచ్చిన అతిథులు సమావేశ మందిరం నుండి ఇంకా నిష్క్రమించలేదు, ఆయన యజమాని కూడా సమావేశం మందిరంలోనే ఉన్నాడు, అతిథులందరికి వీడ్కోలు పలుకుతున్నాడు. అ సమయంలో కూడా ఆ యువకుడు తాపీగా కూర్చోని అల్పాహారం స్వీకరించడం ఆశ్చర్యం అన్పించింది.

మన ప్రాంతంలోని 'యజమాని-సహాయకుడి' సంబంధాలతో పోల్చితే ఈ యువకుని ప్రవర్తన మన ప్రాంతంలో అయితే అసాధ్యమన్పించింది. ఈ ప్రవర్తన పట్ల అతనితో కొంత సేపు మాట్లాడుదామనుకున్నా, సమయం మించి పోతున్నందున,





అతిథులంతా వెళ్ళి పోతున్నందున, బాగా పొద్దుపోయినందున నాకు వీలుకాలేదు. చివరకు 'విందు సమావేశం' రాత్రి 11గంటల ప్రాంతంలో ముగిసింది. 'దివానీయా' నుండి బయలు దేరి మార్గమధ్యమంలో శ్రీ పి మస్తాన్ సాహెబ్‌ను ఆయన గృహం వద్ద వదలిపెట్టి మా బసకు రాత్రి 12 గంటలకు చేరుకున్నాం.

## కువైట్ నగరం నుండి క్రువైట్ గ్రామానికి

ఫిబ్రవరి 03, 2015 ఉదయం. శ్రీ మౌలానా అబ్దుల్ ఖాదిర్ ఉమ్రి ఆహ్వానం మేరకు కువైట్ నగరానికి 40 కిలోమీటర్ల దూరంలోని 'కబడ్' ప్రాంతానికి బయలుదేరాం. మార్గమధ్యంలో ఉండగా శ్రీ ముస్తఫా రెడ్డి నుండి 'మీరెక్కడ ఉన్నారంటూ' శ్రీ ఇస్హాఖ్ అలీకి కాల్ వచ్చింది. మేము ఎక్కడున్నామో చెప్పగా అటువైపుగా ఉన్న పెట్రోలు బంక్ వద్దకు తాను వస్తున్నట్టుగా తెలిపి మరికొంత సేపట్లో ఆయన వచ్చి మమ్మల్ని కలిశారు. మాతో మాట్లాడుతూ మరుసటి రోజు ఉదయం అల్పాహారానికి మమ్మల్ని ఆహ్వానించారు. ఆయన ఆతిధ్యానికి అంగీకారం తెలిపి మళ్ళీ మా ప్రయాణం కొనసాగించాం.

అనంతపురం జిల్లా కదిరి నివాసి మౌలానా శ్రీ అబ్దుల్ ఖాదిర్ ఉమ్రి ధార్మిక పండితులు. అరబిక్, ఉర్దూ, తెలుగు భాషల్లో ప్రవీణులు. ఆయన గత 35 ఏండ్ల నుండి ఇటు ఇండియాలో అటు కువైట్‌లో 'ఐపిసి' గా పిలువడుతున్న 'ఇస్లామిక్ ప్రజన్‌టేషన్ కమిటీ' చెందిన కబడ్ శాఖలో బాధ్యతలు నిర్వహిస్తున్నారు. నన్ను ఆ బ్రాంచిని సందర్శించాల్సిందిగా కోరడంతో కువైట్ నగరం తోపాటుగా గ్రామ ప్రాంతాన్ని కూడా చూసినట్టుగా ఉంటుందని బయలుదేరాం. ఆ ప్రయాణంలో ఉండగా మౌలానా శ్రీ ఉమ్రి చేసి, మరో వాహనంలో మాకు ఎదురు వస్తూ, మార్గమధ్యమంలో మమ్మల్ని కలిసి, తమ వెంట ఐపిసి బ్రాంచి కార్యాలయానికి మమ్మల్ని తోడ్కొని వెళ్ళారు.

## ఎడారి ఫామ్‌హౌస్‌ల్లో ఒంటరి బ్రతుకులు

కువైట్ నగరం నుండి సాగిన 40 కిలోమీటర్ల ప్రయాణంలో ఎటు చూసినా ఎడారి కన్పిస్తుంది. అక్కడక్కడ ఒంటెలు, గొర్రెలు, గుర్రాల మందలతో కూడిన ప్రత్యేక శిబిరాలు, కువైటీల పెద్ద పెద్ద ఫామ్ హౌసులు కన్పిస్తున్నాయి. ఈ శిబిరాలలో, ఫామ్ హౌస్‌లలో ఎక్కువగా అవిద్యావంతులైన వ్యక్తులు, ప్రత్యేక శిక్షణలేని ఉద్యోగార్ధులు వివిధ ఉద్యోగాలు చేస్తుంటారని తెలిపారు. ఆ కారణంగా ఇక్కడకు ఉద్యోగాలు చేస్తున్న వ్యక్తులు ఒంటరిగా గడుపుతూ, యజమాని దయాదాక్షిణ్యాల మీద ఎక్కువగా ఆధారపడాల్సి వస్తుందన్నారు. అటువంటి స్వదేశీయుల మేలు కోరుతూ తమ 'ఐపిసి' గాని 'సోసైటీ' గాని తగిన విధంగా కృషి చేస్తుంటాయని శ్రీ ఉమ్రి వివరించారు.



03-02-2015 కబడ్ ఐపిసి లో
శ్రీ మౌలానా అబ్దుల్ ఖాద్రి ఉమ్రి,
శ్రీ అబ్దుర్ రహమాన్ కసీర్,
శ్రీ ఇస్హాఖ్ అలీ, నేను.

మా వాహనం తిన్నగా 'ఐపిసి' కార్యాలయం వద్దకు చేరుకుంది. ఆ కార్యాలయం నిర్వాహకులు శ్రీ అబ్దుర్ రహమాన్ కసీర్ మాకు స్వాగతం పలికారు. కుశలప్రశ్నలు అయ్యాక నా గురించి, నా గ్రంథాల ప్రచురణ గురించి శ్రీ ఇస్హాఖ్ అలీ ఆయనకు వివరించారు. ఆయన ఆతిథ్యాన్ని స్వీకరిస్తూ భారత స్వాతంత్ర్యోద్యమంలో ముస్లింల పాత్రను వెల్లడి చేసే గ్రంథాలను భారత దేశంలోని ప్రాంతీయ భాషల్లో ప్రచురించాలని ఎందుకు కోరుతున్నానో, వాటి అవసరం ఏమిటో ఇష్టాగోష్టిలో ఆయనకు వివరించాను.

## ఎడారుల్లో విలాసవంతమైన ఫామ్‌హౌస్‌లు

అనంతరం శ్రీ ఉమ్రిగారి మార్గదర్శకత్వంతో 'ఐపిసి' కార్యాలయానికి మరికొంత దూరంలో గల ఓ కువైటీ ఫామ్‌హౌస్‌కు వెళ్ళాము. ఆ ఫామ్‌హౌస్‌కు శ్రీ ఉమ్రి మిత్రులు అనంతపురం జిల్లా కదిరి నివాసి శ్రీ కలీముల్లా కేర్‌టేకర్‌గా ఉంటున్నారు. ఆయన ఆహ్వానం మేరకు ఆతిథ్యం స్వీకరించడానికి వెళ్ళాం.

ఆ ఎడారిలో ఒంటరిగా అతి ఎత్తయిన ప్రహరీ గోడలతో, పెద్ద గేటుతో ఫామ్‌హౌస్ బయట నుండి దర్శనమిచ్చింది. వాహనాలు బయట ఆపి, ఇరుకుగా గల చిన్న ద్వారం ద్వారా ఫామ్‌హౌస్ లోనికి ప్రవేశించాం. అది అన్ని అత్యాధునికి వసతుల గల అతిపెద్ద విలాసగృహం. ఆట స్థలం, స్విమ్మింగ్‌పూల్‌తో పాటు పలు విశాలమైన గదులతో, మంచి ఆవరణతో, ఆధునిక వంట వసతులను కలిగి ఉంది.

ఆ ఫామ్‌హౌస్‌కు అప్పుడప్పుడు మాత్రమే యజమాని కుటుంబ సభ్యులతో, మిత్రులతో వస్తుంటారని శ్రీ కలీముల్లా తెలిపారు. ఆ సమయంలో ఏ లోటూ రాకుండా





వారికి అన్ని రకాలుగా సేవలందించాలన్నారు. యజమాని ఇతర అతిథులు, వారి వారి కుటుంబ సభ్యులు ఒకటి రెండు రోజులు ఇక్కడ విశ్రాంతి తీసుకుని వెళ్ళిపోతారన్నారు.

ఆ విలాస మందిరంలోని ఆసనాల మీద సుఖాశీనులై మాట్లాడుకుంటుండగా, శ్రీ కలీముల్లా భోజనానికి ఆహ్వానించారు. శ్రీ ఉమ్రి అతిథులం కనుక మమ్మల్ని కూడా భోజనానికి ఆహ్వానించినందున, శ్రీ ఉమ్రి మమ్మల్ని కూడా అక్కడకు తొడ్కొని వెళ్ళారు. ఆ మిత్రుడు స్వయంగా తయారు చేసిన ప్రత్యేక వంటకాలను మాకు వడ్డిస్తుండగా, ఆహారపదార్థాలను ఆరగించాం. అనంతరం మా అతిథేయికి ధన్యవాదాలు తెలిపి, నేను శ్రీ ఉమ్రి, శ్రీ ఇస్హాఖ్ కువైట్ నగరం వైపు తిరుగు ప్రయాణం సాగించాం.

## 'మస్జిద్'ల బహుళార్థక ప్రయోజనాలు

ఆ రోజు సాయంత్రం ఆరు గంటలకు 'ఐపిసి'గా విఖ్యాతి చెందిన 'ఇస్లాం ప్రజంటేషన్ కమిటీ' సంస్థ నుండి నాకు ఆహ్వానం ఉంది. ఆ సంస్థకు చెందిన వివిధ ప్రముఖులతో కలవాల్సి ఉంది. ఆ తరువాత ఓ విందు సమావేశం కూడా ఉంది. ఆ కారణంగా మేము తిన్నగా కువైట్ నగరం చేరాం. కువైట్ నగరంలోని ప్రసిద్ధ 'జహ్రా' వీధిలోని 'మస్జిద్ అల్ ముల్లా సాలిహ్' అండర్ గ్రౌండ్‌లో 'ఐపిసి' ప్రధాన కార్యాలయం ఉంది. కువైట్ నగరంలో ప్రతి మస్జిద్ ప్రాంతాన్ని కువైటీలు కేవలం నమాజ్ చేయడానికి మాత్రమే పరిమితం చేయకుండా వివిధ కార్యక్రమాల నిర్వహణకు కార్యాలయాలు, తరగతి గదులు, మంచి సమావేశ మందిరాలు, అతిథులకు గదులు, మంచి గ్రంథాలయం ఏర్పాట్లుతో బహుళప్రయోజనకారిగా నిర్మించుకుని చక్కగా ఉపయోగించుకుంటున్నారు. ఆ మస్జిద్‌లన్నీ విశాలమైన ఆవరణలు కలిగి ఉండి వివిధ కార్యక్రమాలను నిర్వహించడానికి అనువుగా ఉంటున్నాయి. మరికొన్ని మస్జిద్‌లలోని విశాలమైన ఆవరణలను కువైటీలు ఆటస్థలాలుగా ఉపయోగించుకుంటున్నారు. కువైట్‌లో మొత్తం మీద 630 మస్జిద్‌లుండగా అత్యధిక మస్జిద్‌లు బహుళార్ధ ప్రయోజనాలకు ఉపయోగపడుతున్నాయని తెలిసింది.

ఈ మేరకు కువైట్‌లో నేను సందర్శించిన 'మస్జిద్-యే-ఫాతిమా', 'మస్జిద్-యే-కబీర్', 'లూల్వా అల్ నాస్సర్ మస్జిద్', 'మస్జిద్ అల్ హమద్', 'మస్జిద్-యే-మర్జూక్ అల్ బదర్', యూసుఫ్ అల్ అద్‌సాని మజ్జిద్, ఖైతాన్‌లోని మా బసకు సమీపాన ఉన్న 'ఆజమీ మస్జిద్' లలో ఆటస్థలాలు గాని, గ్రంథాలయాలు గాని, కార్యాలయాలు గాని, బహిరంగ సమావేశ స్థలాలు గాని ఏదోఒకటి, లేక అన్నీ కలిగి ఉంటున్నాయి. ఆ ఆనవాయితి ప్రకారంగా 'మస్జిద్ ముల్లా సాలెహ్' కూడానిర్మితమైనందున ఇక్కడ ప్రధానంగా

'ఐపిసి' చెందిన అన్ని శాఖల కార్యాలయాలు, తరగతి గదులు, సమావేశ మందిరాలు, విశ్రాంతి గదుల మంచి ఏర్పాటు ఉంది.

నేను, శ్రీ ఇస్హాఖ్ అలీ, శ్రీ అబ్దుల్ ఖాదిర్ ఉమ్రి కబడ్ గ్రామీణ ప్రాంతం నుండి సాయంత్రం అయ్యేలోగా కువైట్ నగరం చేరుకున్నాం. ప్రధాన వీధుల గుండా సాగుతూ, మాకు ఆహ్వానం పలికిన సుమారు 27 సంవత్సరాల చరిత్ర కలిగి ఉన్న 'ఇస్లాం ప్రజంటేషన్ కమిటీ' (Islamic Presentation Committee) ఏర్పడక ముందు నాటి స్థితిగతుల, 'ఐపిసి' ఏర్పాటుకు సాగిన అవిరళ కృషి, 'ఐపిసి' ఏర్పాటుకు పడిన శ్రమను షేక్ ఇస్హాఖ్ అలీ చెప్పసాగారు. ఆ క్రమంలో 'ఐపిసి' ప్రగతి, ఇతర స్థానిక సంస్థల నిర్మాణం, వాటి చరిత్రతో ఎంతో ముడిపడి ఉన్న శ్రీ షేక్ అలీ వివరించారు.

ఆ వివరాలతోపాటుగా, 'ఇస్లాం ప్రజంటేషన్ కమిటీ' ఏర్పాటు విషయంలో అలనాడు తన వంతు కృషి సల్పిన శ్రీ యం.డి అహమ్మద్ (నెల్లూరు), 'ఐపిసి' నిర్వహిస్తున్న తెలుగు మాసపత్రిక 'నెలవంక' ప్రప్రథమ సంపాదకులుగా బాధ్యతలు నిర్వహించిన శ్రీ మహ్మద్ అజీజుర్రెహమాన్ (హైదరాబాద్), 'ఐపిసి'లో పలు బాధ్యతలు నిర్వర్తించిన శ్రీ ముజాహిద్ ఖాన్ ఉమ్రి (విజయవాడ), 'ఐపిసి' నిర్వహిస్తున్న తెలుగు మాసపత్రిక 'నెలవంక' ప్రస్తుత సంపాదకులు శ్రీ సయ్యద్ అబ్దుల్ సలాం ఉమ్రిలు (కువైట్) నాకిచ్చిన ప్రత్యేక ఇంటర్వ్యూలలో వెల్లడించిన, రాతపూర్వకంగా నాకు అందించిన సమాచారానికి అంతర్జాలం ద్వారా నేను సమకూర్చుకున్న వివరాలను జోడించి 'ఇస్లాం ప్రజంటేషన్ కమిటీ' చరిత్రను సంక్షిప్తంగా ఇక్కడ అందిస్తున్నాను.

## తొలుత 'జుమా పాఠశాల' ఏర్పాటు

1970వ దశకంలో ధార్మికపరిజ్ఞానం, సేవాభావం గల యువకుల కృషితో ఆరంభమైన పలు కార్యక్రమాలు, ఆ కార్యక్రమాల ఆచరణలో ఎదురైన పలు అనుభవాలు, ఆలోచనల నేపథ్యంలో తొలుత 'జుమా పాఠశాలలు' ఉనికిలోకి వచ్చాయి. ఉద్యోగార్థులై కువైట్ చేరుకుని వివిధ పనుల్లో లేక ఉద్యోగాల్లో కుదురుకుంటున్న ప్రజలకు 'అరబిక్' రాకపోవడం అటు స్థానిక యజమానికి ఇటు బయట నుండి వచ్చిన ఉద్యోగికి ఇబ్బందిగా పరిణమించింది. ఆంగ్ల బాష మనవాళ్ళందరికి రాకపోవడం అటు ఇటు భాషాపరమైన పలు ఇబ్బందులకు కారణమయ్యింది. ఆ ఇబ్బందులను గమనించిన కొందరు కువైటీలు తమ ఉద్యోగులకు, తమ వద్ద నున్న పనివారికి 'అరబిక్' నేర్పడానికి, దానితోపాటుగా ధార్మిక పరిజ్ఞానం కలుగజేయడానికి, స్థానిక పరిస్థితులను వివరించేందుకు గాను తగిన ఏర్పాట్లు చేయడానికి ముందుకు వచ్చారు.





కువైట్‌లో ప్రతి జుమా (శుక్రవారం) రోజు శెలవుదినం కావడంతో అందరికి అనువుగా ఉంటాయన్న ఆలోచన నుండి 'జుమా పాఠశాల'లు ఉద్భవించాయి. ఈ పాఠశాలల్లో సులభంగా ధార్మిక, ఆరబిక్ పాఠాలు చెప్పడానికి, ఇతర విషయాలు సులువుగా నేర్పడానికి తెలుగు-ఉర్దూ- ఆరబిక్ ఎరిగిన వ్యక్తులు ముందుకొచ్చారు. ఈ పాఠశాలల్లో అరబిక్ నేర్పడంతోపాటుగా, ధార్మిక పరిజ్ఞానం కలుగజేయడం మాత్రమే కాకుండా 'కువైట్' వచ్చిన ఉద్యోగార్థులు, ఉద్యోగస్తులు, వివిధ పనులు చేపట్టిన ఇతరులు ఎదుర్కొంటున్న ఇక్కట్ల పరిష్కారం దిశగా కూడా 'జుమా పాఠశాల'ల కృషి ఆరంభమైంది.

ఈ జుమా పాఠశాలలకు విచ్చేసిన వారికి అవసరమగు సామగ్రి, ఆల్పాహారం ఏర్పాట్లు కూడా స్థానికులు ఏర్పాటు చేయడం ఆరంభించారు. ధార్మిక-లౌకిక సందేహాలు, అవసరాలు తీర్చుకోడానికి జుమా పాఠశాలలను ఆశ్రయించేవారి సంఖ్య క్రమం క్రమంగా పెరగటంతో 'జుమా పాఠశాల'లు కువైట్‌లోని మాలియా, మిర్గాప్, బీచ్‌రోడ్, మస్జిద్ ముల్లా సాలెహ్ తదితర ప్రాంతాలలో ఏర్పాటయ్యాయి. ఆ కారణంగా నూతనంగా కువైట్ వచ్చేవారికి, వచ్చిన వారికి, ఇక్కడ పనులు-ఉద్యోగాలు చేస్తున్న వారికి 'జుమా పాఠశాల'లు ధార్మిక-లౌకిక వ్యవహారాల ప్రధాన మార్గదర్శక కేంద్రలయ్యాయి.

## 1978లో 'ఐపిసి' ఏర్పాటు

అవసరాలు, అవరార్థులు పెరగటంలో 'జుమాపాఠశాల'ల స్థానంలో నూతన సంస్థ ఏర్పాటు ఆలోచన కలిగింది. ఈ మేరకు శ్రీ యం.డి ఇమానుద్దీన్ అహమ్మద్ (నెల్లూరు), శ్రీ ఖలీలుల్లా ఖాన్ (హైదరాబాద్), శ్రీ యండి. అహమ్మద్ (నెల్లూరు)లు చొరవ తీసుకున్నారు. జుమా పాఠశాలల నిర్వహణకు అన్ని విధాల సహకరిస్తున్న స్థానిక ప్రముఖులకు నచ్చజెప్పి ప్రత్యేక సంస్థ ఏర్పాటుకు ప్రయత్నాలు ఆరంభించారు. ఆ తరువాత ఆ ఆలోచనలకు స్థానికుల మద్దతు లభించడంతో 1978లో 'ఇస్లాం ప్రజంటేషన్ కమిటీ' ఏర్పడింది. ఈ సంస్థ కార్యాలయం 'మస్జిద్ అల్ ముల్లాహ్ సాలిహ్' అంతర్భాగంలోని ఒక చిన్న గదిలో అతికొద్ది మందితో తొలుత 'ఐపిసి' ఆరంభమైంది. ఆ తరువాత సేవాతత్పరత, కార్యదక్షత గల శ్రీ షేక్ ఇస్హాఖ్ అలీ లాంటి పలువురు వ్యక్తులు 'ఐపిసి'కి తోడయ్యారు. ఆ క్రమంలో సాగుతున్న కార్యక్రమాలకు మంచి ఆదరణ లభించడం, సంస్థ వ్యవస్థాపకులు ఆశించిన ప్రయోజనాలు ఆచరణాత్మకంగా దర్శనమివ్వడం వలన స్థానికులు పూర్తిస్థాయిలో 'ఐపిసి'కి అండగా నిలిచారు.

ఆ తరువాతి కాలంలో ధార్మిక నిబద్దతతోపాటుగా, ధార్మిక జ్ఞానసంపద, సేవాభావం మెండుగా గల యువకులు 'ఐపిసి'లోకి వచ్చారు. 'ఐపిసి' ద్వారా ధార్మిక

ప్రచారం, అవసరార్థులకు లౌకిక-సామాజిక సహకారం అందించడం, అవసరాలు తీర్చడం మాత్రమే కాకుండా వినూత్న కార్యక్రమాలను కూడా ప్రణాళికబద్ధంగా 'ఐపిసి' నిర్వహించడం ఆరంభించింది. జాతీయ పండుగ దినాల్లో సాంస్కృతిక కార్యక్రమాలను నిర్వహించడం, ఆటల-పాటల పోటీలను నిర్వహించడం లాంటి కార్యక్రమాలకు 'ఐపిసి' నిర్వహించ సాగింది. ఈ కార్యక్రమాలు ఆటవిడుపుగా మాత్రమే ఉండటం కాకుండా ధార్మిక పరిజ్ఞానంతోపాటుగా, స్థానిక అవసరాలు తీర్చుకునేందుకు ఉపకరించడం, ఉద్యోగాలు, ఉద్యోగార్థుల అవస్థలు తీర్చడానికి సహాయపడటం వలన ఇటు స్వదేశీయుల అటు కువైటీల ఆదరణకు నోచుకున్నాయి.

ఈ కార్యక్రమాలు ఇటు ఉపాధి కల్పిస్తున్న కువైట్ రాజ్యం పట్ల గౌరవ విశ్వాసాలు, అటు మాతృభూమి పట్ల ప్రేమాభిమానాలు మరింతగా వర్ధిల్లేట్టుగా తోడ్పడ్డాయి. ఈవిధంగా అంతవరకు అనుభవంలోలేని నూతన పోకడలతో 'ఐపిసి' కార్యక్రమాలు నిర్వహిస్తూ రావడంతో ఇటు స్థానిక దాతలతోపాటు అటు స్వదేశీయుల ఆదరాభిమానాలను మెండుగా సంపాదించుకుంది. ఆ క్రమంలో 'ఇస్లాం ప్రజంటేషన్ కమిటీ' కార్యక్రమాలు అందర్ని ఆకర్షిస్తూ 'మూడు పూలు ఆరు కాయలు'గా బాగా విస్తరించాయి.

## ఆంగ్లం-ఉర్దూ నుండి తెలుగులోకి...

తొలుత 'జుమా పాఠశాల'లలో ఆంగ్లంలో శిక్షణ ఆరంభించి అటు నుండి ఉర్దూ భాష వరకు మారింది. ఆ పరిస్థితి కొంత కాలం సాగింది. ఆ తరువాతి కాలంలో ఉర్దూ భాష నేర్చిన వారి సంఖ్య కంటె తెలుగు భాష వచ్చిన వారి సంఖ్య ఎక్కువ కావడంతో ఉర్దూ స్థానంలో తెలుగు సందర్శకులను, ఆసక్తిగల ఇతరులను బహుదా ఆకట్టుకోసాగింది. ఆ కారణంగా 'జుమా పాఠశాల'లో తిన్నగా తెలుగు ప్రవేశించింది. ఆ కారణంగా అటు ఉర్దూ-అరబిక్ భాషలతోపాటుగా ఇటు తెలుగు భాషా పరిజ్ఞానం గలిగిన సమర్థులను ఆంధ్రప్రదేశ్ నుండి 'జుమా పాఠశాల' నిర్వాహకులు రప్పించారు. మంచి తెలుగు భాషా పరిజ్ఞానం గల ధార్మిక పండితులు, ఉపాధ్యాయుల రంగప్రవేశం వలన 'జుమా పాఠశాల'లో సత్ఫలితాలు కన్పించడంతో నిర్వాహకులు తెలుగు భాషకు పూర్తి స్థాయిలో ప్రాధాన్యత ఇచ్చారు.

తెలుగు భాషావర్గానికి చెందిన ప్రజలు ఇటు ధార్మిక అటు లౌకిక వ్యవహారాల్లో తెలుగు బాషను ఎక్కువగా కోరుకున్న కారణంగా ధార్మిక విషయాలను తెలుగులో వివరించడం బాగా వేగం అందుకుంది. ఈ వేగానికి తెలుగు భాషావర్గీయుల సహకారం







కువైట్ 'జహ్రా' వీధిలోని 'మస్జిద్ అల్ ముల్లాహ్ సాలిహ్' లో ఏర్పాటయిన 'ఐపిసి' ప్రధాన కార్యాలయ భవనం

లభించడం వలన తెలుగులో ధార్మిక ప్రసంగాలు, మస్జిద్‌లో 'ఖుద్బా ప్రసంగాలు' కూడా 'ఐపిసి' చొరవతో రూపు దిద్దుకున్నాయి. తెలుగు భాషాప్రియులు అత్యధికంగా ఉండటం వలన వారి భాషావసరాలను తీర్చడం అత్యవసరమయ్యింది. ఆ కారణంగా అత్యధికులు అర్థం చేసుకోగల 'తెలుగు' భాషకు అత్యవసర ప్రాధాన్యత లభించింది.

## గల్ఫ్ యుద్ధంతో 'ఐపిసి'లో స్థబ్దత

అప్పుడప్పుడే స్థిరపడి తన కార్యక్రమాలను విస్తరింపజేసుకుంటున్న 'ఇస్లాం ప్రజంటేషన్ కమిటీ' పురోగతికి 'గల్ఫ్‌యుద్ధం' ప్రతిబంధకంగా మారింది. ఈ యుద్ధం వలన కువైట్ పూర్తి స్థాయిలో కునారిల్లింది. ఆ కారణంగా చాలా మంది భారతీయులు స్థానికంగా ఉద్యోగాలు-పనులు కోల్పోయారు. ఆనాటి అల్లకల్లోల వాతావరణంలో ఇమడలేక చాలా మంది స్వదేశం వచ్చేశారు. కువైట్ నుండి అంతా స్వదేశాలకు తరలి వెళ్ళడంతో 'ఐపిసి' కార్యక్రమాలలో పూర్తి స్థాయిలో తీవ్ర స్థబ్దత ఏర్పడింది. ఆ తరువాత ఏర్పడిన అంతర్జాతీయ పరిస్థితుల మూలంగా కువైట్ రాజ్యం పరిస్థితి కొంత తెప్పరిల్లాక కువైట్ వీడిన వారు తిరిగి రావడం ఆరంభించాక 1990 చివర్లో 'ఐపిసి' కార్యక్రమాలను పున:ప్రారంభించి 1991 నాటికి ముమ్మరం చేసింది.

## కువైట్ మస్జిద్‌ల్లో తెలుగు ప్రసంగం

1995 నాటికి తన కార్యక్రమాలలో వేగాన్ని అందుకున్న 'ఐపిసి' తెలుగుకు బాగా ప్రాధాన్యత నిచ్చింది. బహుభాషల్లో ప్రవీణులైన తెలుగువార్ని కువైట్‌కు ప్రత్యేకంగా

ఆహ్వానించింది. తెలుగులో ధార్మిక ప్రసంగాలు, మార్గదర్శక సంభాషణలు ముస్లింలు–ముస్లిమేతరులలో ముమ్మరం చేసింది. అప్పటి వరకు మస్జిద్ బయట సాగుతున్న ధార్మిక ప్రసంగాలను మస్జిద్‌లో చేయించాలన్న ఆలోచన 'ఐపిసి' పెద్దలకు కలిగింది. ఆ సమయంలో ఇటు ధార్మిక పరిజ్ఞానం తోపాటుగా తెలుగు–ఉర్దూ–అరబిక్ భాషల్లో పట్టు సంపాదించిన శ్రీ షేక్ ఇష్హాఖ్ అలీ, మౌలానా శ్రీ అబ్దుల్ ఖాదిర్ ఉమ్రి, మౌలానా శ్రీ మహ్మద్ ఆజం మౌదూద్ బఖ్వీ, శ్రీ షేక్ ఇస్హాఖ్ అలీ, మౌలానా శ్రీ సయ్యద్ అబ్దుల్ సలాం ఉమ్రి, శ్రీ షేక్ అబ్దుల్ సలాం ఉమ్రి, శ్రీ షేక్ మహమ్మద్ బిలాల్, మౌలానా శ్రీ హబీబ్ జమాయ్, శ్రీ మహమ్మద్ అజీజుర్రెహమాన్, మౌలానా శ్రీ సలీం జమాయ్ తదితర విద్వాంసుల సహాకారం లభించడంతో తెలుగు ప్రసంగాలు ముమ్మరమయ్యాయి.

ఈ క్రమంలో 1994 సంవత్సరంలో తొలిసారిగా తెలుగులో ధార్మిక ప్రసంగాలు మస్జిద్ ప్రవేశం చేశాయి. 'మిర్గాప్' ప్రాంతంలోని 'మస్జిద్–యే–హమద్' లో తెలుగు భాషావర్గీయులు ప్రతి గురువారం ధార్మిక సమావేశాలు జరుపుకునేందుకు కువైట్ రాజ్యం, ప్రభుత్వ వక్ఫ్‌శాఖ ద్వారా తెలుగు భాషావర్గీయులు అనుమతి పొందారు. ఆ అనుమతితో తొలి దశలో ప్రతి గురువారం 'మస్జిద్–యే–హమద్' తెలుగులో ధార్మిక ప్రసంగాలు పరంపర ఆరంభమైంది. ఈ మేరకు శ్రీ షేక్ ఇస్హాఖ్ అలీ 1994లో తొట్టతొలుత 'మస్జిద్–యే–హమద్' తెలుగులో ధార్మిక ప్రసంగం చేశారు.

ఆ తరువాతి కాలంలో మాలియా ప్రాంతంలోని 'మర్జూక్ అల్ బదర్'లో తెలుగులో ధార్మిక ప్రసంగాల కొనసాగింపుకు అనుమతి వచ్చింది. అప్పటి నుండి కువైట్‌లోని వివిధ ప్రాంతాలకు చెందిన తెలుగు బాషావర్గీయులు 'మర్జూక్ అల్ బదర్'లో ప్రతి గురువారం కుటుంబాలతో సహా సమావేశం అవుతున్నారు. ఈ సమావేశంలో ధార్మిక ప్రసంగాలు మాత్రమే కాకుండా ఇతర ప్రాంతాల నుండి విచ్చేసిన ప్రముఖులను ప్రత్యేకంగా ఆహ్వానించి జాతీయ–ఆంతర్జాతీయ ముస్లిం సమాజానికి సంబంధించిన పలు సమకాలీన అంశాల మీద విశేష ప్రసంగాల ఏర్పాటు చేస్తున్నారు.

## తెలుగులో 'ఖుద్బా ప్రసంగం'

ఆరంభంలో మస్జిద్‌లో స్థానం సంపాదించుకున్న తెలుగు ప్రసంగాలు శుక్రవారం 'జుమా నమాజ్' ను పురస్కరించుకొని ఖుద్బా ప్రసంగం కూడా తెలుగులో చేయడానికి కువైట్‌లోని తెలుగు భాషావర్గీయులు ప్రయత్నాలు ఆరంభించి అనుమతి సంపాదించుకున్నారు. ఈ మేరకు ప్రప్రధమంగా తెలుగులో 'ఖుద్బా ప్రసంగం' మిర్గాప్





ప్రాంతంలోని 'మర్జూక్ అల్ బదర్' మస్జిద్'లో 1994లో సంవత్సరంలో శ్రీ షేక్ ఇస్హాఖ్ అలీ ఆరంభించారు. ఆ తరువాత జుమా ప్రసంగాలు 'మస్జిద్–యే–హమద్' లో నిరంతరం కొనసాగాయి. ఆ కారణంగా 'మస్జిద్–యే–హమద్' తెలుగు మస్జిద్‌గా ఖ్యాతి చెందింది. ఆనాటినుండి ప్రతివారం జుమా నమాజ్‌కు ముందు 'ఖుద్బా ప్రసంగం' తెలుగులో జరగటం ఆనవాయితీ అయ్యింది. ఈ మేరకు తెలుగు ప్రసంగం చేస్తున్న ధార్మిక పండితులను ప్రోత్సహిస్తూ కువైట్ ప్రభుత్వం ప్రసంగానికి కొంత పరిహారం అందజేయడం ఆరంభించి కొనసాగిస్తున్నది.

## తెలుగు భాష కోసం పోరాటం

జుమా పాఠశాలతో ఆరంభమై, 'ఐపిసి' ఏర్పాటుతో ధార్మిక రంగంలో తెలుగు భాష ప్రాధాన్యత పెరిగింది. అయితే కువైట్‌లో తెలుగులో ఆరంభమైన ధార్మిక ప్రచారం 'ఖుద్బా ప్రసంగం' వరకు సాగుతున్న 'తెలుగు భాషా ప్రస్థానం' అంత తేలిగ్గా జరగలేదు. ఈనాడు కువైట్‌లో తెలుగు భాషకున్న స్థానాన్ని సంపాదించుకోడానికి తెలుగు భాషావర్గం పోరాటం చేయాల్సి వచ్చింది.

అటు ప్రతి గురువారం 'మర్జూక్ అల్ బదర్' మస్జిద్'లో తెలుగులో ప్రసంగాలు సాగటం మాత్రమే కాకుండా ఇటు 'మస్జిద్–యే–హమద్'లో జుమా నమాజ్ సందర్భంగా 'ఖుద్బాప్రసంగం' తెలుగులో చేయడం ఇష్టంలేని కొందరు వ్యక్తులు తెలుగులో జుమా ప్రసంగానికి అడ్డుకట్ట వేయాలనుకున్నారు. ఆ మేరకు ఆరంభమై వ్యతిరేకత 2005లో పరాకాష్టకు చేరుకుంది. అ ఏడాది కువైట్ నగరంలోని 'మస్జిద్ అదసాని'లో ఒక రోజున జుమా నమాజ్ తరువాత జరిగిన సమావేశంలో తెలుగులో ఖుద్బాప్రసంగం తెలుగులో సాగటానికి వీలులేదని తీర్మానించి, ఇకనుండి తెలుగులో ఖుద్బాప్రసంగం చేయరాదని కొందరు శాసించారు.

## తెలుగు భాషా ప్రియుల విజయం

ఈ చర్యతో ఖంగుతిన్న తెలుగు భాషావర్గీయులు ఈ తీర్మానం అప్రజాస్వామికం అంటూ విమర్శించారు. 'మస్జిద్ అదసాని' తీర్మానం వలన జుమా నమాజ్ సందర్భంగా తెలుగులో ఖుద్బాప్రసంగాల పరంపరకు తాత్కాలికంగా బ్రేకు పడింది. ఈ ఆటంకం 2005 నుండి 2009 వరకు కొనసాగింది. తెలుగు భాషావర్గీయులు ఏమాత్రం నిరాశ చెందకుండా 'మస్జిద్ అదసాని' తీర్మానాన్ని అప్రజాస్వామిక తీర్మానం అంటూ దానిని వమ్ము చేయడానికి ముమ్మరంగా అధికారిక ప్రయత్నాలు ఆరంభిచారు.

తెలుగులో ప్రసంగాల అవసరాన్ని నొక్కిచెబుతూ, ఉర్దూ భాషావర్గీయుల, తెలుగు బాషావర్గీల సంఖ్యాబలాన్ని, తెలుగుకు లభిస్తున్న అత్యధికుల మద్దతును వెల్లడి చేస్తూ, విషయాన్ని వివరిస్తూ తగు సమర్ధ వాదనలతో కువైట్ రాజ్యం వక్ఫ్‌బోర్డుకు వినతి పత్రాలు పంపారు. తెలుగు భాషావర్గీయుల ప్రతినిధివర్గాలు స్వయంగా పలు మార్లు కువైట్ రాజ్యం అధికారులను, ప్రముఖులను కలిసి తమ వాదనలు విన్పించాయి. ఆ విధంగా సాగిన ప్రయత్నాల ఫలితంగా 2009లో కువైట్ రాజ్యంలోని వక్ఫ్‌బోర్డు తెలుగులో ఖుద్బా ప్రసంగం చేయడానికి అధికారికంగా అనుమతిస్తూ, తగు ఉత్తర్వులు కూడా జారీచేసింది. ఆ ఉత్తర్వుల ఫలితంగా 2005లో నిలిపి వేయబడిన తెలుగు భాషలో 'ఖుద్బా ప్రసంగం' తెలుగు మస్జిద్‌లో 2009 సంవత్సరాన పున:ప్రారంభానికి నోచుకుంది.

## పరుగులు తీసిన 'ఐపిసి'

తెలుగు గడ్డ మీద నుండి పలువురు ధార్మిక విద్వాంసులు 'ఐపిసి'లో చేరడంతో కార్యక్రమాల విస్తరణ పరంగా 'ఐపిసి' పరుగు ఆరంభించింది. ప్రజలకు ధార్మిక పరిజ్ఞానం కలిగించడంతోపాటుగా, సామాజిక సేవలు, విద్యా సేవలు, ఆర్థిక సేవలతోపాటుగా నైతిక తోడ్పాటును విస్తృతంగా అందించసాగింది. ఆర్థిక అవసరాలు తీర్చడం మాత్రమే కాకుండా అర్హతగల వారికి ఉపకారవేతనాలు అందించడం, అవసరార్దులకు వైద్య సేవలు అందించడం, ఉద్యోగాన్వేషణలో కువైట్‌కు విచ్చేసిన వారికి ఉద్యోగాల సముపార్జనలో మార్గదర్శకత్వం వహించడం, స్థానికంగా ఉత్పన్నమయ్యే సమస్యల పరిష్కారంలో సహాయం చేయడం, న్యాయపరమైన చిక్కులు ఎదురయినట్టయితే న్యాయ సహాయం అందజేయడం లాంటి కార్యక్రమాలను 'ఐపిసి' చేపట్టింది.

పని కల్పించి పరిహారంగా బువ్వపెడుతున్న రాజ్యంలోని చట్టాలు, అక్కడి ఆచార సాంప్రదాయాల పట్ల, పని విధానం పట్ల అవగాహన కల్పించేందుకు 'ఐపిసి' ప్రత్యేక పద్ధతులను అనుసరించింది. అంతటితో ఆగకుండా వినోద-విజ్ఞాన-సాంస్కృతిక కార్యక్రమాలను ఏర్పాటు చేసి వివిధ రంగాలలో నైపుణ్యం చూపిన ప్రతిభావంతులకు బహుమతులు అందించి ప్రోత్సహించింది. ఈ విధంగా బహుముఖ కార్యక్రమాలను చేపట్టడం వలన 'ఐపిసి' ఇటు ఇండియాలో అటు కువైట్‌లో మంచి ప్రాచుర్యం పొందింది.

## మొదటి తెలుగు ధార్మిక పత్రిక 'నెలవంక'

'ఐపిసి' కార్యకలాపాలు ప్రాచుర్యం పొందేకొద్ది అవసరార్దులకు అవగాహన కోసం సాహిత్యాన్ని సృష్టించాల్సిన అవసరాన్ని 'ఐపిసి' పెద్దలు గుర్తించారు. తెలుగులో సాహిత్య సృష్టికి ప్రయత్నాలు ఆరంభించారు. ఆ ప్రయత్నాలలో భాగంగా కువైట్‌లోని








తెలుగు భాషావర్గీయులకు సమాచార దీపికగా మనగల పత్రిక 'నెలవంక' 2004 నవంబరు మాసంలో, రంజాన్ పర్వమాసం సందర్భంగా 'రంజాన్' పర్వదినం కానుకగా అందజేశారు.

ఈ నెలవంక పత్రిక నిర్వహణ కోసం గాను తెలుగు ఇస్లామిక్ పబ్లికేషన్స్, హైదరాబాద్ వారిచే వెలువరించబడుతున్న 'గీటురాయి' వారపత్రికలో పనిచేసి మంచి అనుభం సంపాదించిన ప్రముఖ రచయిత, అనువాదకులు శ్రీ ముహమ్మద్ అజీజుర్రహ్మాన్‌ను ప్రత్యేకంగా కువైట్ ఆహ్వానించారు. శ్రీ అజీజుర్రహ్మాన్ ప్రధాన సంపాదకులుగానూ, శ్రీయుతులు మౌలానా ముజాహిద్ ఖాన్ ఉమ్రి, ప్రస్తుత సంపాదకులు మౌలానా సయ్యద్ అబ్దుల్ సలాం ఉమ్రి, షేక్ బిలాల్, కుమారి తాహెరా బేగం సహాయ సంపాదకులుగా 'నెలవంక' బాధ్యతలను చేపట్టారు.

ప్రథమ సంచిక ఐదువేల కాపీలు ప్రచురించగా, పత్రికకు లభించిన అపార ఆదరణ మూలంగా పునర్ముద్రించాల్సి వచ్చింది. ఈ ప్రతిక ప్రచురణ విషయంలో ప్రత్యేక ఆసక్తి చూపిన శ్రీ ఖాలిద్ అల్ సబా అబూ అనస్, శ్రీ అబూ సవూద్ మరింత ఉత్సాహం చూపుతూ పత్రిక పట్ల ప్రత్యేకంగా దృష్టిసారించారు. అప్పటి నుండి అప్రతిహతంగా సాగుతున్న 'నెలవంక'కు ప్రస్తుత సంపాదకునిగా మౌలానా శ్రీ సయ్యద్ అబ్దుల్ సలాం ఉమ్రి వ్యవహరిస్తున్నారు. ప్రస్తుతం ఒక్క తెలుగు పత్రిక మాత్రమే కాకుండా తమిళం, మళయాలం, బెంగాలి, కన్నడ భాషా పత్రికలు 'ఐపిసి' ఆధ్వర్యంలో వెలువడుతున్నాయి. తెలుగు భాషలో ప్రసంగాలు, సాహిత్యం-నెలవంక ప్రచురణ తదితర కార్యక్రమాలతో

సాగుతున్న 'ఐపిసి' కృషి ఫలితంగా కువైట్ ప్రభుత్వం నిర్వహిస్తున్న 'కెటీవి2'లో తెలుగుతోపాటుగా మరో ఐదు భారతీయ భాషల్లో కార్యక్రమాలు ప్రసారమవుతున్నాయి. 'ఐపిసి' 15 విభాగాలుగా ఏర్పడి 14 భాషల్లో మాట్లాడగల 74 మంది బోధకులతో కార్యక్రమాలను నిర్వహిస్తూ చరిత్ర సృష్టిస్తుంది.

ఆ 'ఐపిసి' ఏర్పాటు చేసిన 'నెలవంక' మాసప్రత్రిక కోసం నా ఇంటర్వ్యూ, 'ఐపిసి' మిత్రులతో విందు సమావేశం తదితర కార్యక్రమాలు ఏర్పాటుచేసి నన్ను అతిథిగా ఆహ్వానించినందున నేను శ్రీ ఇస్హాఖ్ అలీ, మౌలానా శ్రీ అబ్దుల్ ఖాద్రి ఉమ్రి కలసి ఎడారి ప్రాంతంలో ఏర్పాటు చేసిన 'ఐపిసి' బ్రాంచి కార్యాలయం సందర్శించి ఆక్కడి నుండి నేరుగా 'ఐపిసి' ప్రధాన కార్యాలయం చేరుకున్నాం. మరో పని ఉండటంతో శ్రీ ఖాద్రి పర్యవేక్షణకు నన్ను అప్పగించి శ్రీ ఇస్హాఖ్ తాత్కాలికంగా నిష్క్రమించారు.

## 'బుష్రా' అరబిక్ పత్రిక సంపాదకునితో మాటా-మంతి

శ్రీ అబ్దుల్ ఖాద్రి ఉమ్రి 'ఐపిసి' మిత్రులకు నా రాక తెలియజేశారు. ఆ తరువాత 'బుష్రా' అరబిక్ పత్రిక సంపాదకులు శ్రీ మహమౌద్ బక్ర్ (Mr. Mahmoud Bakr) ను 'మస్జిద్ అల్ ముల్లా సాలిహ్'లో ఏర్పాటయిన 'బుష్రా' పత్రిక కార్యాలయంలో కలిశాం. ఆయనతో నా ఇంటర్వ్యూను తెలుగు పత్రిక 'నెలవంక' సంపాదకులు మౌలానా శ్రీ సయ్యద్ అబ్దుల్ సలాం ఏర్పాటు చేశారు. శ్రీ మహమౌద్ బక్ర్ ఎంతో మమ్మల్ని ఆదరంగా ఆహ్వానించారు. నా వ్యక్తిగత వివరాలతో ఇంటర్వ్యూ ఆరంభించి, భారత దేశ చరిత్ర, భారత స్వాతంత్ర్య సంగ్రామంలో ముస్లింల పాత్ర తదితర విషయాలు, నేను రాసిన గ్రంథాల వివరాలను ప్రస్తావిస్తూ పలు విషయాలను నేను ఆయనకు తెలిపాను.

శ్రీ మహమౌద్ బక్ర్‌కు ఆంగ్లం అంతగా పరిచయం లేకుంది...నాకు అరబిక్ భాషా పరిజ్ఞానం ఏమాత్రం లేనందున ఆయన కొన్ని ప్రశ్నలు అరబిక్‌లో రాసి నాకు అందజేశారు. ఆ అరబిక్ ప్రశ్నలను శ్రీ ఖాదిర్ తెలుగులోకి తర్జుమా చేయగా, వాటికి నేను సమాధానం ఇచ్చాను. ఆ సమాధానాలను శ్రీ ఖాదిర్ తెలుగు నుండి అరబిక్‌లోకి తర్జుమాచేసి శ్రీ మహమౌద్ బక్ర్ అందించారు. చివరకు 'బుష్రా' సంపాదకునితో మాటా–మంతి ముగిశాక, భారతీయ జర్నలిస్టుల పక్షాన ఆయనకు 'చరితార్థులు' ఆల్బమ్ కాపీని అందించాను. ఆ 'ఆల్బమ్'ను శ్రీ మహమౌద్ బక్ర్ ఆసక్తిగా పరిశీలించిన తరువాత శ్రీ అబ్దుల్ ఖాద్రి ఉమ్రి సహకారంతో మరికొన్ని ప్రశ్నలను అరబిక్‌లో సంధించారు. ఆ ప్రశ్నలకు కూడా శ్రీ అబ్దుల్ ఖాద్రి ఉమ్రి సహకారంతో సమాధానాలను అందించాను. ఆల్బమ్‌ను పరిశీలించిన వివరాలు తెలుసుకుని శ్రీ బక్ర్ చాలా సంతోషించారు.







03-02-2015 సాయంకాలం 'ఐపిసి' కార్యాలయంలో అరబిక్ పత్రిక 'బుష్రా' సంపాదకులు శ్రీ మహమౌద్ బక్ర తో నశీర్

## 'నెలవంక' సంపాదకులు శ్రీ సలాంతో భేటి

ఆ తరువాత 'ఐపిసి' ఇతర విభాగాలను సందర్శించాం. ఎక్కడ చూసినా కడప జిల్లాకు చెందిన యువకులు ఎక్కువగా దర్శనమిస్తున్నారు. ఈ విధంగా నన్ను కలిసినవారు చాలా మంది నాకు 'ముఖ పుస్తకం' (Face Book) ద్వారా పరిచయం ఉన్నవారు కావడం విశేషం. చివరకు నేను 'నెలవంక' మాసపత్రిక కార్యాలయంలోకి అడుగుపెడుతుండగానే 'నెలవంక' సంపాదకులు, ముఖపుస్తకం మిత్రులు మౌలానా శ్రీ సయ్యద్ అబ్దుల్ సలాం ఉమ్రి నన్ను ఆత్మీయంగా స్వాగతించారు.

శ్రీ సయ్యద్ అబ్దుల్ సలాంకు నేను దశాబ్దం క్రితమే నా గ్రంథాలు, నేను 'గీటురాయి' వారపత్రికలోని వ్యాసాల ద్వారా పరోక్ష పరిచయం. ఆ తరువాత 'ముఖపుస్తకం' ద్వారా ఆయన నాకు మరింత సన్నిహితులయ్యారు. చిత్తూరు జిల్లా పాత తురకపల్లి గ్రామానికి చెందిన శ్రీ సలాంను నేను స్వదేశంలో కాకుండా విదేశంలో చూశాను. నేను కువైట్‌లో కాలిడిన మొదటి రోజున శ్రీ పఠాన్ షౌకత్ అలీ ఖాన్ ఇంట జరిగిన 'పరిచయ విందు సమావేశం'లో మొదటిసారిగా ఆయనను కలిశాను. 'కడప ఇస్లామిక్ వెల్ఫేర్ సోసైటీ' మిత్రులు నన్ను కువైట్‌కు రమ్మని ఆహ్వానించినప్పుడు నేను కువైట్ వెడదామా? వద్దా? అన్న మీమాంసలో పడినప్పుడు, 'కాదూ–కూడదు మీరు తప్పకుండా కువైట్ రావాల్సిందే'నని పట్టుబట్టి నా మీద పెత్తనం చలాయించి కువైట్ సందర్శనకు నన్ను ఒప్పించిన మిత్రులలో శ్రీ సలాం ఒకరు.

## 'ఐపిసి' పత్రికాసంపాదకులతో ఇష్టాగోష్టి

శ్రీ అబ్దుల్ సలాంను కలిశాక ఇతర భారతీయ భాషల్లో 'ఐపిసి' నడుపుతున్న వివిధ పత్రికల సంపాదకులకు నన్ను ఆయన పరిచయం చేశారు. నా నేపథ్యం కూడా పాత్రికేయ వృత్తి కనుక ఆ సోదరులతో ఇష్టాగోష్టిగా పలు విషయాల మీద మాట్లాడాను. నేను కలసిన సంపాదక మిత్రులలో శ్రీ అబ్దుల్ సలాం మాత్రమే కాకుండా మౌలానా శ్రీ సిఫాత్ ఆలం మదని ('MISBAH' ఉర్దూ పత్రిక), శ్రీ మొహమ్మద్ అబ్దుల్ ముసవ్విర్ ('VASANTHAM' తమిళ పత్రిక), శ్రీ అబ్దుర్ రజాఖ్ నద్వి ('SANDESHAM' మలయాళం పత్రిక), మౌలానా శ్రీ మామూన్ రషీద్ ('HUDA' బెంగాలి పత్రిక) తదితరులు ఉన్నారు. ఈ సందర్భంగా మిత్రులతో సంభాషిస్తూ, 'భారత స్వాతంత్ర్యో ద్యమంలో ముస్లిం జనసముదాయాల మహోన్నత త్యాగపూరిత పాత్ర'కు సంబంధించిన సమాచారం అన్ని ప్రాంతీయ భాషల్లో రావాల్సిన అవసరం ఎంతగా ఉందో సవివరంగా వెల్లడించాను.

## 'ఐపిసి' బోధకులతో సమావేశం

ఆ కార్యక్రమం తరువాత మిత్రులు శ్రీ సలాంతో నేను మాటా–మంతి చేస్తుండగా 'ఐపిసి' లో పలు బాధ్యతలు నిర్వహిస్తున్న మిత్రులు ఒక్కొక్కరుగా రాసాగారు. ఆ రోజున 'నెలవంక' పక్షాన శ్రీ అబ్దుల్ సలాం చేయాలనుకున్న ఇంటర్వ్యూ ఇక సాధ్యం కాదని అనుకున్నాం. ఆ ఇంటర్వ్యూను 04-02-2015 పూర్తి చేద్దామనుకున్నాం.

చివరకు రాత్రి 08 గంటల ప్రాంతంలో 'ఐపిసి' బోధకులు, విద్యార్థులతో సమావేశం ఆరంభమైంది. మౌలానా శ్రీ షేక్ హబీబుర్రహమాన్ సమావేశానికి స్వాగతం పలుకగా కన్వీనర్‌గా మౌలానా శ్రీ సయ్యద్ అబ్దుల్ సలాం ఉమ్రి సమావేశానికి నన్ను పరిచయం చేశారు. మౌలానా శ్రీ అబ్దుల్ ఖాద్రి ఉమ్రి 'ఐపిసి' చరిత్ర, కార్యాక్రమాలను వివరించారు. సమావేశానికి మౌలానా శ్రీ షేక్ అబ్దుల్ సలాం ఉమ్రి అధ్యక్షత వహించారు. సమావేశంలో పాల్గొన్న మిత్రుల పరిచయాలు అయ్యాక నన్ను ప్రసంగించాల్సిందిగా అధ్యక్షులు శ్రీ ఉమ్రి కోరారు. ప్రసంగం కంటె ఇష్టాగోష్టిగా మాట్లాడుకుంటే బాగుంటుదన్న నా సలహాకు సమావేశం సమ్మతించి, అనుమతించింది.

ఈ గోష్టి చాలా ఉపయుక్తంగా, ఆసక్తిదాయకంగా సాగింది. ఈ కార్యక్రమంలో పాల్గొన్నవారంతా 'ఐపిసి'కి చెందిన ధార్మిక పండితులు, బోధకులు, విద్యార్థులు. ధార్మిక వర్గానికి చెందిన ఈ మిత్రులంతా పలు ఆసక్తికరమైన ప్రశ్నలను సంధించడం మాత్రమే కాకుండా నా సమాధానాలను, వివరణను చాలా ఆదరంగా, సానుకూలంగా స్వీకరించారు.







03-02-2015 రాత్రి కువైట్‌లోని 'ఐపిసి' ఏర్పాటు చేసిన విందు సమావేశంలో 'ఐపిసి' మరియు 'సొసైటీ' మిత్రులతో..

ఆర్ధికలేమి, ఆకలి ఆధ్యాత్మికతకు అడ్డుకాగలవన్న నా వివరణను అంగీకరిస్తూ, ఇహపరలోకాల సాఫల్యానికి అన్ని రంగాలలో మానవుడు ఉన్నతంగా ఎదగడానికి కృషి సాగించాలన్న నా ఆలోచనను పూర్తిస్థాయితో సమ్మతించారు. ప్రాపంచిక వ్యవహారాలలో మానవ జీవితాన్ని ఆచరణాత్మకంగా శాసించగల రాజ్యాధికారంలో భాగం లేకుండా ఏ జన సమూహమైనా ఉన్నతి సాధించలేదన్న నా వివరణను వారు నాతో పంచుకున్నారు.

## 'ఐపిసి' మిత్రుల ఆత్మీయ ఆర్థిక ఆదరణ

స్వదేశంలో నా అనుభావాల దృష్ట్యా నాలో ఏర్పడిన స్థిరాభిప్రాయాలకు భిన్నంగా ఉదార భావనలతో, ఆచరణాత్మక వైఖరిని వెల్లడించిన ధార్మిక పండితులు, బోధకులు, విద్యార్థుల తీరు నన్ను బాగా అకట్టుకుంది. ఈ 'ఐపిసి' మిత్రులలో అత్యధికులు నా గురించి, నా అభిప్రాయాల గురించి, నా రచనల గురించి 'ముఖ పుస్తకం' ద్వారా ముందుగా తెలిసికొని ఉన్నవారు కావడంతో ఎవ్వరూ కూడా నాకు అపరిచయస్తులు అన్పించలేదు. ఆ కారణంగా ఆ సోదరులు నా అత్యంత సన్నిహిత మిత్రుల్లా ప్రేమాభిమానాలను చూపుతూ గడిపారు. సుమారు రెండు గంటలపాటు సాగిన ఈ సమావేశంలో 'ఐపిసి' మిత్రులు నన్ను ప్రేమపూర్వకంగా సత్కరించారు. ఈ ధార్మిక పండితులు, బోధకులు కేవలం తమ తమ 'దువా'లతో మాత్రమే సరిపెట్టకుండా, నా చరిత్ర రచనా వ్యాసంగాన్ని మరింత ముమ్మరంగా కొనసాగించాలని ఆకాంక్షిస్తూ అంతాకలసి సమకూర్చిన 'పర్సు'ను కూడా నాకు అందించి ఆర్థికంగా ఆదరించారు.

ఈ సందర్భంగా మౌలానా శ్రీ జఫ్రుల్లా ఖాన్ నద్వి తాను రచించిన ధార్మిక గ్రంథాల పూర్తి సెట్టును నాకు బహుకరించగా, శ్రీ సలాం 'ఐపిసి' ప్రచురించిన గ్రంథాలు, తాను తెచ్చిన పలు ధార్మిక ప్రసంగాల, ఇతర కార్యక్రమాల 'సిడి'లను అందించగా ఇతర మిత్రుల పలు ఇతర బహుమతులతో తమ ప్రేమాభిమానాలను వ్యక్తంచేశారు. అత్యంత ఉత్సాహపూరితంగా జరిగిన ఈ కార్యక్రమంలో శ్రీయుతులు బిలాల్, మౌలానా షేక్ సలీం ఉమ్రి, మౌలానా అహ్మద్ ముహమ్మద్, మౌలానా సలీం జమాయ్, మౌలానా జఫ్రుల్లా ఖాన్ నద్వి, 'సొసైటీ' మిత్రులు శ్రీ షేక్ న్యామతుల్లా, శ్రీ పఠాన్ షౌకత్ అలీ ఖాన్, శ్రీ అయ్యూబ్ ఖాన్, శ్రీ నిజాముద్దీన్ తదితరులు పాల్గొన్నారు.

సుమారు మూడున్నర గంటలకు పైగా సాగిన ఆత్మీయ కార్యక్రమం మరి కొంత సేపట్లో ముగియనున్న సమయంలో శ్రీ షేక్ ఇస్హాఖ్ అలీ, ఇతర 'సొసైటీ' మిత్రులు కూడా 'ఐపిసి' కార్యాలయం చేరుకున్నారు. అంతా కలసి 'ఐపిసి' మిత్రులు ఏర్పాటు చేసిన విందు కార్యక్రమంలో పాల్గొన్నాం. విందు పూర్తయ్యాక రాత్రి పదిన్నర ప్రాంతంలో 'ఐపిసి' మిత్రుల వద్ద ప్రధానంగా మౌలానా శ్రీ సయ్యద్ అబ్దుల్ సలాం వద్ద శెలవు తీసుకుని, ఆ సమావేశం నాటి మధుర స్మృతులను మూటగట్టుకుని శ్రీ ఇస్హాఖ్ అలీతో కలసి రాత్రి పదకొండున్నర ప్రాంతంలో బసకు చేరుకున్నాను.

మాకు 04-02-2015న ముందుగా నిర్ణీతమైన పలు కార్యక్రమాలున్నాయి. ఆ కార్యక్రమాలకు సకాలంలో హజరయ్యేందుకు ఉదయాన్నే మేల్కొన్నాం. యుధావిధిగా నేను నా కుటుంబంతో మాట్లాడటం అయ్యాక ఇరువురం కలసి కువైట్ నగరంలోకి బయలు దేరాము. మార్గమధ్యంలో శ్రీ ముస్తఫా రెడ్డి నుండి ఫోన్ వచ్చింది. అల్పాహారం ఎక్కడ చేద్దామని అడుగుతున్నారు. ఆ ఛాయిస్ ఆయనకే వదిలెయ్యగా మంచి పాకిస్థానీ వంటకాలను రుచి చూద్దామంటూ ఆయన సూచించిన ఖైతాన్ ప్రాంతంలోని పాకిస్థాన్ దేశీయులు నిర్వహిస్తున్న ఒక హోటల్ కు మేము చేరుకున్నాం.

## 'రోమాలు నిక్కబొడుచుకున్నాయన్నా'

అంతా కలసి పాకిస్థానీయులచే నిర్వహించబడుతున్న ఆ చిన్నపాటి హోటల్‌లో అల్పాహారం చేస్తుండగా భారత గణతంత్ర దినోత్సవ సంబరాల నాటి బహిరంగ సభలోని నేను చేసిన ప్రసంగం గురించి శ్రీ ముస్తఫా ఉత్సాహంగా మాట్లాడటం ఆరంభించారు. నా ప్రసంగం అద్యంతం ఆకట్టుకుందని అన్నారు. 'మన్యం మొనగాడు అల్లూరి సీతారామ రాజు, అంటూ అలనాటి చరిత్ర, ఆనాడు అల్లూరికి సహకరించిన శ్రీ షేక్ మదీనా, శ్రీ ఫజులుల్లా ఖాన్‌ల సాహసం, మాతృభూమి పట్ల వారికున్న ప్రేమాభిమానాల గురించి విశ్లేషిస్తుంటే నా రోమాలు నిక్కబొడుచుకున్నాయన్నా' అంటూ శ్రీ ముస్తఫా ఉద్వేగంగా








**03-02-2015 రాత్రి కువైట్‌లోని 'ఐపిసి' ఏర్పాటు చేసిన విందు సమావేశంలో నన్ను సన్మానిస్తున్న మిత్రులు**

తన అనుభవాన్ని వెల్లడించారు.

'ఆనాటి సభాకార్యక్రమం ప్రస్తావన వచ్చినప్పుడల్లా తెలుగు బిడ్డలంతా మీ ప్రసంగం గురించి చర్చించుకుంటున్నారు...నశీర్ భాయ్...మీ ప్రసంగం...మీరు ప్రసంగించిన తీరు...మీరు ఉపయోగించిన భాషా అందర్నీ బాగా ఆకట్టుకుంది' అని శ్రీ ముస్తఫా అన్నారు. 'మన మాతృభాషలో సామాన్య ప్రజలకు అందుబాటులో లేని గొప్ప సమాచారం అందించారు' అంటూ ఆయన నన్ను, నన్ను కువైట్‌కు ఆహ్వానించిన 'కడప ఇస్లామిక్ వెల్ఫేర్ సొసైటీ' నాయకులు శ్రీ షేక్ ఇస్హాఖ్ అలీని, 'సొసైటీ' కువైట్ నాయకులను అభినందించారు. ఆ తరువాత అల్పాహారం పూర్తయ్యేంత వరకు శ్రీ ముస్తఫా రెడ్డి నా ప్రసంగం గురించి అద్దూ, అలుపులేకుండా మాట్లాడుతూనే ఉన్నారు.

అల్పాహారం కోసం మేము ప్రత్యేకంగా విచ్చేసిన ఈ పాకిస్థాన్ హోటల్ మన హోటల్స్‌కు భిన్నంగా ఏమీలేదు. అంతేకాదు మేము ఆరగించిన పాకిస్థాన్ వంటకాలకు మన వంటకాలకు పెద్ద తేడాగాని, ప్రత్యేకత గాని నాకేమి అన్పించలేదు.

## స్వదేశీ వాగ్దానం విదేశంలో తీరింది

శ్రీ ముస్తఫా రెడ్డి ఇండియా వచ్చియున్నప్పుడు శ్రీ అహమ్మద్ ద్వారా నాకు తొలిసారిగా పరోక్షంగా పరిచయం అయ్యారు. ఆ సందర్భంగా కడప నుండి మూడుసార్లు నాతో ఫోన్‌లో మాట్లాడారు. నా చరిత్రరచన, రచన వెనుకగల లక్ష్యాలు, నా ప్రయత్నాలను గుచ్చి గుచ్చి అడిగారు. నేను యధాలాపంగా విషయాలు చెప్పాను. ఆ విషయాలను

పూర్తిగా విన్నాక, మీ కృషికి నా చిరు సహాయం ఏదైనా అందించ వచ్చా ? అని ప్రశ్నించారు. ఆ ప్రశ్నకు సమాధానంగా 'చరితార్థులు' ఆల్బమ్ కాపీలను తీసుకుని మీ జిల్లాలోని గ్రంథాలయాలకు మీ కానుకగా ఇవ్వండి అన్నాను. ఆయన సంతోషం వ్యక్తంచేస్తూ, అలా కాదులేండి, రానున్న గ్రంథ ప్రచురణకు నా ఆర్థిక సహకారాన్ని వినియోగించుకోండి అన్నారు. ఆ మరుసటి రోజున ఆయన కువైట్ వెళ్ళిపోయారు. ఆనాడు తాను నాకు చేసిన వాగ్దానం మర్చిపోకుండా ప్రస్తుతం కువైట్‌లో నాకు అందజేశారు. ఆయనకు నా ధన్యవాదాలు తెలిపాను. అనంతరం శ్రీ ముస్తఫా రెడ్డి నుండి శెలవు తీసుకుని ముందుగా నిర్ణయించబడిన కార్యక్రమంలో పాల్గొనడానికి బయలుదేరాం.

## గొంతు దిగని ఏలకుల పానీయం

కువైట్ నగరంలోని 'జమియత్ అల్ బషాయిర్ అల్ ఖైయిర్' సంస్థ కార్యాలయంతో శ్రీ ఇస్హాఖ్ అలీ మిత్రులు శ్రీ మొహ్మద్ ఖాలిద్ అజ్మీని కలిశాం. ఆయన ఢిల్లీ నివాసి. ప్రముఖ విశ్వవిద్యాలయాలలో ఉన్నత విద్యాభ్యాసం చేసిన ఆయన ప్రస్తుతం కువైట్‌లోని 'జమియత్ అల్ బషాయిర్ అల్ ఖైయిర్' ఉన్నతాధికారిగా బాధ్యతలు నిర్వహిస్తున్నారు. ప్రముఖ వ్యాపారవేత్త శ్రీ మొహమ్మద్ హోష్‌దార్ ఖాన్ కార్యాలయంలో 01-02-2015 రాత్రి జరిగిన భారతీయ మిత్రుల సమావేశానికి కన్వీనర్‌గా ఆయన వ్యవహరించారు. ఆ సమావేశంలో నేను ప్రధాన ప్రసంగం చేశాను. ఆయన నన్ను చూడగానే సంతోషం వ్యక్తంచేస్తూ ఎంతో ప్రేమగా ఆహ్వానించి, తన సిబ్బందిని పిలిచి అరబిక్‌లో మాట్లాడారు. ఆ మీదట ఆయన సహాయకుడు అతి చిన్న కప్‌లో ప్రత్యేక పానీయాన్ని తెచ్చి మా ముందు పెట్టారు. అది ఏలకులతో తయారు చేసిన ప్రత్యేక పానీయం. ఆ పానీయం సేవనకు ప్రత్యేకించి చిన్న చిన్న కప్పులుంటాయి. ఇప్పటివరకు సాధారణ బ్లాక్ టీ తాగి ఉంటారు కనుక కొత్తదనాన్ని రుచి చూడమంటూ పానీయం సేవనానికి నన్ను శ్రీ అజ్మీ ఆహ్వానించారు. మంచి సువాసనలను వెదజల్లుతున్న ఆ గాఢమైన పానీయంలోని ఘాటుతనం వలన నేను దానిని ఏమాత్రం స్వీకరించలేక పోయాను. ఈ పానీయాన్ని కువైట్ ప్రజలు, ఈజిప్టు వారు, ప్రధానంగా అరబ్బులు అతి ఇష్టంగా సేవిస్తారంటూ శ్రీ ఇస్హాఖ్ అలీ వివరిస్తూ తన వంతు పానీయాన్ని ఆయన పూర్తిచేశారు.

## 'చరితార్థులు' ప్రచురణ వాగ్దానం పున:ప్రకటన

ఈ సందర్భంగా శ్రీ మొహ్మద్ ఖాలిద్ అజ్మీ మాట్లాడుతూ, శ్రీ హోష్‌దార్ ఖాన్ కార్యాలయంలో నా ఆల్బమ్‌కు సంబంధించిన చేసిన వాగ్దానాన్ని మళ్ళీ పున:ప్రకటించారు.







అతిథి పట్ల అతి పెద్ద మనస్సును ఆచరణాత్మకంగా ప్రదర్శించిన అతి చిన్న వ్యక్తి శ్రీ కడప యూసుప్ ఇదిగో ఈయనే సుమా. కపడ జిల్లా నుండి విచ్చేసిన శాసనసభ్యులు శ్రీ మేడా వెంకట మల్లికార్జున రెడ్డిని 30-01-2015న 'తెలుగు మస్జిద్' వద్ద కలసిన సందర్భంగా ఆయన ముఖంలో ఆనందం తాండవిస్తూందో చూడండి.

ఆ ఆల్బమ్ అవసరం ఈనాడు చాల ఉన్నందును, అద్భుతమైన 'చరితార్థులు' ఆల్బమ్‌ను ఇటు హిందీలో గాని, అటు ఉర్దూలో గాని తర్జుమా చేయించండి. ఆ ఆల్బమ్‌ను ఉర్దూ-ఆంగ్లం లేక హిందీ-ఆంగ్లంలో ముద్రించేట్టయితే, ఆ ముద్రణకు అయ్యే వ్యయం అంతా మేము భరించగలమని శ్రీ ఖాలిద్ అజ్మీ పునరుద్ఘాటించారు. ఆ మాటకు శ్రీ ఇస్హాఖ్ అలీ సమాధానమిస్తూ ఉర్దూ-హిందీ తర్జుమా కార్యక్రమం అరంభించి, అది కాస్తా పూర్తి కాగానే వదాన్యుల సహకారం స్వీకరించగలమని తెలిపారు.

## 'అతి చిరు' ఉద్యోగి 'అతి పెద్ద' మనస్సు

'లజ్న ముస్లిం ఆఫ్రికా' ఆఫీస్‌కు వెళ్ళాం. ఆ కార్యాలయంలో సహాయకుడిగా గత 20 నుండి పనిచేస్తున్న కడప జిల్లా నివాసి శ్రీ కడప యూసుఫ్‌ని, ఆ కార్యాలయం లోని ఆయన గదిలో నేను శ్రీ ఇస్హాఖ్ అలీ కలిశాం. ఆయన ఆయన కుటుంబ సభ్యులు అంతా కువైట్‌లోని వివిధ సంస్థలలో ఉద్యోగాలు చేస్తున్నారు. ఆయన నన్ను చూడగానే ఎంతో ఆదరంగా ఆహ్వానించారు. నా రాకతో ఎంతో సంతోషిస్తూ, తెలుగు మస్జిద్‌గా ఖ్యాతిగాంచిన మస్జిద్ అల్ హమద్‌లో జరిగిన సమావేశంలో నా ప్రసంగం విన్నట్టు తెలిపారు. ఆ తరువాత 30వ తేది నాటి సభలో నేను చేసిన ప్రసంగం కూడా ఆయన పూర్తిగా విన్నారట. 'మన పెద్దల త్యాగాలను చాలా గొప్పగా చెప్పారు సార్. నాకు చాలా సంతోషం కల్గింది' అంటూ ఎంతో సంబరపడి పోయారు.



'అల్ ఫజర్ ప్రింటింగ్ ప్రెస్' అధినేత శ్రీ ఖాలిద్ మొహమ్మద్ అల్ సుభాయితో ఆయన కార్యాలయంలో.

మా కోసం ప్రత్యేకంగా పాలు లేని కువైట్ టీ తయారు చేశారు. ఏలకుల పానీయం రుచి వల్ల కాబోలు నాకు ఏమీ తీసుకో బుద్దికాలేదు. వద్దన్నాను. బలవంతం చేశారు. అయినా ససేమిరా అన్నాను. ఆయన మిన్నకుండి పోయారు. కుటుంబం క్షేమ సమాచారాలు అడగటం పూర్తయ్యాక బయలుదేరబోతుండగా ఒక్కక్షణం ఆగమన్నారు. ఒక ఐదు కువైట్ దీనార్ల కరెన్సీని తెచ్చి నా పాకెట్‌లో పెట్టబోయారు. నేను అభ్యంతం పెడుతూ వద్దన్నాను. నా మాట వినలేదు. 'మీరు టీ కూడా తాగలేదు. నా ఆతిథ్యాన్ని అంగీకరించలేదు. బ్రతిమలాడినా నా మాట వినలేదు. ఇది నా బహుమతి... మీరు తీసుకోవాల్సిందే' అంటూ ఆయన పట్టుబట్టారు. ఏం చేయమంటారంటూ, నా కువైట్ పర్యటన ఆసాంతం నాకు మార్గదర్శిగా తోడ్పాటిచ్చిన శ్రీ ఇస్హాఖ్ అలీ వైపు నిస్సహాయంగా చూశాను. అంగీకరించమని శ్రీ ఇస్హాఖ్ సైగ చేశారు. శ్రీ కడప యూసుఫ్ నుండి బహుమతిని స్వీకరించాను. చివర్న ఆయనకు నేను ప్రత్యేకంగా ధన్యవాదాలు తెలిపి ఆక్కడి నుండి ఇరువురం బయలుదేరాం.

## ప్రింటింగ్ ప్రెస్ అధినేతతో ములాఖత్

మిర్గాప్ ప్రాంతంలోని 'అల్ ఫజర్ ప్రింటింగ్ ప్రెస్' అధినేత శ్రీ ఖాలిద్ మొహమ్మద్ అల్ సుభాయి కార్యాలయం వెళ్ళాం. శ్రీ ఖాలిద్ బహుగ్రంథ రచయిత, ప్రచురణకర్త, మంచి చరిత్రాభిలాషి అని శ్రీ ఇస్హాఖ్ తెలిపారు. అభివాదాలు ప్రతి అభివాదాలు పూర్తయ్యాక శ్రీ ఇస్హాక్ అరబిక్‌లో నా గురించి, నా గ్రంథాలు ప్రస్తుత ఆల్బమ్ 'చరితార్థులు' గురించి ఆయనకు వివరించారు. ఆల్బమ్‌ను చూసి ఆశ్చర్యాన్ని వ్యక్తంచేశారు. ఆల్బ్‌మ్‌ను ఏలా రూపొందించారంటూ, ప్రింటిగ్ తదితర సమాచార






కువైట్‌లో ప్రఖ్యాత 'లూల్వా అల్ నాస్సర్ మస్జిద్' అంతర్భాగం.

పరమైన, సాంకేతిక పరమైన వివరాలు అడిగారు. ఆయన ప్రశ్నలకు జవాబుగా, మా దేశంలోని హిందూ-ముస్లింల ప్రజానీకం మధ్యన స్నేహసంబంధాలను మరింతగా పటిష్టం చేయాలన్న సంకల్పతో నా రచనా వ్యాసాంగం సాగుతుందని చెప్పాను. అంతర్జాతీయ చరిత్ర, రాజకీయాలను ప్రస్తావిస్తూ మంచి గ్రంథం తెచ్చారంటూ రచయితగా నన్ను, ఈ ఆల్బమ్‌ను కువైట్‌లో ఆవిష్కరింప జేసినందుకు శ్రీ ఇస్హాఖ్ అలీని అభినందించారు. మా ప్రచురణ సంస్థ 'ఆజాద్ హౌస్ ఆఫ్ పబ్లికేషన్స్' పక్షాన 'చరితార్థులు' ఆల్బమ్‌ను శ్రీ ఖాలిద్‌కు బహూకరించి, ఆయన నుండి శెలవుతీసుకున్నాం.

## ఇస్లామిక్ మెడిసన్ రిసెర్చ్ సెంటర్ సందర్శన

ఆ పాటికి మధ్యాహ్నం అయ్యింది. ఆకలి దంచేస్తుంది. ఆహారం కోసం ఈసారి బంగ్లాదేశ్ హోటల్‌కు వెళ్ళాం. అక్కడ చేప కూరలతో భోజనం ముగించి మళ్ళీ రహదారుల మీద పడ్డాం. ఆ తరువాత మరోకరిని కలవడానికి ఇంకా సమయం ఉన్నందున 'లూల్వా అల్ నాస్సర్ మస్జిద్' చూపిస్తానంటూ శ్రీ ఇస్హాక్ అలీ తన కారును ముందుకు ఉరికించారు. కువైట్‌లోని షువైఖ్ ప్రాంతాన గల 'లూల్వా మస్జిద్' చేరుకున్నాం. అతి విశాలమైన ఆవరణలో'ఇస్లామిక్ మెడిసన్ రిసెర్చ్ సెంటర్'లో భాగంగా మస్జిద్ నిర్మించారు. అందమైన కళా నైపుణ్యంతో కూడిన పైకప్పు, సుందరమైన గోడలతో ఆకర్షణీయంగా 12వందల 267 చదరపు మీటర్ల స్థలంలో మస్జిద్ రూపొందింది. ఈ మస్జిద్‌లో 15వందల మంది నమాజ్ చేసుకోవచ్చు. మహిళలకు అన్ని సౌకర్యాల ప్రత్యేక అంతస్థు ఏర్పాటుంది.

ఈ 'ఇస్లామిక్ మెడిసన్ రిసెర్చ్ సెంటర్'ను ప్రధానంగా ఇస్లామిక్ వైద్య విధానం మీద పరిశోధనలు జరపడానికి నిర్మించారు. ఈ సెంటర్, ఇందులో ఉన్న లూల్వా అల్


భారతీయ ప్రముఖుల మీద డాక్టర్ ఖాలిద్ రాసిన ఆరబిక్ గ్రంథం బహుకరణ

నాస్సర్ మస్జిద్ మొత్తం 15 వేల 500 చదరపు మీటర్ల వైశాల్యంలో నిర్మితమై ఉన్నాయి. ఈ నిర్మాణాల కోసం మొత్తం 7.5 మిలియన్ కువైట్ దీనార్లు వ్యయం చేశారు. ఇస్లామిక్ వైద్య శాస్త్రాన్ని పూర్తి పునరుద్ధరించాలన్న లక్ష్యంలో 'ఇస్లామిక్ మెడిసన్ రిసెర్చ్ సెంటర్' పనిచేస్తుంది. కువైట్ ప్రభుత్వ ప్రజారోగ్యశాఖ ఆధ్వర్యంలోని ఈ సెంటర్ ద్వారా చికిత్సలకు ఏర్పాటు మాత్రమే కాకుండా పలు పరిశోధనలకు తగిన ఏర్పాట్లు ఉన్నాయి.

## భారతీయ ప్రముఖుల మీద అరబిక్ గ్రంథం

ప్రతిష్టాత్మక 'ఇస్లామిక్ మెడిసన్ రిసెర్చ్ సెంటర్', 'లూల్వా అల్ నాస్సర్ మస్జిద్' ల సందర్శన తరువాత కువైట్‌కు చెందిన యువ చరిత్రకారుడు డాక్టర్ ఖాలిద్ సాలెమ్ అల్ సద్దామిని కలిసేందుకు బయలుదేరాం. మేముంటున్న 'ఖేతాన్' ప్రాంతంలోని ఆజమీ మస్జిద్‌లో కలుద్దామని ముందుగా అనుకున్నాం. మేము ముందుగా మస్జిద్ వద్దకు చేరుకున్నాం. అసర్ నమాజ్ తరువాత డాక్టర్ ఖాలిద్ సాలెమ్ అల్ సద్దామి మమ్మల్ని వెతుక్కొంటూ వచ్చారు. మేమంతా మస్జిద్‌లో ఓ మూల కూర్చున్నాం. పరిచయాలు ఆంగ్లం-అరబిక్‌లో అయ్యాయి. నా గురించి, నా గ్రంథాల గురించి, ఆల్బమ్ 'చరితార్థులు' గురించి శ్రీ ఇస్హాఖ్ అలీ అరబిక్‌లో వివరించారు.

ఆ తరువాత యువ రచయిత శ్రీ ఖాలిద్ తన వెంట తెచ్చిన 'ఎ లామ్ ఇస్లామియా మిన్ షిబ్ ఎ హిల్ ఖర్రాతి హిందియా' (A Lam Islamiya Min Shib A Hil Qharrathi Hindiya) గ్రంథాన్ని నాకు చూపారు. భారత దేశంలోని బాబర్ చక్రవర్తితో ఆరంభించి మహమ్మద్ అలీ జిన్నా వరకు పలువురు ముస్లిం ప్రముఖుల వివరాలతో ఈ గ్రంథాన్ని






'చరితార్థులు' ఆల్బమ్ డాక్టర్ ఖాలిద్‌కు బహుకరణ

ఆమన రూపొందించారు. ఈ గ్రంథంలో కొన్ని చిత్రపటాలు ఉన్నాయి. ఈ గ్రంథం రచించడానికి రెండు సంవత్సరాలు పట్టిందని, ఈ సందర్భంగా ఇండియాను సందర్శించానని శ్రీ ఖాలిద్ చెప్పారు. భారతీయ ప్రముఖుల మీద ఎందుకు రాయాల్సించిందని అడగ్గా, భారత దేశం చరిత్ర చాల ఆసక్తిదాయకంగా ఉంటుందని, ఆయా భారతీయ ప్రముఖుల గురించి చదువుతుంటే ఆ చరిత్రను కువైటీలకు పరిచయం చేయాలన్పించిందని అన్నారు. చివరగా డాక్టర్ ఖాలిద్ తన గ్రంథాన్ని బహుమతిగా నాకు అందించారు.

డాక్టర్ ఖాలిద్ మాటలు మాకెంతో సంతోషాన్ని కల్గించాయి. ఆ తరువాత మా వద్ద ఉన్న 'చరితార్థులు' ఆల్బమ్‌ను ఆయనకు చూపించాం. ఆ ఆల్బమ్‌ను చాలా సేపు క్షుణ్ణంగా పరిశీలించారు. స్వాతంత్ర్యసమర యోధుల గురించి ఆంగ్లంలో పొందుపర్చిన వివరాలను, నా ముందు మాటను డాక్టర్ ఖాలిద్ చూశారు. చరితార్థుల్లోని చివరి మొగల్ చక్రవర్తి బహదూర్ షాహ్ జఫర్ చిత్రపటం చూసి, 1857నాటి పోరాటంలో ఆయన పాత్ర గురించి అడిగారు. చరితార్థులు ఆల్బమ్‌ను 'గొప్ప గ్రంథం' అంటూ ప్రశంసించారు.

ఈ ఆల్బమ్‌ను ఎలా తయారు చేశారు?...ఎలా రాశారు?...ఎన్ని సంవత్సరాలు పట్టింది? ...అంత మంది సమాచారం ఎలా రాబట్టారు? అని ప్రశ్నిస్తూ ఇతర వివరాలను అడిగారు. డాక్టర్ ఖాలిద్ ప్రశ్నలకు నేను అంగ్లంలో సమాధానాలు చెబుతుండగా, ఆ సమాధానాలను శ్రీ ఇస్హాఖ్ అలీ అరబిక్‌లో చెప్పారు. చివరకు 'మా భారతీయ ప్రముఖుల గురించి మీరు అరబిక్‌లో రాసినందుకు ధన్యవాదాలు...మా భారతీయుల పక్షాన 'చరితార్థులు' ఆల్బమ్‌ను మీకు బహుమతిగా అందజేస్తున్నాం' అంటూ ఆల్బమ్‌ను



'నెలవంక' సంపాదకులు మౌలానా సయ్యద్ అబ్దుల్ సలాం ఉమ్రి ఇంటర్వ్యూ

అందించాం. డాక్టర్ ఖాలిద్ సంతోషం వ్యక్తంచేస్తూ ఆల్బమ్‌ను స్వీకరించి ధన్యవాదాలు తెలిపారు. ఆ తరువాత మరికొంత సేపు మాటా-మంతి జరిగాక డాక్టర్ ఖాలిద్ నుండి శెలవు పుచ్చుకున్నాం.

## 'నెలవంక' సంపాదకుని ఇంటర్వ్యూ

డాక్టర్ ఖాలిద్‌తో సంభాషణ పూర్తయ్యాక 'ఐపిసి' కార్యాలయంలో 'నెలవంక' సంపాదకులు మౌలానా శ్రీ సయ్యద్ అబ్దుల్ సలాం ఉమ్రి వినతి మేరకు అంగీకరించిన నా ఇంటర్వ్యూ కోసం 'ఐపిసి' కార్యాలయానికి బయలుదేరాం. శ్రీ ఇస్హాఖ్ అలీ నన్ను 'ఐపిసి' కార్యాలయం వద్ద వదిలేసి, ఇంటర్వ్యూ పూర్తయ్యాక 'కడప ఇస్లామిక్ వెల్ఫేర్ సొసైటీ' కువైట్ కార్యాలయానికి శ్రీ సలాంతో కలసి రమ్మని చెప్పి అక్కడి నుండి వెళ్ళిపోయారు. నేను 'ఐపిసి' కార్యాలయం భవనం లోని 'నెలవంక' తెలుగు పత్రిక విభాగం వద్దకు వెళ్ళేసరికి శ్రీ సలాం నాకోసం ఎదురు చూస్తున్నారు.

నా గురించి, నా గ్రంథాల గురించి, నా లక్ష్యాల గురించి పూర్తి అవగాహన కలిగిన శ్రీ సలాం మళ్ళీ ఆయా విషయాలను వెల్లడిచేయగల ప్రశ్నలను సంధించకుండా తెలుగు భాష, తెలుగు భాషా ప్రియుల, తెలుగు సాహిత్య గ్రంథాల గురించి, ఆధునిక పోకడల గురించి అడిగారు. చివరకు 'చరితార్దులు' ఆల్బమ్, నా ఇతర గ్రంథాలు, నా భవిష్యత్తు ప్రణాళిక, నా కువైట్ సందర్శన విశేషాలను తెలుసుకున్నారు. రాత్రి ఎనిమిదిన్నర





కాసాగింది. మా ఇంటర్వ్యూ ముగించి శ్రీ అబ్దుల్ సలాంతోపాటుగా నేను కూడా 'సొసైటీ' కార్యాలయానికి బయలుదేరాను. ఆ కార్యాలయం ఖైతాన్ ప్రాంతంలో ఉంది. ఆ కార్యాలయం ఉన్న పలు అంతస్థుల భవనంలో 'సొసైటీ' కువైట్ గౌరవాధ్యక్షులు శ్రీ షేక్ న్యామతుల్లా, 'సొసైటీ' గౌరవ సంచాలకులు శ్రీ మహ్మద్ హనీఫ్ మాత్రమే కాకుండా మౌలానా శ్రీ సయ్యద్ అబ్దుల్ సలాం ఉమ్రి కూడా నివాసం ఉంటున్నారు. ఆ భవనం పైభాగంలో ఏర్పాటయిన 'సొసైటీ' కార్యాలయంలో 'సొసైటీ' బాధ్యులంతా సమావేశమై నా కోసం ఎదురు చూస్తున్నారు. నేను మిత్రులు శ్రీ సలాం సకాలానికి చేరుకున్నాం.

## 'సొసైటీ' కార్యాలయంలో సమీక్షా సమావేశం

భారత గణతంత్ర దినోత్సం-కడప ఇస్లామిక్ వెల్ఫేర్ సొసైటీ 30వ వార్షికోత్సవ సంబరాల నిర్వహణ తీరు తెన్నుల మీద సమీక్షా సమావేశం అధ్యక్షులు శ్రీ షేక్ న్యామతుల్లా అధ్యక్షతన ఆరంభమైంది. ఈ సమావేశంలో 'సొసైటీ' వ్యవస్థాపక అధ్యక్షులు శ్రీ ఇస్హాఖ్ అలీ, ప్రధాన కార్యదర్శి శ్రీ పఠాన్ షౌకత్ అలీ ఖాన్, సంచాలకులు శ్రీ మహ్మద్ హనీఫ్ లతోపాటుగా శ్రీ పి మస్తాన్ సాహెబ్, శ్రీ షేక్ అన్వర్, యువనాయకులు శ్రీ సయ్యద్ అజీజ్ ఖాద్రి, శ్రీ నిజాముద్దీన్, శ్రీ షేక్ మహ్మద్ గౌస్, శ్రీ షేక్ అన్వర్, శ్రీ యండి. రఫీ, శ్రీ షేక్ ఇంతియాజ్, శ్రీ పి. నవాబ్ ఖాన్ తదితరులు పాల్గొన్నారు.

భారత గణతంత్ర దినోత్సవ సంబరాలు, 'సొసైటీ' 30వ వార్షికోత్సవాన్ని పురస్కరించుకుని సాగిన బహిరంగ సభ తీరుతెన్నుల మీద చర్చ జరిగింది. చివరకు సభ బాగా జరిగిందని, సభ్యుల కృషి ఫలించిందని, సభలో సమర్థులైన అతిథులు పాల్గొనడంతో విజయవంతమయ్యిందని సమావేశం అభిప్రాయపడింది. ఈ సభకు గతంలో ఎన్నడూ లేని విధంగా 12 వందలకు పైగా సభికులు హాజరయ్యారని సంతోషం వ్యక్తం అయ్యింది. అధిక వ్యయ ప్రయాసలను భరించి కువైట్‌లోని 'సొసైటీ', సభ్యులు సాగించిన శ్రమకు సత్ఫలితాలు లభించాయని సభ్యులు ఆనందం వ్యక్తంచేశారు.

ఈ కార్యక్రమం సందర్భంగా 'సొసైటీ' వెలువరించిన సావనీర్‌కు మంచి స్పందన లభించిందని, సావనీర్ రూపకల్పనకు కృషి చేసిన ప్రతి ఒక్కరికి, సభా కార్యాక్రమం విజయవంతమయ్యేందుకు తోడ్పడిన ప్రతి ఒక్కరికి సమావేశం కృతజ్ఞతలు వెల్లడించింది. ఆహ్వానించిన వెంటనే అధిక ప్రయాసకోర్చి విదేశానికి విచ్చేసిన ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ చీఫ్ విప్ శ్రీ మేడా వెంకట మల్లికార్జున రెడ్డి, ఆయన సహచర బృందానికి, శ్రీ సయ్యద్ నశీర్ అహమ్మద్‌కు సమావేశం ధన్యవాదాలు తెలిపింది.

## నా వీడ్కోలు 'విందు' సమావేశం

చివరకు, మరుసటి రోజున అనగా 05-02-2015న, కువైట్ నుండి నేను స్వదేశం వెడుతున్నందున, ఈ సమీక్షా సమావేశం కాస్తా నా 'వీడ్కోలు సమావేశం'గా రూపాంతరం చెందింది. సమావేశానికి శ్రీ షేక్ ఇస్హాఖ్ అలీ అధ్యక్షత వహించారు. సమావేశంలో ముందుగా బహిరంగ సభలో సాగిన నా ప్రధాన ప్రసంగం, ఆ తరువాత నేను వివిధ వేదికల నుండి నేను చేసిన ప్రసంగాల మీద చర్చ సాగింది. భారత స్వాతంత్ర్య సమరంలో త్యాగాలు చేసిన ముస్లిం యోధుల సాహసోపేత చరిత్రలను వెలికి తీసి గ్రంథాల రూపంలో వెల్లడించడం. ఆ తరువాత బహిరంగ సభలలో, ఇతర వేదికల మీద కూడా ముస్లిం సమాజం భాగస్వామ్యాన్ని సోదాహరణంగా వివరిస్తూ, మన దేశంలోని ప్రధాన జనసముదాయాల మధ్యన ఉన్న స్నేహ- సోదరభావాలను మరింతగా పటిష్టం చేయడమే నా ప్రధాన లక్ష్యం అంటూ సాగిన నా ప్రసంగం ఆహ్వానిందగిందిగా ఉందని సమావేశం అభిప్రాయపడింది. నా ప్రసంగం తీరు, తెలుగు భాషలో సాగిన విషయ సమర్పణ అందరి మన్నన పొందిందని సమావేశం సంతోషం వ్యక్తంచేసింది.

భారత దేశంలోని హిందూ-ముస్లింల మధ్య ఘర్షణవైఖరి కొనసాగితే ప్రశాంతతకు భంగం వాటిల్లగలదని, ప్రశాంతత లోపించిన ఏ సమాజం కూడా ప్రగతి పథంలో సాగటం సాధ్యం కాదని, అందువల్ల మాతృభూమి ప్రగతికి. జాతి పురోగతికి 'హిందూ-ముస్లింల' మధ్య ఐక్యత అత్యవసరమని, ఆ కారణంగా మతసామరస్యాన్ని మరింతగా బలోపేతం చేయాలన్న దృఢ సంకల్పంతో నాదైన తరహాలో చరిత్ర రచన సాగిస్తున్నానని నా లక్ష్యాన్ని, నా మార్గాన్ని ప్రకటించడం సభికులకు బాగా నచ్చిందని సమావేశంలో సభ్యులు తమ అభిప్రాయాపడుతూ హర్షం వ్యక్తంచేశారు.

ఈ మేరకు బహిరంగ సభ జరిగిన రెండు మూడు రోజుల తరువాత కూడా కువైట్‌లోని హిందూ-ముస్లిం సోదరులు ఫోన్స్ చేసి, తమను కలిసినప్పుడు సానుకూల అభిప్రాయాలను వ్యక్తంచేస్తూ కువైట్‌లోని 'కడప ఇస్లామిక్ వెల్ఫేర్ సొసైటీ' ని, సొసైటీ నిర్వహించిన, నిర్వహిస్తున్న కార్యక్రమాలను అభినందిస్తున్నారని సమావేశంలో సభ్యులు తమ తమ అనుభవాలను వెలిబుచ్చారు.

స్వదేశం నుండి విచ్చేసి తొమ్మిది రోజులపాటు ఇక్కడ గడిపి పలు సభలు, సమావేశాల్లో పాల్గొని భారత ముస్లిం స్వాతంత్ర్య సమరయోధుల అజరామరమైన పోరాట స్ఫూర్తిని వెల్లడించి, ప్రధానంగా తెలుగులో, ఆ తరువాత ఆంగ్లం, ఉర్దూ భాషలలో





కూడా మాట్లాడి, ప్రతి సందర్భంలోనూ సభికులందరి, చివరకు కువైటీల మనస్సులను నేను ఆకట్టుకున్నానంటూ సమావేశం నాకు హృదయపూర్వక ధన్యవాదాలు తెలుపుతూ తీర్మానించింది.

## హృదయపూర్వక కృతజ్ఞతలు

అనంతరం నా అభిప్రాయం తెలియజేమని మిత్రులు కోరగా, పరాయి దేశంలో ఉంటూ కూడా మాతృభూమి గౌరవప్రతిష్టలను ఇనుమడింప చేయు కార్యక్రమాలను భారీ స్థాయిలో నిర్వహించడం అభినందించదగిన విషయమని సభ్యులను, 'సొసైటీ' పెద్దలను అభినందించాను. స్వజనుల ఘనతను విదేశంలో అటు స్వదేశీయులకు, ఇటు విదేశీయులకు కూడా చాటి చెప్పే మహత్తర అవకాశం కల్పించినందుకు, 'చరితార్థులు' ఆల్బమ్‌ను విదేశీ గడ్డ మీద స్వదేశీ ప్రజాప్రతినిధి ద్వారా ఆవిష్కరింప చేయించడం నాకు ఎంతో సంతోషాన్ని కలుగజేసిందన్నాను. ఈ మేరకు నాకు సువర్ణావకాశాన్ని కల్గించిన ప్రధానంగా 'కడప ఇస్లామిక్ వెల్ఫేర్ సొసైటీ' కువైట్ శాఖ కార్యనిర్వాహక వర్గానికి, 'సొసైటీ' పెద్దలకు, సభ్యులకు, మిత్రులకు నా హృదయపూర్వక కృతజ్ఞతలు వెల్లడించాను. నా ప్రయాణానికి అన్ని ఏర్పాటు చేసిన 'కడప ఇస్లామిక్ వెల్ఫేర్ సొసైటీ' కడప శాఖ నాయకులకు ధన్యవాదాలు తెలిపాను.

## నన్ను వెంటాడుతున్న 'ఎంగిలి' అనుభవం

అనంతరం 'కడప ఇస్లామిక్ వెల్ఫేర్ సొసైటీ' కువైట్ అధ్యక్షులు శ్రీ షేక్ న్యామతుల్లా ఏర్పాటు చేసిన విందులో పాల్గొన్నాం. ఈ సందర్భంగా నా మీద మిత్రులకున్న ప్రేమాభిమానాలను అత్యధిక ఆహార పదార్థాల వడ్డన ద్వారా వ్యక్తంచేయడంతో నేను చాలా ఇబ్బంది పడ్డాను. మిత్రులంతా తలా ఓ చెయ్యివేసి ఆహారపదార్థాలను నా ప్లేటులో ఒకరి తరువాత మరొకరుగా కుమ్మరించారు. నలుగురికి సరిపడ ఆహారాన్ని నా ఒక్కడి ప్లేటులో పడేసేసరికి దానిని నేను ఒక్కడినే తినాల్సిన అగత్యం వచ్చి పడింది. అది నాకు అసాధ్యం కావడంతో ఏంచేయాలో తోచని దుస్థితి ఎదురయ్యింది. ఆ ఇరకాట పరిస్థితి నుండి బయట పడడానికి మిత్రులకు క్షమాపణలు చెప్పి, వీలయినంత మేరకు పంక్తిలో నాకు ఇటున్న శ్రీ మహ్మద్ హనీఫ్, అటున్న శ్రీ ఇస్హాఖ్ అలీ ప్లేట్లల్లోకి నా ప్లేటులోని ఆహార పదార్థాలను కొంత కొంతగా సరఫరా చేశాను.

నా ప్లేటులోని ఆహారం తిండిబోతు తనానికి కూడా మించిపోయి, మిగిలి పోయింది. నాది నిస్సహాయ పరిస్థితి. వడ్డించిన ఆహారాన్ని ఏమాత్రం మిగల్చకుండా

తినాలన్నది నేను నిర్దేశించుకున్న నియమం. ఈ నియమాన్ని గత 30 సంవత్సరాలుగా పాటిస్తున్నాను. నా ప్లేటులో గాని, ఇస్తరిలో గాని నేను వడ్డించుకున్న ఆహారంలో ఒక్క మెతుకూ వదల కుండా తినడం అలవాటు. ఆ కారణంగా నా నేను తిన్న ఇస్తరిని చూచి 'ఇస్తరిని నాకేశావా...ఏంటీ?' అని మిత్రులు ఆటపట్టిస్తూంటే, 'నశీర్ తిన్న ప్లేటుని కడగాల్సిన అవసరం ఉండదు' అని బంధువులు వ్యాఖ్యానిస్తుంటారు. అయినా నా నియమాన్ని ఉల్లంఘించకుండా నా మార్గాన నడుస్తున్నా. ఈ విధంగా నేను స్వయంగా నిర్దేశించుకున్న నియమానికి చరిత్ర ఉంది. అయితే అది ప్రస్తుతం అప్రస్తుతం కనుక ప్రస్తావించటం లేదు. నా ప్లేటులోని ఆహారాన్ని ఏంచేయాలన్న క్లిష్టతరమైన మీమాంశలో ఉన్న నేను ఏమీ తోచక అటు ఇటు చూస్తుండగా, నా స్థితిని గమనించిన మిత్రులు శ్రీ పఠాన్ షౌకత్ అలీ ఖాన్ 'ఎంటన్నా? ప్రాబ్లమా?' అన్నారు. సంజ్ఞల ద్వారా నా పరిస్తితి వివరిస్తూ, నా ప్లేటులోని అధికాహారాన్ని చూపుతూ నా ఇబ్బందిని వ్యక్తంచేశాను.

నా పరిస్థితిని గమనించిన శ్రీ షౌకత్ నన్ను చూసి నవ్వారు. ఆ తరువాత ఒక్క నిమిషయం కూడా ఆగకుండా, ఏమాత్రం సంకోచించకుండా నా ప్లేటులోని ఆహారాన్ని తన ప్లేటులోకి తీసుకున్నారు. నా 'ఎంగిలి' అని ఏమాత్రం సంకోచించ కుండా ఆరగించారు. ఆయన ప్రవర్తన నన్ను ఆశ్చర్యపర్చింది. ఈ ప్రవర్తనకు 'ఇస్లాం ధర్మానురక్తులంతా పరస్పరం సోదరులు' అంటూ ఇస్లాం నేర్పిన ప్రగాఢమైన సోదర, సమ భావన ప్రధాన కారణం కాగా, ఆ తరువాత నా మీదున్న ప్రేమాభిమానం మరో కారణం అన్పించింది. 'ఎంగిలి' నిషిద్ధమన్న ఆలోచనకు విరుద్దంగా స్వదేశంలో కూడా స్వజనులు 'త్రాగునీరు' పంచుకోవడం నాకు చాలాసార్లు అనుభవం. ఆహారం కలుపుకుని తింటూ...తింటూ ఇక తినలేకున్నప్పుడు నా ప్లేటులోని 'ఎంగిలి' ఆహారాన్ని ఏమాత్రం సంకోచం లేకుండా అతి కొద్దిపాటి పరిచయం మాత్రమే గల మరో మిత్రుడు ఆరగించడం ఆశ్చర్యకరమైన సంఘటన నా అనుభవ పరంపరలో ప్రధమం.

ఆ కారణంగా కాబోలు కువైట్ సందర్శన నుండి తిరిగి వచ్చేసి నెలలు గడుస్తున్నా, ఆనాటి అనుసరణీయమైన శ్రీ షౌకత్ ప్రవర్తన, 'ఎంగిలి' అను వేర్పాటు భావజాలం స్థానంలో ఇస్లాం ప్రబోధించిన ఆచరణాత్మక 'సమైక్యతా భావం' ఆయనను ఎంతగానో ప్రభావితం చేసిందనడానికి, ఆయన ఆచరణకు ప్రబల సాక్ష్యంగా నిలచిన ఆనాటి సంఘటన, నా మనోఫలకం మీద నుండి ఏమాత్రం తొలిగిపోవటం లేదు. ఈ అనుభవానికి కారణం, 'ఎంగిలి' పట్ల నా మానసిక వ్యవస్థలో ప్రతికూల భావజాలం పూర్తిగా చిట్లంకట్టుక పోవడం అయివుంటుంది.





సరే...ఈ విందు కార్యక్రమం పూర్తయ్యి నేను శ్రీ ఇస్హాఖ్ అలీ మా బసకు చేరుకునే సరికి రాత్రి పదకొండున్నర అయ్యింది. 'రేపు మీ స్వదేశీ ప్రయాణం. లగేజి సర్దుకోవడం, ప్రయాణం ఏర్పాట్లు చూసుకోవడం, శ్రీ సయ్యద్ అబ్దుల్ సలాం గారింట లంచ్ అన్నీ ఉన్నాయి కదా...ఇక పడుకుందాం' అన్నారు శ్రీ ఇస్హాఖ్. ఆ మాట వింటూనే ఆ రోజు కార్యక్రమాలను గుర్తుకు తెచ్చుకుంటూ నమోదు చేశాను. ఆ పని పూర్తయ్యేలోగా శ్రీ ఇస్హాఖ్ నిద్ర పోయారు. ఆయన పెడుతున్న 'గురక' గదిలోని నిశ్శబ్దాన్ని బద్దలుచేస్తూ, శ్రీ అలీ గాఢనిద్రలోకి జారుకున్నారంటూ వాస్తవికతను రోజులాగే ప్రకటించింది.

## కువైట్‌లో నా చివరి రోజు

ఆ రోజు గురువారం, తేది. 05-02-2015. ఉదయాన్నే లేచి, తయారయ్యి మేము నివాసం ఉంటున్న 'ఖేతాన్' ప్రాంతంలోని స్వదేశీయుల హోటల్‌కు వెళ్ళి అల్పాహారం పూర్తిచేశాం. అటునుండి శ్రీ ఇస్హాఖ్ పనిమీద వెళ్ళాం. ఆ పని పూర్తిచేసుకుని సమీపంలోని 'ఫాతిమా మస్జిద్' వద్ద ఉండగా 'సొసైటీ' నాయకుల నుండి శ్రీ ఇస్హాఖ్ కు ఫోన్లు వచ్చాయి. నా ప్రయాణం గురించి, ప్రయాణపు ఏర్పాటు గురించి వారు చర్చించుకున్నారు. చివరకు 'సొసైటీ' మీడియా ఇన్‌చార్జి శ్రీ షేక్ నిజాముద్దీన్‌కు 'సొసైటీ' నాయకులు నాకు సంబంధించిన కొన్ని పనులు అప్పగించినట్టున్నారు. ఆయన ఇటు నాతో అటు శ్రీ ఇస్హాక్‌తో మాట్లాడారు. ఆ మాటలను బట్టి నాకు, నా కుటుంబానికి కానుకలు ఇచ్చి పంపడానికి ఏర్పాటు చేస్తున్నట్టు నాకు అర్ధమైంది.

ఈ బహుతుల్లాంటివి ఏమీ వద్దని నేను ఎంత మొత్తుకుంటున్నా నా మాట వినలేదు. మమ్మల్ని 'ఫాతిమా మస్జిద్' వద్ద ఉండి తన రాక కోసం వేచి చూడమంటూ శ్రీ నిజాం నుండి వర్తమానం అందింది. ఈ సందర్భంగా శ్రీ ఇస్హాఖ్ నాతో మాట్లాడుతూ బహుమతి ఇవ్వడం కువైట్ ప్రజల సాంప్రదాయం. అతిధి బహుతిని నిరాకరిస్తే ఆతిథేయి చిన్నతనంగా, అగౌరంగా భావిస్తాడు. బహుమతి ఎలాంటిదైనా అంగీకరించాల్సిందేనని మరోమారు చెప్పుకొంటూ వచ్చారు. ఆ కారణంగా కాబోలు గతంలో రెండు చోట్ల కువైట్ మిత్రులు అందజేస్తున్న 'కరెన్సీ'ని నేను నిరాకరిస్తే, నిరాకరించవద్దంటూ సంజ్ఞల ద్వారా శ్రీ ఇస్హాఖ్ అలీ నాకు మార్గదర్శకం చేశారు.

ఈ విషయమై మేం మాట్లాడుకుంటూ ఉండగా శ్రీ నిజాం ఆఘమేఘాల మీద మా వద్దకు వచ్చారు. ఆయన తన కారులోంచి పలు రకాల బహుమతులను, బట్టలను తెచ్చి మా కారులో దట్టించారు. 'మాకు నచ్చిన, మాకు ఇష్టమైన బహుతులవి. మా

'సొసైటీ', ఇక్కడున్న తెలుగు ప్రజల పక్షాన మీకు అందజేస్తున్న ప్రేమపూర్వక బహుమతులు అన్నా' అంటూ నన్ను ఆలింగనం చేసుకుని, ఇక వెళ్ళివస్తానన్న అంటూ శ్రీ నిజాముద్దీన్ అక్కడ నుండి సత్వరమే నిష్క్రమించారు.

## 'నెలవంక' సంపాదకుని ఇంట 'విందు'

ఆ తరువాత మేము ఖేతాన్ ప్రాంతంలో గల 'నెలవంక' తెలుగు పత్రిక సంపాదకులు మౌలానా శ్రీ సయ్యద్ అబ్దుల్ సలాం ఉమ్రి ఇంట విందుకు బయలుదేరాం. ఆయన గృహం పైభాగంలో ఉన్న 'సొసైటీ' కార్యాలయంలో విందు ఏర్పాట్లు చేశారు. మేము అక్కడికి వెళ్ళేసరికి మిత్రులంతా ఎదురు చూస్తున్నారు. ఈ భవనంలోనే కువైట్‌లోని 'కడప ఇస్లామిక్ వెల్ఫేర్ సొసైటీ' అధ్యక్షులు శ్రీ న్యామతుల్లా, సంచాలకులు శ్రీ మహ్మద్ హనీఫ్, నెలవంక సంపాదలకు శ్రీ అబ్దుల్ సలాం తదితరులు నివాసం ఉంటున్నారు. ఈ భవనం పై భాగాన 'సొసైటీ' కార్యాలయం కూడా ఏర్పాటు చేసుకోవడం వీరికి అదనపు సదుపాయం కలిగినట్టయ్యింది. ఆ కారణంగా ఇటు ఐపిసి కార్యక్రమాలు గానీ, అటు 'సొసైటీ' కార్యక్రమాలను గాని నిర్వహించడంలో ఎటువంటి ఇబ్బందులు లేకుండా సమన్వయంతో నడుపుతున్నారు.

నేను శ్రీ ఇస్హాఖ్ అలీ ఆ భవనం చేరుకుని, పై భాగాన ఉన్న సొసైటీ కార్యాలయం లోనికి ప్రవేశించగానే మా అతిథేయి శ్రీ అబ్దుల్ సలాం ఎదురు వచ్చి మమ్మల్ని ఆదరంగా స్వాగతించారు. ఆ తరువాత మాటా-మంతి సాగిస్తూ విందుకు ఉపక్రమించాం. శ్రీ సలాం అతిథులను ఆప్యాయంగా వడ్డిస్తూ ప్రేమపూర్వకంగా వ్యవహరించారు. ఈసారి మాత్రం నాకు ఏమాత్రం ఇబ్బంది కలగకుండా నాకు సరిపడ ఆహారపదార్థాలను మాత్రమే ఎంచుకుని ఆనందంగా విందును పూర్తిచేశాను.

## ఆత్మీయుల వీడ్కోలు

ఆ కార్యక్రమం పూర్తయ్యేసరికి మిత్రుల ఒక్కొక్కరుగా నా నుండి వీడ్కోలు తీసుకోవడం ఆరంభించారు. ఆ రోజున విందులో పాల్గొన్న మిత్రులలో చాలా మందికి సాయంత్రం డ్యూటీలు ఉండటం, ఆ రాత్రికి 'మర్ఘూఖ్ అల్ బదర్' మస్జిద్‌లో ప్రతి వారం జరుగు 'గురువారం సమావేశం' కూడా ఉన్నందున ఆ రోజు రాత్రి ఎనిమిది గంటల ప్రాంతంలో నాకు వీడ్కోలు పలికేందుకు తాము కువైట్ విమానాశ్రయానికి రాలేకున్నామంటూ నన్ను ప్రేమగా ఆలింగనం చేసుకుని శ్రీ మహమ్మద్ హనీఫ్, శ్రీ పఠాన్ షౌకత్ అలీ ఖాన్ తదితరులు నాకు వీడ్కోలు పలికారు.







నా 9 రోజుల కువైట్ సందర్శనలో నన్ను తీసుకుని కువైట్ రాజ్యం రహదారుల్లో పరుగులు తీసిన కారు

శ్రీ అబ్దుల్ సలాం ఇంటి నుండి మాకు తోడుగా 'సొసైటీ' కువైట్ అధ్యక్షులు శ్రీ షేక్ న్యామతుల్లా మా బస వరకు మాతో వచ్చి లగేజి సర్దుబాటుకు పలు సూచనలు చేశారు. మా బసకు చేరుకున్న మేము ఆయన సలహా మేరకు లగేజి సర్ది బరువు చూస్తే విమానాశ్రయంలో అనుమతించే 35 కిలోల బరువు కంటె చాలా ఎక్కువ లగేజీ ఉంది. అంత లగేజీని అనుమతించరు కనుక కొంత తీసివెయ్యాల్సి వచ్చింది. అయిష్టంగా మిత్రులు అందజేసిన కొన్ని గ్రంథాలు, బరువుగల ఇతర వస్తువులను శ్రీ ఇస్హాక్ అలీ పరం చేస్తూ లగేజిని ప్యాకప్ చేశాం.

నేను ప్రయాణించాల్సిన విమానం కువైట్ ఎయిర్‌వేస్ వారి 'కెయు 343', ప్రకటించిన సమయం ప్రకారం 05-02-2015 రాత్రి ఎనిమిది నలభై నిమిషాలకు కువైట్ నుండి బయలుదేరి నేరుగా చెన్నైయ్ వెడుతుంది. ప్రయాణ కాలం ఐదు గంటల పది నిమిషాలంటూ నా టిక్కెట్టు ప్రకటించింది. నేను కువైట్ వచ్చేప్పుడు చెన్నైయ్ నుండి నేరుగా కువైట్‌కు బయలుదేరిన కువైట్ ఎయిర్‌వేస్ వారి 'కెయు 344' విమానానికి ప్రయాణ కాలం ఐదు గంటల నలభై నిమిషాలు పట్టగా కువైట్ నుండి చెన్నైయ్‌కు అరగంట ప్రయాణకాలం తగ్గుతుందన్నమాట.

నా లగేజి అంతా సిద్ధం చేసుకున్నాక, తొమ్మిదిరోజుల పాటు మాకు ఎటువంటి అసౌకర్యం, మరెలాంటి ఇబ్బంది లేకుండా, అన్ని కనీస సౌకర్యాలుగల ఖేతాన్ ప్రాంతంలో గల ఆయన గృహంలో బసచేసేందుకు అనుమతించిన మిత్రులు శ్రీ నజీబుద్దీన్ ఖాన్ (నెల్లూరు) కు మనస్సులో ధన్యవాదాలు తెలుపుకుంటూ మరికొంత కొంతసేపు సేదతీరాం.

ఆ తరువాత సాయంత్రం కావస్తుందనగా మిత్రులు శ్రీ షేక్ న్యామతుల్లా మా బసకు వచ్చారు. ఆయనతో కలసి నా లగేజిని కారులోకి చేర్చాం.

ఒక్కసారి అన్ని ఏర్పాట్లు సరిచూసుకున్నాక కువైట్ విమానాశ్రయానికి బయలుదేరాం. విమానాశ్రయం చేరుకున్న కాసేపట్లో మిత్రులు శ్రీ యస్ మహ్మద్ గౌస్, శ్రీ షేక్ నిజాముద్దీన్ వచ్చి మాతో కలిశారు. విమానాశ్రంలో పూర్తిచేయాల్సిన అధికారికంగా కార్యక్రమాలను పూర్తి చేసుకున్నాం. నా లగేజిని వీలయితనంగా తగ్గించి తెచ్చినా కూడా విమానాశ్రయం అధికారులు నా లగేజీ పరిమితికి మించి కిలోన్నర ఉందన్నారు. అయినా ఎక్కువ ఉన్న లగేజిని అనుమతించారు. అప్పుడు మిత్రులిచ్చిన విలువైన గ్రంథాలు, ఇతర సామగ్రి కూడా తెచ్చుకుని ఉంటే బాగుండేదన్పించింది.

## విమానాశ్రయంలో ప్రేమపూర్వక వీడ్కోలు

చివరకు సమయం ఎనిమిది కావస్తుందనగా విమానాశ్రయంలో ప్రయాణీకులు తప్ప ఇతరులను అనుమతించని ప్రదేశం వరకు వచ్చిన మిత్రులు ప్రేమపూర్వకంగా ఆలింగనం చేసుకుంటూ నాకు వీడ్కోలు పలికారు. మిత్రులకు ధన్యవాదాలు తెలుపుతూ, నేను విమానాశ్రయంలో ఇంకా ముందుకు సాగాను. విమానాశ్రయంలో నేను ఎక్కాల్సిన కువైట్ ఎయిర్ లైన్స్ విమానం టెర్మినల్ వెతుక్కోవడంలో కాసింత కన్యూఫూజన్‌కు లోనయ్యాను. విమానాశ్రయంలో ప్రతి విషయం కూడా ఎవ్వరికీ ఎటువంటి కన్యూఫ్యూజన్‌కు అవకాశం లేకుండా మార్గదర్శకాలు ప్రకటించి ఉండటం వలన చివరకు నా టెర్మినల్ ఎక్కడుందో కనుక్కొని అటువైపుగా ఇక ఎటువంటి ఇబ్బంది లేకుండా వెళ్ళాను. మరికొంతసేపు వేచి చూచాక వెలువడిన ప్రకటనలను అనుసరిస్తూ 'కువైట్–చెన్నైయ్' విమానంలోకి ప్రవేశించాను.

అంతా సర్దుబాటు అయ్యాక విశ్రాంతంగా నా సీటులో కూర్చొన్నాను. ప్రకటనలు వెలువడ్డాక మా విమానం ప్రకటించిన సమయానికి కాకుండా అరగంట ఆలశ్యంగా కువైట్ విమానాశ్రయం నుండి గాలిలోకి లేచింది. స్వదేశం నుండి విదేశానికి వచ్చినప్పుడు ఏ విధమైన విధానం 'చెన్నైయ్–కువైట్' విమానంలో కనపడిందో అదే సరళి పునావృతమైంది. తొలుతగా విమానచోదకుని ప్రకటనలు, ఆ తరువాత విమాన సిబ్బంది సేవలు, ఆహారపదార్థాలు, అల్పాహారం, తేనీరు అందజేత. అంతా షరామామూలే! చివరకు ప్రకటించిన సమయం కంటె అటుఇటుగా నేను ప్రయాణిస్తున్న విమానం 06-02-2015 ఉదయం ఐదున్నర ప్రాంతంలో చెన్నైయ్ విమానాశ్రయం చేరుకుంది.







కువైట్ విమానాశ్రయంలో నాకు వీడ్కోలు పలుకుతున్న 'సొసైటీ' కువైట్ నాయకులు
శ్రీ నిజాముద్దీన్, శ్రీ యం.డి గౌస్, శ్రీ న్యామతుల్లా.

## స్వదేశం చేరుకున్నా

తొమ్మిది రోజుల తొలి విదేశీ ప్రయాణం తరువాత స్వదేశం చేరుకున్నా. చెన్నయ్ విమానాశ్రయంలో దిగిన కొద్దిసేపటికి, కువైట్‌లో పూర్తిగా మూగబోయిన నా మొబైల్ రింగ్‌టోన్ 'సారే జహాఁ సేఁ అచ్చా...హిందూస్తా హమార హమారా!' అంటూ నన్ను ఉద్వేగపర్చింది. నన్ను సురక్షితంగా చెన్నయ్ నుండి కడపకు చేరవేయాల్సిన బాధ్యత స్వీకరించిన కారు చోదకులు శ్రీ గౌస్ ఖాన్ నుండి వచ్చిన ఫోన్ కాల్ కు అది సంకేతం. ఆయనకు సమాధానమిచ్చి...ఇవ్వక ముందే నా జీవిత భాగస్వామి శ్రీమతి షేక్ రమిజా భాను, మా మామయ్య శ్రీ హాజీ షేక్ పీర్ అహమ్మద్‌ల నుండి ఫోన్ కాల్స్ వచ్చేశాయ్.

నేను చెన్నయ్ చేరుకున్న విషయం తెలిపి, విమానాశ్రయంలోని అధికారిక తంతు పూర్తి చేసుకుని ఆరున్నరకల్లా బయటపడ్డాను. అప్పటికి రెండు సార్లు ఫోన్ చేసి నా రాక కోసం ఎదురుచూస్తున్న మా వాహనచోదకులు, యువకులు శ్రీ గౌస్ ఖాన్ విమానాశ్రయంలో నాకు ఎదురువచ్చి నా లగేజి తీసుకుని ఎంతో ప్రేమతో తనను అనుస రిం చమని కోరారు. ఆయన వెంట సాగుతూ తిన్నగా విమానాశ్రయం బయట ఆగిఉన్న మా వాహనం వద్దకు చేరుకున్నాం.

ఈ ప్రయాణంలో నాకు ఎటువంటి ఇబ్బంది కలుగకుండా అన్ని జాగ్రత్తలు తీసుకున్నారు. నా ప్రయాణం సుఖప్రదంగా సాగేందుకు కారు ముందు భాగంలో ఇరువురు కూర్చోవాల్సి ఉండగా రెండు టికెట్ల ఖరీదు మొత్తం వాహన యజమానికి చెల్లించి

రెండు సీట్ల స్థలాన్ని నాకొక్కడికి కొరకు రిజర్వు చేయించారు. ఆ కారణంగా కడప నుండి చెన్నెయ్ వెళ్ళపుడు గాని ప్రస్తుతం చెన్నయ్ నుండి కడపకు వచ్చేప్పుడు గాని నాకు ఎటువంటి ఇబ్బంది కలుగలేదు.

## స్వదేశీ ఆగమన సందేశాలు

చెన్నయ్ విమానాశ్రయం నుండి కడపకు బయలుదేరాక మిత్రులందరికి నా స్వదేశం రాకను తెలియపర్చుతూ సందేశాలు పంపాను. ఓ రెండు గంటల ప్రయాణం తరువాత ఒక చిన్న హోటల్ వద్ద ఆగి, ముఖ ప్రక్షాళన గావించి అల్పాహారం చేశాం. అల్పాహారానికి మూల్యం చెల్లించబోగా, మూల్యాన్ని నిరాకరిస్తూ, మా వాహన చోదకులు ఆ మొత్తాన్ని చెల్లించారని హోటల్ యజమాని చెప్పారు. అదేమని మా వాహన చోదకులు శ్రీ గౌస్ ఖాన్‌ను ప్రశ్నించగా 'మీరు మా అతిథి. మిమ్మల్ని ఎటువంటి అసౌకర్యం కలుగకుండా చాలా జాగ్రత్తగా తొడ్కోని రమ్మన్నారు మా బడే హజరత్...మీ మంచి చెడు, సౌకర్యం చూసుకోవాల్సిన బాధ్యత నాది' అంటూ నేను చెల్లించబోయిన కరెన్సీని నిరాకరించారు. నాకు చాలా ఆశ్చర్యం కల్గింది. మా వాహనచోదకునికి 'బడే హజరత్' పట్ల గల గౌరవం, 'సొసైటీ' పట్లగల అభిమానం ఆయన ప్రవర్తనలో వ్యక్తం అయ్యింది. ఆయనకు ధన్యవాదాలు, సోసైటీ నేతలకు మనస్సులో మప్పిదాలు తెలుపుకుంటూ మా వాహనంలో సుఖాశీనుడనయ్యాను.

ఆ తరువాత అత్యంత వేగంగా కడప వైపుకు పరుగులు తీసిన మా వాహనం నన్ను తిన్నగా కడప పొలిమేర్లకు చేర్చింది. ఈలోగా డ్రైవర్ అందజేసిన సమాచారం అందుకున్న 'సొసైటీ' బాధ్యులు శ్రీ షేక్ షబ్బీర్ అహమ్మద్ ఆయన కుమారుడు శ్రీ షేక్ జిలానీ బాషా 'సొసైటీ' కార్యాలయం సమీపాన నా కోసం ఎదురు చూస్తున్నారు. మా వాహనం అక్కడకు చేరుకోగానే ఆ తండ్రి కుమారులు ఇరువురు నన్ను 'సొసైటీ' కార్యాలయంలోకి సాదరంగా ఆహ్వానించారు. నా స్నానపానాదులు ముగించుకుని 'సొసైటీ' మిత్రులతో ముచ్చట్లలో పడ్డాను.

## కడసారిగా 'శశిశ్రీ' పరామర్శ

నా రాకను అనుసరిస్తున్న మిత్రులు, సీనియర్ జర్నలిస్ట్, ఆవాజ్ కడప జిల్లా శాఖ అధ్యక్షులు శ్రీ షేక్ మస్తాన్ వలి 'సొసైటీ' కార్యాలయంలో ఉన్న నన్ను చేరుకున్నారు. ఆయనతో కలసి మిత్రులు, సుప్రసిద్ధ కవి, 'సాహిత్య నేత్రం' సంపాదకులు, బహు భాషాకోవిదులు, నా హితైషులు 'శశిశ్రీ'గా విఖ్యాతులైన శ్రీ బేపారి షేక్ రహంతుల్లా






కడపలో 26-12-2014లో జరిగిన 'మతసామరస్య దినోత్సవం' సందర్భంగా జరిగిన సభలో శ్రీ శశిశ్రీతో నేను శ్రీ షేక్ మస్తాన్ వలి.

గార్ని పరామర్శించడానికి ఇద్దరం వెళ్ళాం. శ్రీ శశిశ్రీ చాలా కాలంగా ఆనారోగ్యంలో బాధ పడుతున్నారు. ఆయనను నేను 26-12-2014న 'దక్షణ భారత కమ్యూనిస్టు ఉద్యమ నిర్మాత' శ్రీ అమీర్ హైదర్ ఖాన్ సంస్మరణ సందర్భంగా జరిగిన 'మతసామరస్య దినోత్సవ సభ'లో చూశాను. ఆయన కూడా ఆ సభలో ప్రసంగించారు. అప్పటికి అనారోగ్యం వలన అయన అంత ధాటిగా మాట్లడలేకపోయారు. విషయాన్ని మాత్రం చాలా స్పష్టంగా ప్రజల ముందుంచారు. ఆయనను చూడాలన్పించింది. శ్రీ మస్తాన్‌తో కలసి శ్రీ శశిశ్రీ గృహానికి వెళ్ళాం. ఆయన కుమారుడు ఆహ్వానించి కూర్చోమన్నారు. మరికొంత సేపటికి శ్రీ శశశ్రీ గారి గదిలోకి అడుగు పెట్టాం. ఆయన చాలా నీరసించి ఉన్నారు. ఆయన పరిస్థితి ఎలాగున్నా ఆయన మాటతీరు, అభిప్రాయాల వెల్లడి, భావ వ్యక్తీకరణలో ఆనారోగ్యపు జాడలు కన్పించలేదు. నేను కువైట్ వెళ్ళి వచ్చినందుకు, అక్కడ కూడా మన పూర్వీకుల వీర గాధలను విన్పించి వచ్చినందుకు ఎంతో సంతోషిస్తూ అభినందించారు. మేము మరికొంత సేపు మాట్లాడాక, ఆయన పరిస్థితి గమనించాక, ఇంకా ఆయనను ఇబ్బంది పెట్టడం బాగుండదన్పించింది. అన్నా ఇక మేం వెళ్ళోస్తాం అన్నాం. 'నన్ను గుర్తుపెట్టుకుని పరామర్శకు వచ్చినందుకు ధన్యవాదాలు సోదరా' అంటూ మమ్మల్ని వెళ్ళిరమన్నారు. శ్రీ శశిశ్రీ నుండి శెలవు తీసుకున్నాం.

## శ్రీ రాచపాళెంకు అభినందనలు

ఆ తరువాత నేను 'కేంద్ర సాహిత్య అకాడమీ' అవార్డు గ్రహిత శ్రీ ఆచార్య రాచపాళెం చంద్రశేఖర రెడ్డి గారిని కలవాలనుకున్నాను. ఆయనకు ఇటీవల 'కేంద్ర



06-02-2015న కేంద్ర సాహిత్య అకాడమీ అవార్డు గ్రహీత ఆచార్య రాచపాళెం చంద్రశేఖర రెడ్డితో ముచ్చటు.

సాహిత్య అకాడమీ' అవార్డు లభించింది. ఆయనను ప్రత్యక్షంగా అభినందించడానికి గతంలో రెండు సార్లు ప్రయత్నించాను. వీలుకాలేదు. ఆకారణంగా ఈసారి తప్పకుండా ఆయనకు అభినందనలు తెలపాలనుకున్న నేను శ్రీ షేక్ మస్తాన్ వలీతో కలసి శ్రీ రాచపాళెం గృహానికి వెళ్ళాం. ఆయనకు మా రాక గురించి ముందుగా తెలిపి ఉన్నందున శ్రీ రాచపాళెం ఎదరు వచ్చి స్వాగతించారు. ఆయనకు పుష్పగుచ్ఛాన్ని అందించి అభివందనాలు తెలిపాను. ఆ తరువాత తీరిగ్గా కాసేపు ముచ్చట్లు చెప్పుకున్నాం. ఈ సందర్భంగా తెలుగు సాహిత్యం మీద, ముస్లిం జనసముదాయాలు తెలుగులో సృష్టిస్తున్న తెలుగు సాహిత్యప్రక్రియల మీద ఆయనతో మాట-మంతి సాగింది. ఈ అంశం మీద ఒక విమర్శనాత్మక వ్యాసం రాయాల్సిన అవసరం ఉందన్న మా అభిప్రాయంతో ఆయన ఏకీభవిస్తూ, త్వరలో అటువంటి రచనా కార్యక్రమం చేపట్టగలనని శ్రీ రాచపాళెం అన్నారు.

## కడప పత్రికా ప్రతినిధులలో ఇష్టాగోష్ఠి

ఆ తరువాత 'జామియతుస్సాలిహత్ లిల్‌బనత్' మదరసాకు వచ్చాం. అనంతరం 'జామియతుస్సాలిహత్ లిల్‌బనత్' మదరసాలో అక్కడ మిగతా మిత్రులతో కలసి భోజనం చేశాం. అక్కడ పాఠశాల ఉపాధ్యాయులతో పిచ్చాపాటి మాట్లాడుతూ కొంత సమయం గడిపాం. నా కువైట్ సందర్శన తరువాత స్వదేశీ ఆగమనం నేపథ్యంలో కడప జర్నలిస్టు మిత్రులు శ్రీ షేక్ మస్తాన్ వలి సహకారంతో 'సొసైటీ' నాయకులు శ్రీ సయ్యద్ అహ్మద్ బాషా (బాబూ భాయ్) పత్రికా ప్రతినిధులతో సాయంత్రం నాలుగు గంటలకు ఇష్టాగోష్టి ఏర్పాటు చేశారు. కడప 'పత్రికా ప్రతినిధులతో ఇషాగోష్ఠి'లో పాల్గొనడానికి బయలుదేరి







ది.06-02-2015 కడప 'సొసైటీ' కార్యాలయంలో జరిగిన పత్రికా ప్రతినిధులతో ఇష్టాగోష్టి.

వెళ్లాం. సరిగ్గా నాలుగయ్యేసరికి 'సొసైటీ' కార్యాలయం చేరుకుని 'సొసైటీ' నాయకులు శ్రీ సయ్యద్ అహమ్మద్ బాషా, డాక్టర్ ముఖ్తార్ అహమ్మద్, షేక్ ఖాజా మొహిద్దీన్‌లతో ఇష్టాగోష్టిలో ప్రకటించాల్సిన అంశాలను మాట్లాడుకున్నాం.

కడప ప్రింట్-ఎలక్ట్రానిక్ మీడియా ప్రతినిధులు 'సొసైటీ' కార్యాలయానికి రాసాగారు. దఫదఫాలుగా విచ్చేస్తున్న పాత్రికేయమిత్రులకు కువైట్ సందర్శనకు సంబంధించిన విశేషాలను వచ్చిన వారికి వచ్చినట్టుగా నేను, డాక్టర్ ముఖ్తార్ అహమ్మద్, షేక్ ఖాజా మొహిద్దీన్‌లు వివరించాము. జట్లు జట్టుగా వస్తున్న పాత్రికేయులతో సంభాషణ రాత్రి ఎనిమిది వరకు సాగింది. నా స్వగ్రామానికి ప్రయాణం సమయం రాత్రి 10 గంటలకు కారణంగా గోష్ఠి ముగించి, నా ప్రయాణం ఏర్పాటుకు ఉపక్రమించాను.

## 'వసీలా టీవి'తో ప్రత్యేక ఇంటర్వ్యూ

ఆ పనులు పూర్తి చేస్తుండగా, 'వసీలా' నూతన ఉర్దూ ఛానెల్ మిత్రులు నా ఇంటర్వ్యూ కోరుతున్నారని మిత్రులు శ్రీ మస్తాన్ వలి చెప్పారు. నా ప్రయాణం ఏర్పాట్లు పూర్తిచేసుకున్నాక 'వసీలా' మిత్రులతో ఇంటర్వ్యూ సాగింది. 'వసీలాటీవి' ఉర్దూ ఛానెల్. కడప నుండి దాని కార్యక్రమాలు ప్రసారం అవుతున్నాయని తెలిసింది. ఆ ఛానెల్‌లో ఉర్దూలో నా ఇంటర్వ్యూ సాగింది. ఈ ఇంటర్వ్యూ పూర్తయ్యేసరికి తొమ్మిదిన్నర కాసాగింది. నా ప్రయాణానికి సమయం కావస్తుందంటూ శ్రీ షబ్బీర్ పదే పదే హెచ్చరించసాగారు. ఆ ఇంటర్వ్యూ పూర్తిగా ముగించి అల్పాహారం తీసుకుని ఆర్టీసి బస్టాండ్‌కు బయలు

# చరిత్రకారుడు నశీర్‌కు కువైట్‌లో ఘన సత్కారం

## 'చరితార్థులు' ఆల్బమ్‌కు విశేష ఆదరణ

Netinijam, Dt. 19-02-2015. Telugu Daily ,Published from Hyd

భారత స్వాతంత్ర్యోద్యమంలో పాల్గొన్న మన పూర్వీకుల ప్రజల అజరామరమైన పాత్రను తెలుసుకునేందుకు కువైట్ దేశంలోని మన తెలుగువారు మాత్రమే కాకుండా ఇతర రాష్ట్రాల ప్రజలతోపాటు, స్వయంగా కువైట్ ప్రజలు, ప్రముఖులు కూడా అత్యంత ఆసక్తి చూపారని ప్రముఖ చరిత్రకారుడు సయ్యద్ నశీర్ అహమ్మద్ తెలిపారు. కువైట్‌లో 'కడప ఇస్లామిక్ వెల్ఫేర్ సొసైటీ'లో కువైట్‌లో నిర్వహించిన 66వ భారత గణతంత్ర దినోత్సవ సంబరాలలో పాల్గొని స్వస్థలం విచ్చేసిన గుంటూరు జిల్లా తాడేపల్లి మండలం, ఉండవల్లి సెంటర్‌కు చెందిన బహుగ్రంథ రచయిత నశీర్ అహమ్మద్ ఆదివారం నాడు తనను కలిసిన విలేకరులతో 10 రోజుల కువైట్ పర్యటన విశేషాలను ముచ్చటించారు.

జనవరి 29 నుండి ఫిబ్రవరి 05 వరకు తాను కువైట్‌లో జరిగిన వివిధ కార్యక్రమాలలో పాల్గొన్నట్టు ఆయన వెల్లడించారు. ఆంధ్రప్రదేశ్ చీఫ్‌విప్ శ్రీ మేడా వెంకట మల్లికార్జున రెడ్డి ముఖ్య అతిథిగా, తాను గౌరవ అతిథిగా పాల్గొన్న ఈ వేడుకల్లో 'భారత స్వాతంత్ర్యోద్యమంలో ముస్లింల పాత్ర' అంశం మీద తాను ప్రధాన ప్రసంగం చేసినట్టు ఆయన చెప్పారు. ఈ సంబరాల్లో తనను 'కడప ఇస్లామిక్ వెల్ఫేర్ సొసైటీ' నాయకులు శ్రీ మేడా మల్లిఖార్జున రెడ్డి ద్వారా ఘనంగా సన్మానించారని తాను రూపొందించిన 'చరితార్థులు' ఆల్బమ్‌ను శ్రీ మేడా ఆవిష్కరించారని నశీర్ అహమ్మద్ తెలిపారు. 'భారత స్వాతంత్ర్యోద్యమంలో ముస్లింల పాత్ర' మీద తాను చేసిన పలు ప్రసంగాలు విన్న వివిధ సాంఘిక సమూహాలు, ప్రజా సంఘాల ప్రతినిధులు తనను ప్రత్యేకంగా తమ తమ సమావేశాలకు ఆహ్వానించి 'భారత స్వాతంత్ర్యోద్యమంలో ముస్లింల పాత్ర' గురించి వివరాలను గుచ్చి గుచ్చి అడిగి తెలుసుకున్నారని, ప్రధానంగా కువైట్ ప్రముఖులు కూడా ప్రత్యేక ఆసక్తి చూపటం జరిగిందన్నారు.

కువైట్‌కు భారతదేశానికి ఎప్పటి నుండో అవినాభావ సంబంధాలు ఉన్నాయని, మొన్న మొన్నటి వరకు మన 'రూపాయి' అక్కడ కరెన్సీగా చలామణి అయ్యిందని, అక్కడి నిర్మాణ కార్యక్రమాలలో, పరిశ్రమలు, వ్యాపార సంస్థలలో భారతీయులు, ముఖ్యంగా తెలుగువారు అత్యధికంగా ఎప్పటి నుండో సేవలందిస్తున్నందున తెలుగువారి పట్ల ప్రత్యేక అభిమానం కువైట్ ప్రజలలో తాను గమనించినట్టు నశీర్ చెప్పారు. కువైట్‌కు చెందిన జనాబ్ ఖాలిద్ సలీం అల్ సదాని అను యువకుడు భారత దేశ చరిత్ర పట్ల ప్రత్యేక ఆసక్తి చూపుతూ అరబిక్‌లో తాను రాసిన చరిత్ర గ్రంథాన్ని తనకు బహుమతిగా ఆయన ఇచ్చారని, అందుకు సంతసిస్తూ భారతీయుల పక్షాన తాను రూపొందించిన తెలుగు, ఆంగ్ల భాషల్లో రూపొందించిన 'చరితార్థులు' కువైట్ యువకునికి అందించానని నశీర్ వివరించారు.

కువైట్‌లో తెలుగువారు లక్షా అరవై వేలు ఉన్నట్టు అనధికారిక లెక్కల ద్వారా తెలుస్తుందని, వీరిలో 70 వేల మంది ఒక్క కడప జిల్లాకు చెందిన వారున్నారని ఆయన చెప్పారు. 1984లో కడప నుండి వచ్చిన స్వదేశీయులకు సహాయ సహకారాలు అందించాలన్న లక్ష్యంలో షేక్ ఇషాఖ్ అలీ అను 24 ఏండ్ల కడప వాస్తవ్యుడు స్థాపించిన 'కడప ఇస్లామిక్ వెల్ఫేర్ సొసైటీ' కడప జిల్లా ప్రజలకు మాత్రమే కాకుండా తెలుగువారందరికీ సేవలు అందిస్తుందని, ఆయన చెప్పారు. ఇతర రాష్ట్రాల ప్రజలతో పోల్చితే మన రాష్ట్రం ప్రజలు పలు ఇబ్బందులకు గురవుతున్నారని, ఈ విషయాలను భారత రాయభారి శ్రీ సునీల్ జైన్‌ను కలసి మహజరు ద్వారా ఆయన దృష్టికి తెస్తూ కేరళ రాష్ట్రంలోని ప్రజల కోసం అక్కడి ప్రభుత్వం అనుసరిస్తున్న తీరును పూర్తి దేశం మొత్తంగా అనుసరించే విధంగా చర్యలు తీసుకోమని కోరామన్నారు. ఈ సందర్భంగా 'భారత స్వాతంత్ర్యోద్యమంలో ముస్లింల పాత్ర' వివరిస్తూ తాను రాసిన గ్రంథాలు, చరితార్థులు ఆల్బమ్‌ను రాయభారి కార్యాలయం గ్రంథాలయానికి అందజేసినట్టు ఆయన చెప్పారు.




కువైట్‌లోని తెలుగుదేశం పార్టీ అభిమానులు ఏర్పాటు చేసిన సమావేశంలో శ్రీ మేడా వెంటక మల్లికార్జునరెడ్డి, తాను అతిథులుగా పాల్గొన్నామని, రాష్ట్రంలోని వివిధ ప్రాంతాలకు చెందిన ముస్లిం స్వాతంత్ర్య సమరయోధుల స్మారకంగా స్థూపాలు ఏర్పాటు చేయాల్సింది గాను, తెలుగుదేశం పార్టీ ముస్లిం నాయకుల్లో ఒకరికి లెజిస్లేటివ్ కౌన్సిల్‌కు ఎంపిక చేసి రాష్ట్ర మంత్రి వర్గంలో స్థానం కల్పించాల్సిన అవసరాన్ని వివరించానన్నారు. ఈ విషయం మీద శ్రీ మల్లికార్జున రెడ్డి స్పందిస్తూ ఈ విషయాలను తాను ముఖ్యమంత్రి శ్రీ చంద్రబాబు నాయుడు దృష్టికి తీసుకెళ్ళగలనని హామీ ఇచ్చారని సయ్యద్ నశీర్ అహమ్మద్ తెలిపారు. ఈ సందర్భంగా 'కువైట్ యన్నార్స్‌డాట్‌కామ్' వ్యవస్థాపాకులు శ్రీ రాజశేఖర్, కువైట్ తెలుగు పార్టీ అభిమానులు ఆ వేదిక మీద ఒక సీనియర్ పాత్రికేయునిగా, చరిత్రకారునిగా తనను గౌరవిస్తూ ప్రత్యేకంగా సత్కరించారని నశీర్ అహమ్మద్ చెప్పారు.

ఈ సందర్భంగా పరదేశీయులను కూడా భారతీయుల జాతీయ పండుగలను బహిరంగంగా, ఘనంగా జరుపుకునేందుకు అవసరమగు అనుమతిని, స్వేచ్ఛను ఇస్తున్న కువైట్ పాలకులను, తనను కువైట్‌కు ఆహ్వానించి తన 'చరితార్థులు' గ్రంథాన్ని ఆవిష్కరింపజేయించడం మాత్రమే కాకుండా, ప్రధాన ప్రసంగం చేయడానికి అవకాశం కల్పించి, ఘనంగా సత్కరించి పంపిన కువైట్‌లోని 'కడప ఇస్లామిక్ వెల్ఫేర్ సొసైటీ' నాయకులకు, ప్రధానంగా తనను ఎంతో ప్రేమాభిమానాలలో ఆదరించి, తన మాతృభూమి చరిత్రను తెలుసుకోటానికి ఆసక్తి, ప్రత్యేక శ్రద్ధ చూపిన కువైట్ ప్రజలకు, ప్రముఖులకు సయ్యద్ నశీర్ అహమ్మద్ ప్రత్యేక ధన్యవాదాలు తెలిపారు.





దేరాను. శ్రీ షేక్ షబ్బీర్ అహమ్మద్ బస్టాండ్ వరకు విచ్చేసి, నా లగేజి అంతా జాగ్రత్తగా బస్సులోకి ఎక్కించి, నా నుంచి శెలవు తీసుకున్నారు.

## 'కువైట్' నుండి 'అప్నాఘర్' చేరిక

కడప నుండి విజయవాడ బయలుదేరిన బస్సు 07-02-2015 ఉదయం ఏడున్నరకు గమ్యస్థానం చేరుకుంది. అక్కడ నుండి ఆటోలో గుంటూరు జిల్లా తాడేపల్లి మండలం, ఉండవల్లి సెంటర్‌లోని మా 'అప్నాఘర్'కు చేరుకునేసరికి సమయం ఎనిమిదయ్యింది. ఉద్యోగ బాధ్యతలు నిర్వర్తించడంలో ఎంతో నిబద్ధతతో వ్యవహరించే మా మేడం శ్రీమతి రమిజా బానుకు తన స్కూలుకు సమయం మించి పోతున్నందున నా అవసరాలన్నీ సిద్ధం చేసి, సర్ది పెట్టి, నాకు ఫోన్ చేసి అన్ని వివరాలు చెప్పి, ఆమె స్కూలుకు వెళ్ళిపోయారు. నేను తిన్నగా ఇల్లుచేరి, అటు కువైట్ మిత్రులకు, 'కడప ఇస్లామిక్ వెల్ఫేర్ సొసైటీ' పెద్దలకు, ఇటు స్వదేశంలోని మిత్రులకు అంతర్జాలం ద్వారా, నా చరవాణి ద్వారా నేను అప్నాఘర్ చేరుకున్న విషయం తెలియజేశాను.

ఆ తరువాత 08-02-2015న తాడేపల్లి మండంలోని పాత్రికేయమిత్రులకు, రాష్ట్రంలోని వివిధ వార, పక్ష, మాస, త్రైమాస పత్రికలకు నా కువైట్ సందర్శనకు సంబంధించిన వివరాలను తెలుపుతూ, కొన్ని ఫోటోలతో సహా అంతర్జాలం ద్వారా నా ప్రకటన విడుదల చేశాను. ఈ సమాచారాన్ని దాదాపు అన్ని దినపత్రికలు ప్రచురించాయి. ఆ తరువాత రాష్ట్రంలోని పలు ప్రాంతాల నుండి వెలువడుతున్న వార, పక్ష, మాసపత్రికలు ఈ సమాచారాన్ని వరుసగా నెలరోజుల పాటు ప్రచురిస్తూ వచ్చాయి.

ఈ విధంగా నా తొమ్మిది రోజుల 'కువైట్ సందర్శన' పూర్తయ్యింది.

## మన్నింపులు

నా 'కువైట్ సందర్శన' ఆరంభం నుండి అది విజయవంతంగా పూర్తయ్యేంత వరకు నాకు అన్ని విధాల సహాయసహకారాలు అందించిన ప్రతిఒక్కరి ప్రస్తావనను ఈ గ్రంథంలో తీసుకొచ్చే ప్రయత్నం చేశాను. ఈ క్రమంలో నేను మర్చిపోయిన మిత్రులు, సోదరులు ఎవరైనా ఉన్నట్టయితే మన్నింపులు కోరుతున్నాను.

### ధన్యవాదాలు



భారత స్వాతంత్ర్యోద్యమంలో ముస్లింల మహత్తర పాత్రను వివరిస్తున్న

# సయ్యద్ నశీర్ అహమ్మద్

చరిత్ర గ్రంథాలు

## భారత స్వాతంత్ర్యోద్యమం : ముస్లింలు



భారత స్వాతంత్ర్యోద్యమంలో పాల్గొన్న ముస్లిం జనసముదాయాల త్యాగాల చరిత్రను సంక్షిప్తంగా వివరిస్తుంది. 1757 నుండి 1947 వరకు బ్రిటీష్ వ్యతిరేక పోరాటాలలో భాగంగా సాగిన ప్రధాన ఘట్టాలలో ముస్లింల పాత్రకు సంబంధించిన విలువైన సమాచారాన్ని క్లుప్తంగా అందిస్తుంది.

**(ఏడవ ప్రచురణ, 1/8 డెమ్మీ సైజు, పేజీలు : 72, మల్టికలర్ టైటిల్, వెల : రు. 25)**

## మైసూరు పులి : టిపూ సుల్తాన్



బ్రిటీష్ పాలకుల సామ్రాజ్యవిస్తరణ కాంక్షను ఆదిలోనే గ్రహించి స్వదేశీ పాలకులను హెచ్చరించడమే కాకుండా, జీవిత చరమాంకం వరకు పరాయిపాలకులతో పోరాడిన తొలితరం జాతీయవాది, మైసూరు పులిగా ఖ్యాతిగాంచిన టిపూ సుల్తాన్ జీవిత చరిత్రను విలువైన చిత్రాలు, ఫోటోలతో ఆవిష్కరిస్తుంది.

**(ఏడవ ప్రచురణ,1/8 డెమ్మీ సైజు, పేజీలు : 69, మల్టికలర్ టైటిల్, వెల : రు. 25)**

## షహీద్-యే-ఆజం అష్ఫాఖుల్లా ఖాన్



సర్దార్ భగత్‌సింగ్‌కు స్ఫూర్తిగా నిలచిన విప్లవకారుడు, స్వాతంత్ర్యోద్యమంలో సంచలనం సృష్టించిన 'కాకోరి రైలు' సంఘటనలో ప్రధాన పాత్ర పోషించి, 27 ఏండ్ల వయస్సులో ఉరిశిక్షను ఆనందంగా స్వీకరించిన యోధుడు అష్ఫాఖుల్లా ఖాన్ ఫోటోలతో కూడిన పోరాట చరిత్రను తెలుపుతుంది.

**(ఐదవ ప్రచురణ,1/8 డెమ్మీ సైజు, పేజీలు : 72, మల్టికలర్ టైటిల్, వెల : రు. 25)**

## భారతస్వాతంత్ర్యోద్యమం:ముస్లిం ప్రజాపోరాటాలు



బ్రిటీష్ పాలకులకు వ్యతిరేకంగా 1765 ప్రాంతం నుండి సాగిన ప్రజా పోరాటాలలో ప్రధానమైన బెంగాల్ సన్యాసులు -ఫకీర్ల ఉద్యమం, వహాబీ యోధుల తిరుగుబాట్లు, ఫరాజీవీరుల విజృంభణ,మలబారు మోప్లాల వీరోచిత పోరాటం, ఖుదా-యే-ఖిద్మత్‌గార్ల అహింసోద్యమచరిత్రలను వెల్లడిస్తుంది.

**(ప్రథమ ప్రచురణ. 1/8 డెమ్మీ సైజు, పేజీలు :168, మల్టికలర్ టైటిల్, వెల : రు.50)**



## భారత స్వాతంత్ర్యోద్యమం : ముస్లిం మహిళలు



స్వాతంత్రోద్యమంలో విశిష్ట త్యాగాలతో, అపూర్వ ధైర్య సాహసాలతో ఆంగ్లేయుల మీద ఉద్యమించిన ముస్లిం మహిళల జీవితగాథలను దృశ్యీకరిస్తుంది. 1857 నుండి 1947 వరకు సాగిన వివిధ పోరాటాలలో భాగస్వాములైన 61మంది మహిళా యోధుల విశేషాలను అందజేస్తుంది.

**(తృతీయ ప్రచురణ,1/8 డెమ్మీ సైజు, పేజీలు :286, మల్టికలర్ టైటిల్, వెల: రు.160)**

## భారత స్వాతంత్ర్య సంగ్రామం : ముస్లిం యోధులు -1



1757లో బ్రిటీషర్ల పెత్తనానికి వ్యతిరేకం ఆరంభించిన పోరాటం నుంచి, ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామం, జాతీయోద్యమంలో పాల్గొని ఆంగ్లేయాధికారులతో, ప్రభుత్వంతో తమదైన మార్గంలో పోరాటాలు, ఉద్యమాలు సాగించిన 35 మంది పోరాటాల యోధుల వివరాలతోపాటు, చిత్రపటాలూ ఈ గ్రంథంలో ఉన్నాయి.

**(ప్రథమ ప్రచురణ, 1/8 డెమ్మీ సైజు, పేజీలు : 316, మల్టికలర్ టైటిల్, వెల : రు. 100)**

## చిరస్మరణీయులు (బ్రిటీష్ వ్యతిరేక పోరాటాల్లో పాల్గొన్న ముస్లిం యోధులు)



1757 నుండి 1947 వరకు సాగిన బ్రిటీష్ వ్యతిరేక పోరాటాలలో పాల్గొన్న ముస్లిం పోరాట యోధులలో ఎంపిక చేసిన ఓ వంద మంది జీవిత రేఖాచిత్రాలు, ఆ యోధుల అమూల్యమైన ఫోటోలు, చిత్రాలు గ్రంథంలో ఉన్నాయి. అలనాటి యోధుల త్యాగపూరిత చరిత్రను సాధికారికంగా క్లుప్తంగా తెలుపుతుంది ఈ గ్రంథం.

**(ద్వితీయ ప్రచురణ,1/8 డెమ్మీ సైజు, పేజీలు : 224, మల్టికలర్ టైటిల్, వెల : రు. 100)**

## 1857 : ముస్లింలు





ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామంలో ముస్లింల భాగస్వామ్యాన్ని, ఆనాడు వ్యక్తమైన హిందూ-ముస్లింల ఐక్యతను,ఆంగ్లేయుల హింసాకాండ, విస్మరణకు గురైన ముస్లింల త్యాగాలు, త్యాగాలు ఒకరు చేస్తే భోగాలు మరొకరు అనుభవిస్తున్న తీరు తెన్నులను సరికొత్త కోణంలో చర్చకు పెడుతూ పలు ఆసక్తికర అంశాలను వివరంగా ప్రస్తావించిన విమర్శనాత్మక గ్రంథమిది.

**(ద్వితీయ ప్రచురణ,1/8 డెమ్మీ సైజు, పేజీలు : 304, మల్టికలర్ టైటిల్, వెల : రు. 130)**

## అక్షరశిల్పులు (ముస్లిం కవులు-రచయితల సంక్షిప్త పరిచయం)




తెలుగులో రాసిన, రాస్తున్న మూడువందల ముప్పై మూడు (333) మంది ముస్లిం కవులు, రచయితలు, అనువాదకుల వ్యక్తిగత, సాహిత్య వివరాలు, అందులో సుమారు 257 మంది ఫోటోలు, పూర్తి చిరునామా, ఫోన్ నంబర్లు, ఈ-మెయిల్ ఐడిలతో కూడిన సమాచారం ఇందులో లభ్యం. తెలుగు వాఙ్మయ చరిత్రకారులచే నభూతో-నభవిష్యతి' అని ప్రస్తుతించబడి, అరుదైన సమాచారం అందించే పుస్తకమిది.

(ద్వితీయ ప్రచురణ, 1/8 డెమ్మీ సైజు, పేజీలు : 184, మల్టికలర్ టైటిల్, వెల : రు. 150)

## భారత స్వాతంత్ర్యోద్యమం : ఆంధ్రప్రదేశ్ ముస్లింలు




భారత స్వాతంత్ర్యోద్యమంలో ఆంధ్రప్రదేశ్ ముస్లింల పాత్రను దర్శింపజేయగల పుస్తకమిది. 1780 నాటి తొలి తిరుబాటు నుండి 1948 వరకు సాగిన పోరాటాల వివరాలున్నాయి. 50 మంది యోధుల జీవిత చరిత్రలు, సుమారు మూడు వందల మంది ఉద్యమకారులన సంక్షిప్త సమాచారం గల ఈ గ్రంథంలో అరుదైన చిత్రాలు ఉన్నాయి. ప్రముఖ రచయితలు చరిత్రకారులచే ప్రస్తుతించబడిన అరుదైన గ్రంథమిది.

(తృతీయ ప్రచురణ, 1/8 డెమ్మీ సైజు, పేజీలు : 394, మల్టికలర్ టైటిల్, వెల : రు. 250)

## చరితార్థులు




1757 నుండి 1947 వరకు బ్రిటిష్ వలస పాలకులకు వ్యతిరేకంగా సాగిన పోరాటాలలో పాల్గొన్న భారత ఉపఖండంలోని ముస్లిం యోధుల చిత్రపటాలు, సంక్షిప్త వివరాలు.

(1/4 డెమ్మీ సైజు, పేజీలు : 352, మల్టికలర్ టైటిల్, మౌంట్ బౌండ్, జాకెట్, వెల : రు. 1000.)

## THE IMMORTALS

Album.Portraits & brief biographical sketches of Muslim Heroes of Indian sub- continent who fought against the British Colonial Rulers from 1757 to 1947.

(1/4 Demmy in Size, Pages-352, Multi colour Title, Mount Bound, Jacket, Rrice Rs. 1000-00)

**ఆజాద్ హౌస్ ఆఫ్ పబ్లికేషన్స్**
3-506, అప్సాఘర్, ఉండవల్లి సెంటర్ - 522501,
తాడేపల్లి మండలం, గుంటూరు జిల్లా, ఆంధ్రప్రదేశ్. Mobile: 9440241727,
Mail:naseerahamedsyed@gmail.com, syednaseerahamed2015@gmail.com



### త్వరలో వెలువడనున్న సయ్యద్ నశీర్ అహమ్మద్ గ్రంథాలు

01. ఆజాద్ హింద్ ఫౌజ్ : ముస్లిం పోరాటయోధులు
02. దక్షిణ భారత కమ్యూనిస్టు ఉద్యమ నిర్మాత : దాదా అమీర్ హైదర్ ఖాన్
03. చిరస్మరణీయులు - 2
04. భారత స్వాతంత్ర్యసంగ్రామం : ముస్లిం యోధులు - 2, 3, 4
05. భారతీయ ముస్లిం సమాజం : అపోహలు-వాస్తవాలు
06. చరిత్ర సృష్టించిన ముస్లిం మహిళలు
07. భారతీయ ముస్లింలు - స్థితిగతులు
08. మాతృభూమి సేవలో కృతార్థులైన ముస్లిం ముద్దు బిడ్డలు



**ఆజాద్ హౌస్ ఆఫ్ పబ్లికేషన్స్**
3-506, అప్సాఘర్, ఉండవల్లి సెంటర్-522501,
తాడేపల్లి మండలం, గుంటూరు జిల్లా
సంచారవాణి : 9440241727
naseerahamedsyed@gmail.com
syednaseerahamed2015@gmail.com

## మా ప్రచురణలు


వెల రూ. 16/-



వెల రూ. 20/-



వెల రూ. 17/-



వెల రూ. 40/-



వెల రూ. 25/-



వెల రూ. 20/-



వెల రూ. 25/-



వెల రూ. 40/-



వెల రూ. 100/-


వెల రూ. 30/-



వెల రూ. 30/-



వెల రూ. 40/-






వెల రూ. 10/-



వెల రూ. 10/-



వెల రూ. 5/-

కువైట్ కబుర్లు

ముస్లిం పర్సనల్ లా

AL-FAROOQ PUBLICATIONS
20/373, Mastan vali Street, KADAPA-516 001.
Ph : 08562 - 245161, 9885409930, 9440708070
e-mail : alfarooqpublications@gmail.com
website: www.kadapaciws.org

సయ్యద్ నశీర్ అహమ్మద్

# కువైట్ కబుర్లు



అల్ ఫారూఖ్ పబ్లికేషన్స్, కడప